హైదరాబాద్ ఆర్క్యాలాజికల్ సీరీస్ సంఖ్య 61

# గాథాసప్తశతిలో తెలుగు పదాలు

తిరుమల రామచంద్ర




జనరల్ ఎడిటర్

డా॥ వి. వి. కృష్ణశాస్త్రి,

ఎమ్.ఎ., పిహెచ్.డి.

రాష్ట్ర పురావస్తు మరియు మ్యూజియంల శాఖ డైరెక్టరు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

హైదరాబాద్

1983

హైదరాబాద్ ఆర్కియాలజికల్ సీరీస్ సంఖ్య 57

# గాథాసప్తశతిలో తెలుగు పదాలు

తిరుమల రామచంద్ర




జనరల్ ఎడిటర్
డా॥ వి. వి. కృష్ణశాస్త్రి,
ఎమ్.ఎ., పిహెచ్.డి.
రాష్ట్ర పురావస్తు మరియు మ్యూజియంల శాఖ డైరెక్టరు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
హైదరాబాద్
1988

# కృతజ్ఞతలు

గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు 1935 లో ఒకదో ప్రసంగ వశాత్తు "గాథా సప్తశతిలో చాల తెలుగు పదాలు వుండే అవకాశం ఉంది" అన్నారు. అప్పటినుంచి నేను, గాథా సప్తశతిని, తక్కిన ప్రాకృత కావ్యాలను అధ్యయనం చేస్తూ వివిధ విషయాలు సేకరించాను. ఆ సేకరణ ఫలితమే ఈ వ్యాసాలు

వాటి కేవలం సత్యాన్వేషణం. నేను చెప్పినదంతా ఒప్పుకోండనే నిర్బంధమేమీలేదు. సత్య దృష్టితో పరిశీలించడానికి ప్రయత్నించాడు సుమా! — అని పాఠకులు భావిస్తే చాలు.

ఈ వ్యాసాలన్నీ వివిధ పత్రికలలో ప్రచురితమైనవే. విషయ సూచికలో ఆ పత్రికల పేర్లు తెలిపినాను. ఆ పత్రికల సంపాదకులకు కృతజ్ఞుణ్ణి.

ఈ వ్యాసాల సంపుటికి మరి రెండు వ్యాసాలు గాథా సప్తశతిలో సుభాషితాలు, గాథా సప్తశతిలో మన స్త్రీల మాధుర్యం—చేర్చాను. తక్కిన వాటిని సవరించాను. శీర్షికను "గాథా సప్తశతిలో తెలుగు పదాలు" అని మార్చాను.

దీనిని పురావస్తుశాఖ కమీషనర్, వివిధశాస్త్ర పారంగతులు శ్రీ పి. సీతాపతి గారు (ఎం.ఏ.,ఎఫ్.ఆర్.ఏ.ఎస్.,ఐ.ఏ.ఎస్.) పురావస్తుశాఖ, గ్రంథమును ముద్రించడానికి అంగీకరించారు. వారికి నా ధన్యవాదాలు

ఈ సవరించబడిన ముద్రణ కూడా జనాదరం పొందగలదని విశ్వసిస్తున్నాను.

ఆదర్శనగర్,
హైదరాబాద్.
రౌద్రి విజయదశమి.

భాషా సేవకుడు,
తిరుమల రామచంద్ర.

# పరిచయం

ప్రాకృత భాషలో వెలువడిన గ్రంథాలలో "గాథా సప్తశతి"కి ఒక ప్రత్యేకత ఉంది. ఇది దక్షిణ భారత దేశాన్ని మూడు వందల సంవత్సరాలకు పైగా పరిపాలించిన శాతవాహన రాజుల కాలం నాటిది అయివుండడం ఒకటి, రెండవది సప్తశతిలోని ప్రతి శ్లోకం ఆ కాలం నాటి అనగా రెండువేల సంవత్సరాల నాటి ప్రజల సాంఘిక జీవనాన్ని తెలిసికొనడానికి చాలా ఉపయుక్తమైనది. క్రీ. పూ. 4, 3 శతాబ్దాల నాటికే ఆంధ్ర దేశంలో బౌద్ధమతం పాకుకొని వున్నది. హైందవ మత ఛాయలు ఎక్కడా కనిపించవు. ఆ నాటి ఆంధ్రులు పూర్తిగా బౌద్ధాన్నే ఆదరించారని చెప్పడానికి సందేహం లేదు. బౌద్ధంతో పాటు ప్రాకృత భాషకు కూడా విపరీత ప్రచారణ లభించింది. దేశి భాష అనుకొనే తెలుగు భయం భయంగా ఏ మూలనో నక్కి వుండవచ్చు. భవిష్యత్తులోని పరిశోధనలో అలా చీకటి కోణాల్లో దాగున్న తెలుగుకు వెలుగు నీయవచ్చు. ఆ నాడు ఆసేతు హిమాచలం బ్రాహ్మీలిపి, ప్రాకృత భాష మాత్రమే వుండేవని నిరూపిస్తే, ఈ నాటి జాతీయ సమైక్యతా వాదులకు పరమానందమౌతుంది. బౌద్ధాన్ని అవలంభించిన ఒక బ్రాహ్మణ కుమారునితో బుద్ధుడు ప్రాంతీయ వచనాలని వాడుకోవటంలోని విశిష్టతను విప్పి చెపుతాడు. ఈ నాడు ఆంగ్ల భాష లాగ ఆ నాటి ప్రాకృతం వాహనంగా గల బౌద్ధ ధర్మం దేశాన్ని ఏకీకరణం చేసింది.

ఈ మధ్యకాలంలో అనేకమైన బౌద్ధ ఆరామస్థూపాలు పురావస్తు శాస్త్రజ్ఞులకు కంటబడ్డాయి. అనేక ప్రాకృత శాసనాలు వెలికి వచ్చినాయి, కాని ముచ్చటగానైనా ఆనాటి ఒక్క తెలుగు శాసనం కంటబడలేదు. దీనికి కారణం తెలుగు లేనేలేదని కాదు, పరిశోధన పరిపూర్ణం కాకపోవచ్చు.

బౌద్ధులు తత్సమ పదాల్ని తద్భవాలుగా మార్చుకొని ప్రచారణ కోసం ప్రాకులాడారు. మరి ఆనాటి జైనులు అట్లా కాదు. తత్సమాల్ని అరకంగానే వాడుకొని ప్రాంతీయ భాషలైన తెలుగు, కన్నడం, అరవం, మొదలైన భాషలకు క్రొత్త రూపును, వూపిరిని యిచ్చారు.

క్రీ.శ. 4, 5 శతాబ్దాలలో బౌద్ధానికి క్షీణదశ ప్రారంభమైంది. బౌద్ధంతో పాటే ప్రాకృతానికి కూడ దుర్గతి పట్టింది. దీనికి అనేక కారణాలు చెప్పబడ్డాయి; బౌద్ధధర్మంలో అధర్మాలు పెచ్చు పెరిగినాయని లేక వీరశైవం స్వైర విహారం చేసిందని చెప్తారు. ఏది ఏమైనా ఒకానొకప్పుడు ఆంధ్రావనిని పూర్తిగా అలుముకొన్న బౌద్ధం, దాని తాలూకు స్థూప, చైత్య విహారాలు మట్టిలో కలిసినాయి. ఆశిథిలాల మీద శైవ, వైష్ణవాలయాలు వెలిసినాయి. ప్రాకృతం

నోరుమూసింది. సంస్కృతం నోరు విప్పింది. ప్రాకృత భాష అదృశ్యమవుతున్న కాలం నాటి కొన్ని సంస్కృత శాసనాలలో కూడ చాల విరివిగా తెలుగుపదాలు వాడబడ్డాయి. నాలుగు, ఐదు శతాబ్దాలనాటి విష్ణుకుండినుల శాసనాలలో రావిరేవు, పెణ్కపఱ్ఱు మొదలైన ఎన్నో తెలుగు పదాలు మెరుస్తూ వుంటాయి.

ఇహను 'గాథాసప్తశతి'ని గురించి మరొక మాట. ముందన్నట్లుగా ఈ గ్రంథం ఆనాటి సామాజిక జీవితానికి అద్దంలాంటిది. ఆనాటి గ్రామ పరిస్థితులు, అధికారులు, అడవులు, తోటలు, పచ్చని పొలాలు, తామర కొలనులు, వాటి మధ్యకనిపించే పూరిగుడిసెలు. వాటి చుట్టు కంచెలూ, స్త్రీ-పురుషులూ, పెళ్ళిళ్ళూ పేరంటాలు, పురుళ్ళూ-పుణ్యాలు, వుత్సవాలు-వూరేగింపులూ, అలుకలూ అలకలూ, ఆలుమగల అనుబంధాలు, వేశ్యల సరస సల్లాపాలు, అత్తా కోడళ్ళ సామరస్యాలు, స్త్రీ-పురుషుల చాటుమాటు ప్రేమలు——ఒకటేమిటి, ఎన్నెన్నో! ఒక అధునాతన చిత్రం చూస్తున్నట్టుగా వుంటుంది. ఆనాటి ఆచారవ్యవహారాలు, ఆభరణ అలంకారాలూ, ఈనాటికీ ఆంధ్రుల్లో వున్నాయి. కంటెలూ, మెలమూళ్ళు, గాజులు, తాటంకాలు, చెవుల్లో పువ్వులు, కుప్పెలు, నీలాల దుద్దులు, పసుపు పారాణులూ, [illegible], చీరలు-రవికెలు, అంగ వస్త్రాలు, ఒకటేమిటి? అన్నీ ఈనాటికీ నిలచిపోయినాయి. నూట ఎభై సంవత్సరాలు పాలించిన ఆంగ్లేయుల ఆచార వ్యవహారాలు అంతగా అబ్బకపోతే అంతకు రెట్టింపు కాలానికి పైగా ప్రజారంజకంగా పాలన చేసిన శాతవాహనుల కాలం నాటి ఆచార వ్యవహారాలు నేటికీ కన్పించటంలో విశేషం లేదు.

ఈ ప్రచురణ కర్త శ్రీ తిరుమల రామచంద్ర గారిని తెలియని తెలుగు వాళ్ళు తక్కువ. తెలుగు సాహిత్యానికి వెలుగు ప్రసాదించిన కొద్దిమంది ఆధునికులలో ఆయన అగ్రగణ్యుడు. మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, నుడి-నానుడి, తెలుగు వెలుగులు, ధర్మదీక్ష, దక్షిణాంధ్రి పీఠలు మొదలైన వీరి రచనలు సంచలనాత్మకాలు. సాహితీ పరులలోను, సంస్కృతి పరిశోధకులలోను వీరి గ్రంథాలు సమాన ఆదరణ కల్గివున్నాయి. వీరు ప్రచురించిన అనేక వ్యాసాలు ఉత్కృష్ట రసానుభూతిని కల్గిస్తాయి.

మేము ప్రచురిస్తున్న వీరి గ్రంథం "గాథా సప్తశతిలోని తెలుగు పదాలు" సాంస్కృతిక పరిశోధకులకు ఎంతగానో వుపకరిస్తుంది.

రాజకీయ చరిత్రపరిశోధన మరుగునపడ్తూ, సాంఘిక, సాంస్కృతిక చరిత్ర పరిశోధనకు ప్రాధాన్యమిస్తున్న నేటి కాలానికి వీరి గ్రంథం ఎంతో వుపకరిస్తుంది.

వి. వి. కృష్ణశాస్త్రి

# విషయసూచిక

1

# గాథా సప్తశతిలోని తెలుగు పదాలు

రాజకీయ ప్రాబల్యమూ, సాహిత్య ప్రాచుర్యమూగల భాషలు ఇతర భాషలను, జాతులను లోబరచుకొంటాయి. పూర్వం మతానికీ, రాజకీయాలకూ అంతరం లేదుగనుక ప్రాచీనార్య భాష మాండలిక మాత్రమైనప్పటికీ సంస్కృతభాష ఇతర భారతీయ భాషలను కొన్ని శతాబ్దాల వరకూ తల యెత్తనివ్వలేదు. మతంతోపాటు వ్యాపించిన సంస్కృతం విభిన్న జాతులతో, సంఘాలతో సంబంధం ఏర్పడినకొద్దీ వారి భాషల పదాలనూ, భావాలనూ ఆకళించుకొన్నది. డాక్టర్ గుండెర్ట్ పండితుడన్నట్టు ఆర్య భాషా పదాలను, సంప్రదాయాలను సంతరించుకొనకపోయివుంటే, సంస్కృత సాహిత్యం ఇంత విశాలంగానూ, సమృద్ధంగానూ అయివుండేదే కాదు.[1] సంస్కృత ప్రత్యయాలతోను, ఉపసర్గలతోను ఇతర భాషా పదాలు వేషం మార్చుకొని సంస్కృతంలో లీనమయినవనడానికి తంత్రవార్తికకారుడు కుమారిలభట్టు వాక్యాలే మనకు నిదర్శనం.

మీన, పీలు, కుంతల, పేరంభ, పలాండు, పున్నాగ, మరీచ, వ్రీహి, అటవీ, పుత్ర, మందిర, ఖడ్గ, కళిపు, పుట్ట, శంకు, బలాకా, సూచనాదులయిన శబ్దాలు దక్షిణ భారత భాషల నుండి సంస్కృతంలో చేరినట్టు కిట్టెల్ పండితుడు తన కన్నడ నిఘంటువులో సోపపత్తికంగా నిరూపించాడు.[2] "పున్నామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్త్రః" అనే వ్యుత్పత్తికంటే పుట్టు ధాతువు నుంచి జనించిన పుట్ట శబ్దం 'పుత్త్ర'గా మారిందనడమే సహేతుకమేమో! మందిర శబ్దానికి మను + ఇరు పదాలే మూల మనడం సమంజసం. వెళ్ + పక్కి బలాకా అయివుంటుంది. ఏదో ఒక విధంగా వ్యుత్పత్తి కల్పిద్దామనే ఉద్దేశంతో సంస్కృత వైయాకరణులు శబ్దాల మూలస్వరూపం గుర్తించక, దానిని గుర్తించరానంత తప్పుదోవ పట్టించారు. కావి + ఏఱు = కావేఱు–కావేరి (ఎఱ్ఱని నీరుగల నది) అనే వ్యుత్పత్తి స్పష్టంగా కనిపిస్తుండగా, "కవేరస్య అపత్యం స్త్రీ" అని వ్యుత్పత్తి చెప్పడంలోనే సంస్కృత వ్యామోహం ఎంత ఉందో మనకు విస్పష్టం. గోద + ఏరే = గోదావరి అయింది.

సంస్కృతం మాండలికంగా మాత్రమే ఉన్నప్పుడు సర్వజనీనంగా అభివృద్ధి పొందిన ప్రాచీన భాష ప్రాకృతం కూడ ఇతర దేశ్యాలను తనవిగా చేసుకొనకపోలేదు. ప్రాకృత వైయాకరణులు, నిఘంటుకారులు దేశ్యాలపై ప్రాకృత ముద్ర వేద్దామనే వ్యామోహం లేనందున వాటిని ప్రత్యేకంగా పేర్కొన్నారు.

ఆర్యావర్తంలోని మగధలో బుద్ధుని కాలపు వ్యవహార భాష పాలీ తన సిద్ధాంతాలను బుద్ధభగవానుడు ఆ భాషలోనే ఉపదేశించాడు. బుద్ధుని

1. డాక్టర్ గుండెర్టు మలయాళం-ఇంగ్లీషు కోశం పీఠిక.
2. కిట్టెల్ కన్నడ-ఇంగ్లీషు నిఘంటువు పీఠిక.

# 2

ఉపదేశాలతో పాలీని మొట్టమొదట దక్షిణాపథానికి తెచ్చినవాడు అశోకుడు. దక్షిణాపథంలోను పాలీ భాష వ్యవహరింపబడేదనీ, ఇతర భాషలు లేవనీ, అశోకుడూ, ఖారవేల్లుడూ పాలీ భాషలో శాసనాలు వేయించడానికి ఇదే కారణమనీ చేసేవాదం సహేతుకం కాదు. పాలీని మత భాషగా గ్రహించడం వల్లనే (పూర్వం మతానికే ప్రాధాన్యం గనుక) అశోకుడు పాలీలో శాసనాలు వేయించాడు; ఖారవేల్లుడు తెలుగు వాడయినప్పటికీ అంతే.

బృహత్కథలో ప్రాకృత, సంస్కృత, దేశిభాషలు వున్నట్లు వేర్వేరుగా ఉల్లేఖించడమూ, క్రీస్తుశకం మొదటి శతాబ్దానికి ముందున్న పాలీ శాసనాలలో కూడ తెలుగు వూళ్ల పేర్లు లభించడమూ, చీనా యాత్రికుడు హుఎన్‌త్సాంగ్ 7వ శతాబ్దం ప్రారంభంలో కళింగానికి వచ్చినప్పుడు అక్కడి భాషలు వేరేనని తెలుపడమూ. దాక్షిణ్య చిహ్నసూరి కుమారపాలచరితంలోని జాతివర్ణన, అన్నిటి కంటే ముఖ్యంగా కర్నాటక దేశంలో లభ్యమౌతున్న ప్రాచీన శాసనాలూ దక్షిణాపథంలో పాలీగాని, సంస్కృతంగాని సామాన్య వ్యవహార భాషలుగా లేవనడానికి ప్రబల నిదర్శనం. డాక్టర్ సునీతికుమార చట్టర్జీ అన్నటు పాలీ భాషలో శాసనాలు వెలయించిన ఖారవేల్లుని పేరూ తెలుగే (కాలు బట్ వేల్ నల్లటి బల్లెం గలవాడు). జైన బౌద్ధ మతాలద్వారా దక్షిణ భారత దేశంలో వ్యాపించిన ప్రాకృత భాష కూడ సంస్కృతం వలెనే దేశిభాషల సంప్రదాయాలనూ, శబ్దజాలాన్నీ లోబరచుకొన్నదని ఈ వరకే అన్నాను. ప్రాకృతంలో మిళితమైపోయిన రోలంబ, రింఛోళి, తాలూర మున్నగు దేశిశబ్దాలను సంస్కృత మహాకవులు గూడా గతానుగతికంగా ప్రయోగించగా, మేదినీ మున్నగు నిఘంటువులు స్వీకరించి సంస్కృత ముద్రవేశాయి. "రోలంబ శబ్దం సంస్కృతేపి కేచిద్గతానుగతికతయా ప్రయుంజంతే" అని హేమచంద్రుడు దేశీనామమాలలో ఉగ్గడించాడు.[3]

ప్రాకృతంలో చెప్పు, చెక్కు, చూచు మున్నగు తెనుగు క్రియలు చవఇ, చలఇ, చచ్ఛఇ, చజ్జఇ మున్నగు రూపాలతో చేరిపోయాయి ఈ విధంగా గుర్తించరానంత మార్పుతో అన్యదేశి శబ్దాలు ప్రాకృత సాహిత్యంలో మిళితం కావడం వల్లనే ఆచార్య హేమచంద్రుడు దేశీ శబ్దాలకు అన్వయమే కుదరదనీ, అన్వయం కుదిరినా అర్థం కావడం కష్టమనీ దేశీనామమాల ప్రారంభంలోనే అన్నాడు (దేశీ దుస్సందర్భాః ప్రాయస్సందర్భితాపి దుర్బోధా, ఆచార్య హేమచంద్రః తత్తాం సందృభతి, విభజతిచ.)[4] దేశీపదాలకు వ్యుత్పత్తి తెలియనందున ప్రాచీన సంప్రదాయ సిద్ధమైన అర్థాన్నే గ్రహించాలని హేమచంద్రుడు నిర్దేశించాడు. దేశీ శబ్దాలు అర్థం కాక తప్పుడు వ్యాఖ్యలు చేసిన వారినిచూచి హేమచంద్రుడు "ఇప్పటి దేశీకవులూ, వారి వ్యాఖ్యాతలవి ఎన్నితప్పులని ఏరను?" (అధునాతన దేశీకారాణాం తద్వ్యాఖ్యాతౄణాంచ కియంతః సమ్మోహాః పరిగణ్యంతే) అని ఎంతో కష్టపడ్డాడు.[5] తాను "సారతర దేశీదర్శనం" తో వ్రాస్తున్నానని, తన

---

3. దేశీనామ మాల 7-2 వివృతి.
4. దేశీనామ మాల-1.
5. దేశీనామమాల-8-12.

నిఘంటువులలో పొరపాట్లుండవని "తిణిసశబ్ద" వ్యాఖ్యాన సందర్భంలో స్పష్టపరిచాడు (తిణిసంచ వృక్షవిశేష మాచక్షతే. అస్మాభిస్తు సారసార దేశదర్శనేన తిణిసశబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాత, తత్ర యుక్తాయుక్తస్య బహుసృశ్యావః ప్రమాణం. తిణిస మనే పదానికి ఏదో చెట్టు అని కొందరు చెబుతున్నారు. దేశి సారాన్ని దర్శించిన మేము తిణిస శబ్దానికి తేనె తెట్టు అని వ్యాఖ్యచెప్పాము).[6] ఈ వ్యాఖ్య ఎంతో న్యాయంగాను, సముచితంగాను వుంది. తేనె అనే పదం తమిళంలో తేన్ అని, కన్నడంలో జేన్ అని అయింది. తిణిస పదం తేనె-జేన్‌లకు దగ్గరగా వుండడం వల్ల ఆచార్య హేమచంద్రుడు సరిగా శబ్దార్థాన్ని ఊహించాడనే అనాలి. సంస్కృత ప్రాకృత సాహిత్యాలలో యుగపురుషుడుగా వెలసిన హేమచంద్రుని వంటివాడు భ్రాంతిపడడం పొసగదనుకుంటాను.

గాథా సప్తశతిలో కొంతకు కొంతయినా తెలుగు గడ్డపై వెలసిన రచన. ప్రజా కవులు రచించిన ఈ అమరగాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు సంతరించినవాడు హాల సాతవాహనుడు. హాలుని కాలం క్రీస్తుశకం 69-వ సంవత్సరమని విన్సెంట్ స్మిత్ నిర్ణయం. తెలుగుదేశాన్ని ఏలిన ఈ కవిరాజు సేకరించిన ఈగాథలలో దేశిపదాలు, ముఖ్యంగా తెలుగుపదాలూ, సంప్రదాయమూ వెల్లివిరియకమానవు గదా! దీనిలో ప్రయోగించిన అత్త, తుప్ప, మఇల, మడహ, కిలించిఅ, పీలుఅ, ఎక్కల, పక్కల, మున్నగునవి ప్రాకృతపదాలు కావని, కేవలం దేశ్యాలేనని, నిర్ధరించడానికి శ్రీకులబాలదేవుడు మున్నగు గాథాసప్తశతీ వ్యాఖ్యాతలు, పాదలిప్తాచార్యుడు మొదలు ఆచార్య హేమచంద్రుని వరకు గల ప్రాకృత వైయాకరణ, నిఘంటుకారులూ ప్రమాణం. ఉచ్చారణ సాదృశ్యాన్ని, అర్థసామ్యాన్ని బట్టి వీనిలోని తెలుగు శబ్దాలను వింగడించడానికి ప్రయత్నిస్తాను.

## 1. అత్తా :

ఎత్థ ణిమజ్జఇ అత్తా, ఎత్థ అహం, ఎత్థ పరియణో సఅలో,
పంథిఅ, రత్తీఅంధఅ, మా మహ సఅణే ణిమజ్జిహిసి!

(శతకం 7, గాథ 67)

(అత్ర నిమజ్జతి శ్వశ్రూః, అత్ర అహం, అత్ర పరిజన స్సకలః
పథిక, రాత్ర్యంధ మా మమ శయనే నిమజ్జిష్యసి!)
(ఇచట నే నిరుందు, నిచ్చట నత్తగా
రిచట పరిజనంబు; లెఱిగి కొనుము.
రాత్రి నీకు గానరాదు నాశయ్యపై
తప్పి పడెదవేమొ! దారికాడ!)[7]

---

6. దేశీనామమాల 3-12.

7. రసవంతాలైన ఈ గాథలు పాఠకులకు తెలియడం కోసం కీర్తిశేషులు శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారి తెలుగు అనువాదం మొదట ముద్రణ పొందుపరచాను.

తన అభిప్రాయాన్ని తెలుసుకొన్న తెరువరిని ఉద్దేశించి ఒక జారిణి అన్నమాట ఇవి: "ఎత్థ ణిమజ్జఇ అత్తా" (ఇక్కడ అత్త పడుకుంటుంది) అనే ప్రథమపాదంలో 'సాసూ' అనే శబ్దానికి మారుగా కవి 'అత్తా' అనే పదాన్నే ప్రయోగించాడు. 'అత్తా' అనే పదం గాథాసప్తశతిలో పన్నెండు సార్లు ప్రయుక్తమైంది. ఆ గాథల పాదాలు మాత్రమే ఉదాహరిస్తున్నాను. 1. అత్తా తహ రమణిజ్జం (1-8), 2. గ్రామణి ఘరమ్మి అత్తా (5-69), 3. మహ మహఇ మలఅదాఽ, అత్తా వారేఇ (5-97), 4. అత్తా ణ వాఇ మలఅగంధవహో (6-42), 5. అత్తా మత్తా పఈవి అణత్థో (6-49). 6. పంజర సారిం అత్తా (6-52), 7. చింతిజ్జంతో పుణవల్లహో అత్తా (7-57), 8. వాహేణ రుఅవిఅ అత్తా (7-63), 9. ఎత్థ ణిమజ్జఇ అత్తా (7-67). 10. భణిప భణామి అత్తా (7-74). ఈ అత్తా తెలుగు అత్తగారే ననడం స్పష్టం. ఛాయాకారులూ, వ్యాఖ్యాకారులూ దీనికి శ్వశ్రూః అని అర్థం చెప్పడం మన ఊహకు సాధకం. మామభార్యకు మామీ అనీ, మేనత్తకు పిఉచ్ఛా అనీ పలుగాథలలో ప్రయోగాలు కనబడుతున్నవి. తెలుగువారికి మాత్రం మేనత్తయినా, అత్తగారయినా, మామభార్యఅయినా అత్తే. దీనికి కారణం తెలుగు, కన్నడదేశాలలో వున్న మేనరికపు సంప్రదాయమే. అత్తాళ్ అంటే తమిళంలో అమ్మ అని అర్థం. మాతృసమానగనుకనే పిల్లను ఇచ్చిన ఆమెకూడ అత్తాళే. ఇదిక్రమంగా అత్త అన్నంతవరకే మిగిలి వుంటుంది. అత్తై, అత్తె అనికాకుండా అత్తా అని దీర్ఘాంతంగానే గాథలలో వుండడంవల్ల ఈ పదాన్ని ప్రాకృత కవులు తెలుగు నుండే గ్రహించి వుంటారు. (దేశీనామమాల 1-51).[8]

## 2. వాలుంకి :

సహి ఈరిసివ్వఇ గఈ మా రువ్వసు తంస వలిఅ ముహఅందం,
ఏఆణ బాలవాలుంకి తంతు కుడిలాణ పేమ్మాణం!

(అలఅప్ప : 1-10)

(సఖి ఈదృశ్యేవ గతి : మారోదీః తిర్యగ్వలిత ముఖ చంద్రం,
ఏతేషాం బాల కర్కటీ కుటిలానాం ప్రేమ్ణామ్.)

ప్రణయ కలహంతో పెడమొగం పెట్టిన నాయికను ప్రణయాభిముఖనుగా చేయడానికి చెలికత్తె ఇలా అంటున్నది: "సఖి, ఎందుకలా పెడమొగంతో కన్నీళ్లు కుక్కుకుంటున్నావు? ప్రేమ వాలుంకి పిల్ల కాళ్ళవలె దగ్గర వున్నవారిని చుట్టుకుంటుంది. కొంచెం లాగితే, వాటివలెనే ముక్కలు, ముక్కలుగా విరిగి పోతుంది."

ప్రేమ చాల సుకుమారమని తెలుపడానికి గ్రామీణులకు తరచుగా తెలిసిన పిల్లవాలుంకి లేతకాళ్ళను అల అకవి (బహుళ ఇతడు అల్లయ్య అయివుంటాడు?)

---

8. ఆచార్య హేమచంద్రుడు దేశీనామమాల పేరుతో ప్రాకృత సాహిత్యంలోని దేశీపదాల నిఘంటువు రచించాడు. గాథాసప్తశతిలోని తెనుగు పదాలకు దేశీనామ మాల ప్రమాణం కూడ పొందుపరుస్తున్నాము.

చక్కగా పోల్చి చెప్పాడు. తెలుగులో ఒల్లెంక, వాలుగ అనే రెండు పదాలు మత్స్య భేదాలు తెలిపేవి వున్నవి. ఒల్లెంక సన్నని కాళ్ళతో గోళాకారంగా వుండే చేప. దీని మాంసం విషమని బ్రౌణ్య నిఘంటువు తెలుపుతున్నది. శబ్దరత్నాకరంలోనూ ఈ రెండు శబ్దాలూ వున్నవి. "తెలివాలుగల డాలుగల సోగకన్నులు" (శుకసప్తశతి : ఆ-1). "వాలము తాకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింప బెన్వాలుగలై " (పారిజాతాపహరణం-ఆ-3) ఒల్లెంక, వాలుగ పదాలు రెండింటికీ మూలం ఒకే పదమయివుంటుంది. ఒల్లెంకే క్రమంగా వాలుగ అయి వుంటుంది. ప్రాకృత వాలుంకికీ, తెలుగు ఒల్లెంకకూ గల అర్థ సామ్యాన్నీ, ఒకార, వాకారాల ఉచ్చారణలకు వ్యవహారంలో గల సన్నిహితత్వాన్నీ బట్టి ఒల్లెంకే వాలుంకి అయి ప్రాకృతంలోచేరి వుంటుందని నేను భావిస్తున్నాను. ఎండ్రకాయకూ, గోళాకారమైన చేపకూ గల సాదృశ్యంతో వ్యాఖ్యాతలు ఎండ్రకాయ అని భ్రమపడివుంటారు వాలుంకిని దోసతీగ అని వ్యాఖ్యానించే పక్షంలో దోసతీగ లేతకొల్లు లాగితే పెరిగిపోతాయి. వాలుంకి శబ్దం దేశి అని వ్యాఖ్యాతలు తెలిపారు.

## 3. పిలుఅ :

తడ సంఠిఅ ణీడేక్కంత పిలుఅ రక్ఖణేక్క దిణ్ణమణా,
అగణిఅ విణివాఅ భయా పూరేణసమం వహఇ కాఈ.

(మాణస్స: 2-2)

(తటసంస్థిత నీడైకాంత శాబక రక్షణైక దత్తమనాః,
అగణిత వినిపాతభయా పూరేణసమం వహతి కాకీ.)

(కొమ్మకొనవయి గూటిలో గూరుచున్న
తనదు పిల్లల గాపాడు పనియె తలచి
మునిగి పోవుదు నను భీతి గొనక కాకి
వెడలెడిని గంటె చెట్టుపై వెల్లి వెంట.)

ఈ గాథలోని పిలుఅ శబ్దానికి పిలుకః=శాబకః (పిల్ల) అని కులబాల దేవుని వ్యాఖ్య. సంస్కృతంలో ఈ శబ్దం "పీలతి స్తభ్నాతీతి పీలుకః పిపీలికా, క్రిమిభేదః" అని అర్థాంతరంలో వున్నది. తెలుగులోని పిలుక శబ్దానికి పక్షిలోన గువాని పిల్ల అని అర్థం. పిళ్లై, పిళ్లె, పిన్న మున్నగు తమిళ కర్నాటక తెలుగు శబ్దాలు పిల్ల, పిలుక అనే తెలుగు పదాలకు సమానార్థకాలు. పిలుక శబ్దమే ప్రాకృతంలో చేరి, అక్కడినుంచి గతానుగతికంగా సంస్కృతంలో సూక్ష్మక్రిమి, పిపీలికా అనే అర్థాలలో ప్రయుక్తమయింది. ప్రస్తుతం హిందీలో పిల్లఅంటే కుక్కపిల్ల అని అర్థం.

## 4. పోట్టం :

పోట్టం భరంతి సఉణా వి మాఉఅ అప్పణో అణువ్విగ్గా,
విహలుద్ధరణ సహావా హువంతి జఇ కేవి సప్పురిసా.

(అలకస్స:3-85)

(ఉదరం భరంతి శకునా అపి హేవమాంతరః ఆత్మనో౽నుద్విగ్నాః
విహ్వలోద్ధరణస్వభావా భవంతి యది కేఽపి సత్పురుషాః.)

పశులు కూడ ఏదో విధంగా పొట్టపోసుకుంటాయి. దుఃఖాలనుంచి దీనులను గట్టెక్కించే స్వభావంగల సత్పురుషులు కొందరే సుమా!-అని ఈ గాథ అర్థం.

ఈ గాథలోని పొట్ట అనే శబ్దం గాథాసప్తశతిలో మరి రెండు చోట్ల కూడ ప్రయుక్తమయింది. 1. భొక్ఖపత్తపోట్టం అ పిట్టేఇ (2–71) 2. పోట్ట పడిఏహి దుఃఖం (1-83).

"పోట్టం ఉదరం" అని వ్యాఖ్య. దీనిని హేమచంద్రుడు దేశీ నామ మాలలో ఉదాహరించాడు. సంస్కృత ప్రాకృతభాషలలో హ్రస్వ ఒకారంలేదు గనుక పొట్ట శబ్దమే పోట్టగా ప్రాకృతంలో గ్రహింపబడినది. పోట్టం అన్న దానికి పొట్ట, కడుపు అని వేరుగా అర్థం చెప్పనక్కరలేదు. ఇది పూర్తిగా తెలుగుపదం. ఇది తెలుగు పదం కాదని, పృష్ఠం అనే సంస్కృత పదం నుంచి పుట్టిందని అనడానికి ఎవరూ సాహసించ రనుకుంటాను. (దేశీ నామమాల-6-60.)

## 5. కిలించిఅ :

ణ్హాణ హలిద్దా భరిఅంతరాఇఁ జాలాఇఁ జాలవల అస్స,
సోహంతి కిలించిఅ కంటఏణ కం కాహిసీ కఅత్థమ్?
(మఅరందస్స: 1-80.)

(స్నానహారిద్రా భృతాంతరాణి జాలాని జాలవలయస్య,
శోధయంతీ క్షుద్రకంటకేన కం కరిష్యసి కృతార్థమ్.)

(పసపునీళ్లాడి దువ్వెనపండ్ల నడుమ
జిక్కుకొని యున్న మైలను జిన్నముల్లు
గ్రుచ్చి తీసెద వెవ్వని కోర్కి పండ
జేయుచున్నావు తెల్పవే చిన్నదాన?)

ఈ గాథలోని కిలించిఅ శబ్దానికీ, పాఠాంతరంగా గ్రహించిన కిలిచ్చిఅ శబ్దానికీ సూక్ష్మం అని వ్యాఖ్యాతల నిర్వచనం. సన్నని, నీచమైన అనే అర్థాలలో క్రించు, కించు శబ్దాలు తెలుగు సాహిత్యంలో లభిస్తున్నవి. "మగటిమి యె క్రించుపని కిట్లు? " (భారతం—స్త్రీ పర్వం 2-96). తమిళ, కన్నడ భాషలలోని కిళి, కిళింజల్, కిళిచ్చల్, కీళ్ శబ్దాలకు సన్నని, సన్నగాచేయు, చించు అనే అర్థాలున్నాయి. కిలించిఅ శబ్దానికీ, కిళిచ్చల్, క్రించు-కించుశబ్దాలకు గల సాదృశ్యాన్నిబట్టి కిళించిఅ తెలుగేనని నిశ్చయించడానికి అవకాశం ఉంది. దీనిని గతానుగతికంగా సంస్కృతపండితులూ ప్రయోగించడం వల్ల త్రికాండ శేషం వంటి నిఘంటువు కిలింజకం, కిలింజం అని సంస్కృత ముద్రవేసి సూక్ష్మ దారువు అని వ్యాఖ్య చేసింది. (దేశీనామ. 2-1.)

## 6. అద్దాఏ :

పుట్టం తేణ వి హిఅఏణ మామి ణివ్వరిజ్జఏ తమ్మి,
అద్దాఏ పడిబింబం వ్వ జమ్మి దుఃఖం ణ సంకమఇ.

(రాఅ వగ్గస్సః 3-4.)

(స్ఫుటతాపి హృదయేన మాతులాని కథం నివేద్యతే తస్మిన్,
ఆదర్శే ప్రతిబింబ మివ యస్మిన్ దుఃఖం న సంక్రామతి.)

(అద్దమందు నీడ యంటు నట్లెవ్వని
యాత్మ నొరుల వగపు లంటుకొనవొ
యట్టివానితోడ నెటు సెప్పుదు నత్త
మనసు వ్రక్కలైన మానె గాని?)

ఈ గాథలోని 'అద్దాఏ' అనే పదానికి 'ఆదర్శే' అని వ్యాఖ్య. దీనిని హేమచంద్రుడు దేశీనామమాలలో గ్రహించాడు. అద్దునది-ఎదుట ఉన్న దానిని అద్దుకొనునది కనుక అద్దము. అద్దము-అద్దబు-అద్దవు క్రమంగా అద్దాఅ అయింది. అర్థ సామ్యాన్నిబట్టి ఆదర్శశబ్దంనుంచే అద్దాఅ పుట్టిందనడానికి వీలులేదు. సమీకరణ ప్రక్రియ ప్రకారం తర్కయామి-తక్కేమి, నిర్బంధః-ణిబ్బంధో, మార్గ-మగ్గో, ప్రియదర్శీ-పియదస్సీ అయినట్లు ఆదర్శ శబ్దం ఆదసో కాగలదుగాని అద్దాఅ కాదు. దీనిని హేమచంద్రుడు దేశీ నామమాలలో పఠించడాన్ని బట్టికూడ ఇది తెలుగు పదమే ననడం స్పష్టం. హిందీ, పంజాబీ, బెంగాలీమున్నగు ఔత్తరాహ భాషలలో ఆదర్శ శబ్దం ఆదసీ అయింది.

## 7. ఖోండీ :

దట్ఠూణ రుందతుండగ్గ ణిగ్గఅం ణిఅసుఅస్స దాఢగ్గం,
ఖోండీ విణావి కజ్జేణ గామనిఅడే జవే చరఇ.

(విగ్గహస్స 5-2)

(దృష్ట్వా విశాల తుండాగ్రనిర్గతం నిజసుతస్య దంష్ట్రాగ్రమ్,
సూకరీ వినాకార్యేణ గ్రామ నికటే యవాం శ్చరతి.)

(వెడద మూతి తుదను వెడలిన వాడియౌ
కోఅ పంటితోడి కొడుకు జూచి
తల్లిపంది తనకు నొల్లకున్నను మేయు
నూరి ప్రక్కతోట నుండు యవలు.)

"ఖోండీ సూకరీ" అని వ్యాఖ్యానం. దేశీనామమాల దీనిని ఖుండో అని ఉకారాదిగా గ్రహించింది. ఖుండీరో, ఖుండో అనేవి పర్యాయ శబ్దాలు. ప్రాకృతంలో ఇ ఏలకు, ఉ ఓలకు పరస్పర వినిమయం సహజం, కనుక ఖోండ శబ్దాన్నికూడ దేశీనామమాల గ్రహించినట్టే. ఇది తెలుగుపదం దే ననడం నిస్సంశయం. సామాన్య తెలుగు వ్యవహారంలో అకారం ఒకారంగా మారుతుంది.

మగడు-మొగుడు. "మొగడొచ్చి పిలచెను, పోయివచ్చెద సామి". ఈవిధంగా పంది పొంది అయి, త వర్గం ట వర్గంగా మారి, పొండి ఉచ్చారణలో ఊది పలకడానికి చేయవలసిన ప్రయత్నాన్నిబట్టి ఆగి వర్ణం మహాప్రాణంగా పరిణమించి భోండి అయివుంటుంది. దీన్ని స్త్రీలింగంగా భావించినందున పుంలింగంలో భోండ, ఖుండ శబ్దాలు కల్పించబడినవి. ఇది అప్పటమైన తెలుగు పద మనడానికి దేశీనామమాల గ్రహించిన ఖుండీరో శబ్దం పరమ ప్రమాణం. ప్రాచీన తెలుగు పదం పంద్ఱి. ఇది ప్రస్తుతం తమిళులో పన్ఱి అయింది. శకటరేఫతో కూడిన నకారం ఉచ్చరించేటప్పుడు న్ద్రి అనే ఉచ్చారణ ఏర్పడుతుంది; ఇది న్ద్రి కూడ అవుతుంది పన్ + ఱెండు పంద్రెండు. న్ద్రి ఉచ్చారణ మలయాళంలో మాత్రం మిగిలింది. పంద్రెండు మలయాళ రూపం. తెలుగులో పన్ద్రి పంది అయిందిగాని పన్ని కాలేదు. పన్ని నేడు తమిళవ్యవహారంలో వుంది. కాని మున్ను శబ్దానికి మాత్రం ముందు, మున్ను అని రూపాలు. పన్ద్రి అన్నప్పుడు చేయవలసిన ఉచ్చారణప్రయత్న విశేషాన్నిబట్టి కూడ మొదటి అల్ప ప్రాణం మహాప్రాణమై వుంటుంది. భోండితో పాటు ప్రాచీన శబ్దం భోండీరో కూడ ప్రాకృతంలో చేరింది. (దేశీనామ-6-106.)

## 8. సరఅస్స:

ఆరుహఇ జుణ్ణఅం ఖుజ్జఅం వి జం ఉఅహ వల్లరి తఉసీ,
ణీలుప్పల పరిమల వాసిఅస్స సరఅస్స సో దోసో.

(6-34)

(ఆరోహతి జీర్ణం కుబ్జక మపి యత్పశ్యత వేల్లనశీలా త్రపుసీ.
నీలోత్పల పరిమలవాసితాయా శ్శరద స్స దోషః.)

(6-50)

ఉఅ మాణిణీ సరఅం.
(పశ్య మానినీ సరకం.)

వయసు దిగజారినా చెరుకు కల్లు తాగి మన్మథ వికారం పొందిన ఒక వనితను చూచి శరద్వర్ణన వ్యాజంతో హేళనచేస్తూ చెప్పిన గాథ ఇది

పక్కన వున్నవాటిని చుట్టుకొనడమే స్వభావంగా గల దోసతీగ శరత్కాలం రాగానే పక్కన రాయివున్నా, రప్పవున్నా, చెట్టువున్నా, మోడువున్నా అల్లుకుంటుంది. సారాయి తాగి కైపెక్కిన ఈ వయసుజారిన వనితకూడ పక్కన వున్నవానిపై తూలిపడుతుంది. నీలోత్పల పరిమళంగల సరకవు దోషమే సుమా ఇది! సరక అన్నప్పుడు శరత్కాలం, చెఱకుసారాయి అని శ్లేష.

సరఅ శబ్దం శరత్కాలం అనే అర్థంలో తద్భవమే;—ఇక్షు మద్యం అనే అర్థంలో వ్యుత్పత్తి లేదు. ఇది తెలుగు చెఱకేగాని మరేమీ కాదు. తమిళ కన్నడాలలో చెఱకుకు సమానార్థక పదాలు కఱుంబు, కబ్బు. కరచి తినేది కనుక కఱుంబు, కబ్బు, చెఱకు అయివుంటుంది. తర్వాత చెఱకు నుంచి పుట్టిన మద్యానికి లాక్షణికంగా వ్యవహారం కలిగివుంటుంది. సరక శబ్దం ఇక్షుమద్య వాచకంగా కథా సరిత్సాగరంలోను ప్రయుక్తం.

"పాళిప్రాయాం నిశి వప్రచ్ఛ నిజం పరిజనం చ సః,
కి మద్య రాత్రి పర్యాప్తం అస్తి నః సరకం న వా?"

(రాత్రికాగానే. రాత్రికి సరిపడా సరకం వుందా, లేదా అని అతడు తన పరిజనాన్ని ప్రశ్నించాడు.) సరక శబ్దాన్ని క్రమంగా మధుపానానికీ, మధు పాత్రికీ కూడ వ్యవహరించారు. తర్వాత సంస్కృత కోశకారులు దీనిని గ్రంథస్థం చేశారు. "సరకోऽ స్త్రీ శీధుపానే శీధుపాత్రేశు శీధునోః" అని మేదినీకోశం గ్రహించింది. "కలకంఠు నేయ విల్లగు చెలకుం జెలకైన వంట చెలకుం జెలకే" (ఉత్తర హరివంశం ఆ–6) అని చెలకు శబ్దం చెకారాదిగా వున్నా, దీని ప్రాచీన రూపం అకారాదిగా చలకు అనే వుంటుంది కలుంబు, కల్బు అని తమిళ కర్నాటక భాషలలో రూపాలు వుండడం ఈ ఊహకు సాధకం. గడ్డ గెడ్డ, గంతు గెంతు, అయినట్టే చలకుకూడ చెలకు అయివుంటుంది.

## 9. తుప్ప :

తుప్పాణణా కిణో చిట్టసిత్తి పడిపుచ్ఛిఆప బహుఆఏ,
విఉణావేట్టిఅ జహణత్థలాఇ లజ్జోణఅం హసిఅం.

(అలక్కృసప్తః 3–89.)

(ఘృతలిప్తాననా కిమితి తిష్ఠసీతి పరిపృష్టయా వధ్వా.
ద్విగుణావేష్టిత జఘనస్థలయా లజ్జా వనతం హసితం.)

వణ్ణఘిఅ తుప్ప ముహిఅ తీఏ పరిఉంబణం భరిమో.

(వంగవిఅరస్సః 1–22)

(వర్ణ ఘృత లిప్త ముఖ్యాః తస్యాః పరిచుంబనం స్మరామః.)

తుప్ప శబ్ద విచారానికి ముందు పైగాథల అర్థాన్ని కొంత వివరిస్తాను. "ముఖానికి నెయ్యి పూసుకొని ఎందుకు నిలబడ్డావు"? అని అడుగగా, కోడలు సిగ్గుపడి చీరను మరొకమారు ఒంటి చుట్టూ చుట్టుకొని నవ్వింది. చెరగు మాసిందని భావం.

రంగు నేయి పూసుకొన్న ఆమె ముఖాన్ని ముద్దుపెట్టుకోనడం సర్మిస్తాము.

ఆ కాలంలో రజస్వలలు గుర్తుగా మొగానికి వన్నెకలిపిన నేయి పూసు కొనడం దేశాచారమని 1–22 వ గాథా వ్యాఖ్యానంలో వివరించబడింది. ఈ ఆచారం నేటికీ కర్ణాటక ప్రాంతంలోనూ, రాయలసీమలోని కొన్ని ప్రాంతా ల్లోను లాంఛన ప్రాయంగా వున్నది. ప్రథమ రజస్వలకు 16 నాళ్ళ పండుగ వరకు మూనె పసుపుగాని, నేయి పసుపుగాని రాయడం కలదు. ప్రథమ రజస్వల ఆరోగ్యాన్ని రక్షించడంకోసం రజోదోషం కలుగకుండా జరిపే వైద్య శాస్త్ర ప్రక్రియ ఇది. రజోగంధం నుంచి విషక్రిములు ఆకర్షింపబడకుండా తొలగిపోవడం

9. కథాసరిత్సాగరం, 54-99.

కూడ ఈ పసుపు నేయి పూత ఉద్దేశమట. 2000 ఏండ్ల నాటి ఈ ఆచారం లాంఛన ప్రాయంగా మాత్రమే నేడు నిలిచింది.

పైన ఉదాహరించిన మొదటి గాథలోని "తుప్పాణణా" పదానికి "ఘృత లిప్తాననా" అని, రెండవ గాథలోని "వణ్ణ ఘిఅ తుప్పా" శబ్దానికి "హరిద్రాది వర్ణ ప్రధానం ఘృతం" అని వ్యాఖ్యానం.

ఈ గాథలలో ప్రయోగించిన తుప్ప శబ్దం నేయికి ప్రాచీన తెలుగు పర్యాయ పదం; నన్నయ కాలానికే వ్యవహారచ్యుత మయింది. తుప్ప శబ్దం తుఱువు-ఆవు నుంచి వచ్చింది. తుఱువు–తుఱుపు–తుఱుప్పు - త్రుప్ప– తుప్పు – తుప్ప అయింది. ఆవు నేయి అన్నమాట. తుఱుపు శబ్దం రాష్ట్రకూట ధ్రువరాజు శాసనంలో (క్రీస్తు శకం 780) ప్రయోగింపబడింది. తమిళంలో ఆలమందకు తొఱువు అని పేరు. ధ్రువరాజు శాసనంలోని తుఱుపు శబ్దానికి, తొఱువుకూ మూలం తొఱు అయివుంటుందని ఎపిగ్రాఫియా ఇండికాలో చర్చించబడింది.[10] తొఱ్ఱు పట్టు – గోగ్రహము. "ఘనభుజుండు నరుడు దన తొఱ్ఱు పట్టుల విక్రమించి" (భారతం ఆది. 8-210). "ఋష్యశృంగు దొఱ్ఱు పట్లు ః క్రమించుచు"—(భారతం. అరణ్య. 8-118). తొఱ్ఱులు=ధేనువులు. "తొఱ్ఱులు గాచిన నందుని"—(భాగవతం. పూర్వ 10-633). తుర్వు=ఎద్దు, ఆవు. "తుర్వట బాబా, తలపై పువ్వట." తువ్వాయి దూడకు వ్యవహారం.. త్రువ్వు, తుఱువులకు సంబంధించిన వస్తువు లన్నీకూడా లాక్షణికంగా తుఱ్ఱువు అయివుంటాయి. తుఱువు తుప్ప అయిన క్రమ పరిణామాన్ని మొదటే నిరూపించాను. "తుప్పో స్నిగ్ధః" అని హేమ చంద్రుడు దేశీ నామమాలలో పఠించాడు (5-22).

## 10. ఫలహీ:

ఫలహీ వాహణ పుణ్ణాహ మంగలం లంగలే కుణంతీఏ,
అసతీఅ మణోరహ గబ్భిణీఅ హత్థా థరథరంతి.

(కహిలస్సః 2-65)

(కార్పాసీ క్షేత్రి కర్షణ పుణ్యాహ మంగలం లాంగలే కుర్వత్యాః,
అసత్యా మనోరథ గర్భిణ్యా హస్తౌ థరథరాయేతే)

(పత్తి చేను దున్నవలసి మంచిదినాన
మడక పూజ చేయ దొడగినపుడు,
కోర్కు లాత్మ గుబులుకొన గడగడమని
వడకదొడగె గాపు చెడిపె కపుడు.)

ఫలహీ శబ్దం మరి మూడు చోట్ల కూడ ప్రయుక్తమైంది. 1. ఫలహీ వేంటేసు ఉఅహ బహుఆఏ (4-59), 2. హసిఅం అ ఫలహీఏ (4-60),

10. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటం 3.

ఫలిహం అ మోడిలం మహిపవిణ (6-49). "ఫలహీ = కార్పాసవృత్తః" అని, దేశీ వ్యవహారమని కులబాలదేవుని వ్యాఖ్య. హేమచంద్రుడు ఫలహీని దేశీ నామమాలలో గ్రహించి, వలహీ, వవణీ అనే పర్యాయపదాలూ పేర్కొన్నాడు. తెలుగు ప్రత్తే ఫలహీగా మారిందని నేను అభిప్రాయపడుతున్నాను. ప్రత్తికి ఆదిరూప మైన పలుత్తి పలుత్తి అయి, అంత్యద్విత్వాక్షరాన్ని ఊది పలకడంవల్ల క్రమంగా వలుత్తి-ఫలహీ అయివుంటుంది. "పత్త్రికా శబ్దం నుంచి పత్తి అయివుంటుంది. ప్రపత్త్రికా శబ్దం నుంచి ప్రత్తి పుట్టిఉంటుంది" అనే వాదం సహేతుకం కాదు. పత్త్రికా శబ్దం నుంచి పత్తిఅ-పత్తి కావడానికి వీలున్నా, అర్థం కోసం లాక్షణి కంగా నానా బాధలు పడవలసి వుంటుంది. ప్రపత్త్రికా శబ్దం నుంచి ప్రత్తి అనే రూపం అసలే రాదు. తెలుగు సంప్రదాయానికి ఉపసర్గ విధానమే విరుద్ధం. పత్త్రికా నుంచి పత్తిఅ కావచ్చునుగాని 'ఫలహీ'ని ఏవిధంగానూ సాధించలేము. ఛిద్ర వాచక ఛిల్ల ఉచ్ఛిల్ల శబ్దాలు రెండూ వేర్వేరనీ, ఉచ్ఛిల్ల శబ్దం ఉత్పూర్వక ఛిల్ల శబ్దం కాదనీ, దేశీ శబ్దాలకు ఉపసర్గ సంబంధం వుండదనీ హేమచంద్రు డన్నాడు. "(నహి దేశీ శబ్దానాం ఉపసర్గ సంబంధో భవతి".)[11]

## 11. వేంట :

అజ్జం మోహాణ సుహిఅం
ముఅత్తి మొత్తూ పలాఇఏ హాలిఏ,
దర ఫుడిఅ వేంటభారో
ణఆఏ హాసిఅం వ ఫలహీఏ.

(జణ్ణంప సారసప్తః 4-60)

(ఆర్యాం మోహనసుఖితాం మృతేతి ముక్త్వా పలాయితే హాలికే,
దర స్ఫుటిత వృంత భారావనతయా హాసిత మివ కార్పాస్యా.)

(చొక్కి కనులుమూయు సుదతి ఐచ్చె నటంచు
విడిచి పాఱు కాపువెడగు చూచి,
పత్తి కొమ్మ నగము పగిలిన కాయల
మొగము వంచి చేల నగియ బోలె.)

మరి రెండు చోట్ల గూడ వేంట శబ్దం ప్రయుక్తం. 1. ఫలహీ వేంటే సు ఉఅహ బహుఅఏ (4-69). పహిరజ్జిఅ తాలవేంట యుగం (4-98.).

"వేంటో కార్పాసఫలం" అని, దేశీవ్యవహారమని కులబాలదేవుని వ్యాఖ్య. ప్రత్తి విళ్లు, పత్తి వెంట్లు అన్నమాట. ఉరుళ్ ధాతువు మూలంగా గల ఉరుండై, ఉండ, ఉంట క్రమంగా వెంటు, వెంటి అయింది. గడ్డివెంటు-గడ్డిచుట్ట. ప్రత్తివెంటు పత్తిచుట్ట-పత్తివుండ-పత్తికాయ. "కచ్చడం బాదిగాగల చీరలెల్ల, చెచ్చెరవెంట్లుగా జేసి ముట్టించి" (బసవపురాణం, దీకళియార్ కథ పుట 75). "కోకలు వెంట్లుగా బెనచి" (శేషధర్మాలు ఆ-1.). ఉండ, ఉంట-వెంటి అని

---

11. దేశీనామమాల 1-95 అర్థవ్యాఖ్య.

క్రమపరిణామం స్పష్టంగా గోచరిస్తుండగా, వర్తుల, వృత్త శబ్దాల నుంచి వ్యుత్పత్తి సాధించవలసిన అవసరం ఏమిటి? ప్రాకృతం ద్వారా వెళ్ళిన తెలుగు వెంటు శబ్దాన్ని వంఠః=ఖండః, భాగః అని సంస్కృతీకరించి గ్రహించారు పండితులు.

ఉంట శబ్దం ఒంటుగా కూడ మారింది. ఒంట్లు=పోగులు. "పచ్చరాయొంటువాని"—ప్రయోగం. తాలవేంటయుగం=తాళపత్ర తాటంకం అని వ్యాఖ్య. చెవాకు అన్నమాట. చుట్ట అనే అర్థం గల ఒంటు శబ్దం వెంట రూపంతో తాలపత్రంతోపాటు చెవి యొక్క తాళాన్ని తోసివేసి పోగు, కుండలం అయికూచుంది.

## 12. రుంప-రంప :

ఉక్ఖిప్పఇ మండలి మారుఏణ గేహంగణాహి వాహీఏ,
సోహగ్గ ధఅవడాఅ వ్వ ఉఅహ ధణురుంప రింఛోళీ.

(హాలస్ః 2-20)

(ఉత్క్షిప్యతే మండలీమారుతేన గేహాంగణా ద్వ్యాధస్త్రియాః,
సౌభాగ్య ధ్వజపతాకేవ పశ్యత ధనుస్సూన్యత్వక్పంక్తిః.)
(చెంచు మగువ ఇంటిచెంగట చెక్కిన
మగని విల్లవింట దెగిన చిలుగు
పొట్టు మింటి కెగిరిపోయెడు సుడిగాలి
దాని భాగ్యగుణపతాక యనగ.)

మరొక ప్రయోగం:

సోహగ్గం ధణురుంప చ్ఛలేణ రచ్ఛాసు విక్కిరఇ.

(హాలస్ః 2-19)

(సౌభాగ్యం ధనుస్త్వక్ఛలేన రథ్యాసు వికిరతి.)

రుంప శబ్దానికి రంప అని పాఠాంతరం. రుంప, రంప=తష్టత్వక్ చెక్కిన పొట్టు అని వ్యాఖ్యాత వివరిస్తున్నాడు. అంపవు పొట్టు అని అర్థం. అంపం పాత తెలుగు ఆయుధాలలో ఒకటి. రంపె=తొలుకోసెడి సాధనం (శబ్దరత్నాకరం). రంపఇ=తక్ష్ణాతి (చెక్కుతున్నాడు) అని ధాత్వాదేశంగా విధించినట్టు హేమ చంద్రుడు (శబ్దానుశాసనంలో) పేర్కొన్నాడు. అంపు=తాయిడిపెట్టు. అంపులాడు=ఎప్పుడూ పీకులాడేవాడు. అంపు ధాతువు మొదట చెక్కడానికి కూడ ప్రయోగింపబడేదేమో! తర్వాత కోయడానికి వ్యవహరింపబడి వుంటుంది. ఆచార్య హేమచంద్రుని మాటలను బట్టి ఇది దేశీ. మనకు తెలుగు.

## 13. సిప్పర :

ఖరసిప్పర ఉల్లిహిఆఇఁ కుణఇ పహిఓ హిమాగమ పహాఏ.
ఆచమణ జలోల్లిహిఅ హత్థఫంస మసిణాఇఁ అంగాఇ.

(పసణ్ణస్స: 4-30)

(తీక్ష్ణ పలాలోల్లిఖితాని కరోతి పథికో హిమాగమ ప్రభాతే,
ఆచమన జలార్ద్రిత హస్తస్పర్శ మసృణా న్యంగాని.)

చలికాలంలో ఒక పథికుడు ఒక గడ్డి ప్రాంతంలో పడుకున్నాడు. గడ్డికి అతని ఒళ్లంతా గీచుకొనిపోయింది. ఉదయం లేవగానే గీచుకుపోయిన అంగాలను తడి చేతితో రాచుకొని హాయిపొందుతున్నాడు.

సిప్పర ఉల్లిహిఆఇఁ=పలాలోల్లిఖితాని (గడ్డి రాచుకున్న) అని వ్యాఖ్య. సిప్పరశబ్దం తృణ వాచకంగా దేశీ నామమాలలో పఠితం. "పచ్చని కంబలి గవిసికొన్న విధమున తోలుపుల చిప్పరలు గవిసె భూతల మెల్లన్" అని నన్నెచోడుడు సిప్పరను ప్రయోగించాడు (కుమార సంభవం. 8-757). చిప్పర=సన్నని గడ్డి. చిన్ + పుల్ క్రమంగా చిప్పుల్—చిప్పర అయింది. తర్వాత ఇది ప్రాకృతంలో తృణ సామాన్యవాచిగా గ్రహించబడింది తెలుగులో క్రమంగా పెద్దదై ప్రస్తుతం చీపురై వాడబడింది.

## 14. తాలూర :

తాలూర భమాడిఅ ఖుడిఅ కేసరో గిరిణఈఏ పూరేణ.
దరబుడ్డ ఉబుడ్డ ణిబుడ్డ మహుఅరో హీరఇ కలంబో.

(అవట-కస్స: 1-37.)

(ఆవర్త భ్రమాకుల ఖండిత కేసరో గిరినద్యాః పూరేణ,
దర మగ్నో న్మగ్న విమగ్న మధుకరో హ్రియతే కదంబః.)

(కొండ పెంయేటి సుడికి చిక్కుకొని కలగి
తిరుగుచును కేసరంబులు వఱిగిపోవ
కొంత మునుగుచు దేలుచు గొదమతేటి
వెంటనంట కడిమ పూవు వెల్లబోయె.)

"తాలూరో జలావర్త ఇతి దేశీ" అని వ్యాఖ్య. అంటే ఇది దేశీపదమని స్పష్టం. దేశీనామమాల దీనిని ఫేన పరంగాను, ఆవర్త పరంగాను గ్రహించింది. కాని

శబ్దకల్పద్రుమం మాత్రం "తలయతి=తలం దర్శయతీతి తాలూరః" అని వ్యుత్పత్తి చెప్పింది. అయితే ఇది తెనుగు శబ్దమనడానికి చాల ఉపపత్తి ఉంది. తిర్, త్రిప్పు, తిరుగు, తలారు అనేవి తెలుగులో భ్రమివాచకాలు. తలారు శబ్దానికి మరలు, తిరుగు అని అర్థం. తలారుకు, తాలూరకు అన్నిటా సంబంధం వున్నట్టు తోస్తున్నది. తలారించు శబ్దానికి తిరుగు, తాలించు, తాలబోయు అనే అర్థాలూ కలవు. "క్రేపులం దలచి తలారింపక" (భాగవతం. 10 వ స్కం ధం. పూ.). తలారే తాలూర శబ్దానికి మూలమయివుంటుంది. (దేశీనామమాల. 5–21.)

## 15. మడహ సరిఆ:

ఓ హిఅఅ మడహ సరిఆ జలరఅ హీరంత దీహదారువ్వ,
ఠాణే ఠాణే వ్విఅ లగ్గమాణ కేణావి డజ్ఝిహసి.
(మహాపవస్సః 2–5)

(హే హృదయ స్వల్ప సరిజ్జలరయ హ్రియమాణ దీర్ఘ దారువత్,
స్థానే స్థానే ఏవ లగత్ కేనాపి ధక్ష్యసే.)

(చిన్నవాగు వడికి చిక్కి కొట్టుకపోవు
పొడుగు కట్టెవోలె నడుమ నడుమ
దగులు కొనెదు మనస, తప్పక ఎవ్వరో
కడకు నిన్ను బట్టి కాల్చివైచు.)

"మడహ శబ్దః స్వల్పవాచకః" అనివ్యాఖ్య. దేశీనామమాలలో ఇది లభించడంలేదు. అడగు—అడంగు, మడగు—మడంగు శబ్దాలకు తగ్గియుండు అని అర్థం. మడుము=నిలచిపోవుట, మడకు=నక్కుట అని బ్రౌణ్యనిఘంటువు.

"అప్పుడు తొలగి యొయ్యన నడుగిడుచు
మడకుచు దీపముల్ మరుగు వెట్టుచును"

బ్రౌన్ ఉదాహరణ. మడకుచు అనగా నెమ్మదిగా వెళ్లుచు అని అర్థం. మడహసరిత=మెల్లిగా ప్రవహించేనది, మడవ అన్నమాట. నీరు తగ్గినప్పుడే నదీ ప్రవాహవేగం మందగించి వుంటుంది. మడ=ప్రవాహ మార్గము (కాలువ) (శబ్దరత్నాకరం). "మడలు దరులు వాకలును గ్రమంబుగ నొకడున్" (హరివంశం, పూర్వ. ఆ–8)" మడల తీరంబుల మడుగులుమేటి, పడియల" (నవనాథ చరిత్ర. భాగ–8). మడకు లేక మడుగువల్ల పుట్టిన మడవ శబ్దమే మడహ అయింది.

## 16. ఓ:

ఓ హిఅఅ ఓహి దిఅహం (5-87)

(హే హృదయ అవధి దివసం)
ఓ హిఅఅ మడహ సరిఆ (2-5.)

(హే హృదయ స్వల్ప సరిత్)

"ఓ హిఅఅ" అన్నప్పుడు 'హే' అనే సంబోధన ప్రథమావిభక్తికి మారుగా 'ఓ' అనే తెలుగు విభక్తి ప్రత్యయం ప్రయుక్తమైంది. ఓ, ఓయి అనేవి ప్రాచీన తెలుగు సంబోధన ప్రథమా విభక్తి ప్రత్యయాలు. నన్నయ భట్టారకుడు సంస్కృతాభిమానం కొద్దీ తెలుగు సంబోధన ప్రత్యయాలనువాడక సంస్కృత సంబోధన ప్రత్యయాలనే వాడినాడు. నన్నయ ఆంధ్ర శబ్దచింతామణిని మొదట సూత్రించి దానికి లక్ష్యంగా భారతాన్ని రచించాడని వాదిస్తున్న పెద్దలు "ఓ ఇత్యామంత్రణేతు వికృతౌ స్యాత్" అనే సూత్రానికి నన్నయ భారతంలో లక్ష్యం లేనందుకు కారణం చెప్పవలసి వుంది.

## 17. వోడ సుణఓ :

వోడ సుణఓ విఅణ్ణో అత్తామత్తా పఈ వి అణ్ణత్థో,
ఫలిఅం వ మోడిఅం మహిసఏణ కో తస్స సాహేఉ ? (6-49)

(దుష్టశ్శునకో విపన్నః శ్వశ్రూ ర్మత్తా పతిరప్యన్యస్థః,
కార్పాస్యపి భగ్నా మహిషకేణ కస్తస్య కథయతు?)

(అత్తపడినదింట మత్తెక్కి, పతి పొరు
గూరికేగె, కుక్క దొరికిపోయె.

ప్రత్తిచేను విరుగబడ మేసె నెనుబోతు,
దీని నతని కెవరు దెలుపువారు?)

"వోడో దుష్టః, ఛిన్నకర్ణోవా" (వోడో అనగా చెడ్డది, చేవులు కోసినది గాని) అని వ్యాఖ్య. ఛిన్నకర్ణ మనగా అవిటిది అని మనం గ్రహిస్తే గాథలోని అర్థం మరింత రసవంతంగా వుండగలదు. "మొదటే అవిటికుక్క. అదీ ఇప్పుడు జబ్బు పడ్డది." అని సంగతంగా వుంటుంది. ఓడు, ఓట=బీటలు వారినది. "ఉద్ది విడిని నేలనోడుగావైచి" (ప్రభులింగ లీలలు. 2-45). ఓటికుండ, ఓటినోరు అని వ్యవహారం. ఏ విధంగా చూచినా ఇది-అవిటో, ఓడో తెలుగు పదమే.

## 18. సాఉలీ :

సుఅణు వఅణంఛివంతం సూరం మా సాఉలీఅ వారేఇ. (జీలస్సః 3-69)

(సుతను వదనం స్పృశంతం సూర్యం మా వస్త్రాంచలేన వారయ.)

(తరుణి నీ మొగుఁడు దాఁకెడు నూర్యని
తెలుగు వెట్టి యద్దుసేయవద్దు.)

వాయువ్వేలిఅ సాఉలి థఏసు ఫుడదంతమండలం జహణం,
చటుఆరఅం పఇం మా హు పుత్తి జణహోసిఅం కుణసు. (7-5)

(వాతోద్వేలితవస్త్రే స్థగయ స్ఫుటదంత మండలం జఘనం,
చటుకారకం పతిం మాఖలు పుత్రి జనహాస్యంకురు)

అమ్మాయీ! గాలికి నీ పైట ఎగిరింది. సవరించుకో. నీ భర్త నీకు ప్రీతిగా రాత్రి నీ జఘనం కొరికాడు. ఆ పై రెండు పండ్ల ముద్ర కనిపిస్తుంది. కనుక పైట సవరించుకో. ఆ పండ్ల గుర్తులు ఇతరులు చూసేరు! ప్రియుణ్ని నవ్వులపాలు చేయవద్దు.

పై రెండు గాథలలోని సాఉలీ అనే పదానికి సాకులీ అనే పాఠాంతరమూ ఉంది. "సాకులీ వస్త్రాంచల వాచకో దేశీ" (సాఉలీ అంటే చీర పైటకు అర్థం. ఇది దేశి) అని వ్యాఖ్యానం. "సాఉలీ-పల్లవికా" అని కులబాలదేవుని టీక. సాహులీ శబ్దాన్ని వస్త్రపర్యాయంగా దేశీనామమాల గ్రహించింది. చెఱగు, కప్పుకొనే వస్త్రం అని అర్థం. తెలుగు సాలువ వర్ణవ్యత్యయంతో సాఉలి అయింది. "పొసగ గటివన్నె సాలువ ముసుగువెట్టి" అని సాలువకు ఉదాహరణం. (శశాంక. అ-4.) (దేశీనామమాల: 8-52.)

## 19. మఇల :

1. గిమ్హే దవగ్గి మసి మఇలాఇఁ. (1-70)
(గ్రీష్మే దవాగ్ని మషి మలినితాని)
(వేసవిలో దావాగ్ని పొగతో మురికైన)

2. మద మఇలిక అ కరంజ సాహాహిం. (2-21)
(మద మలినీకృత కరంజ శాఖాభిః)
(మదంతో మలినమైన కానుగ కొమ్మలచేత)

3. ణివడంత వాహ మఇలేణ. (1-84)
(నిపతద్బాష్ప మలినేన)
(పడుతున్న కన్నీటితో మలినమైన)

4. పఇవ్వఏ ణ తుహ మఇలిఅం గోత్తం. (5-17)
(పతివ్రతే న తవ మలినితం గోత్రం)
(ఓ పతివ్రతా నీ గోత్రం మలినం కాలేదు)

5. ధూలి మఇలో వి పంకంకిలో వి. (6-26)
(ధూళి మలినోऽపి పంకాంకితోऽపి)
(ధూళితో మలినుడైనా, బురద పూసుకొన్నవాడైనా)

6. వంక మఇలేణ ఛీరెక్క పాఇణా. (6-67)
(వంకమలినేన, క్షీరైకపాయినా)
(బురద పులుముకొన్నవాడు, పాలేతాగేవాడు)

7 దీఅఓ వ్వ అఇరేణ మఇలేఇ. (2-35)
(దీపక ఇవ అచిరేణ మలినయతి)
(దీపంవలె త్వరలో నల్లగా చేస్తుంది)

మఇల=మలినః అనివ్యాఖ్య. మఇల శబ్దం సంస్కృత మలిన శబ్దంతో అన్నిటా సదృశంగా కనిపిస్తున్నా స్వతంత్ర శబ్దం. మకిల, మంకు, మంగు, మణుకు మున్నగునవి మఇలకు సమానార్థకాలయిన తెలుగు పదాలు. "మకిలన్ భాపకు బాప" వడ్డాది సుబ్బారాయడుగారి ప్రయోగం. "మఇలపుత్తి=రజస్వలా, మఇలో=గతతేజాః" అని హేమచంద్రుడు దేశీనామమాలలో గ్రహించడంవల్ల మఇల—మైల శబ్దాన్ని మనం తెలుగు మైలగానే గ్రహిద్దాము.

## 20. పాణ ఉడీ :

పాణఉడీఅ వి జలిఊణ హుతవఓ జలఇ జణ్ణవాడమ్మి.
ణ హు తే పరిహరిఅవ్వా విసమదసా సంఠిఆ పుంసా.
(హాలస్సః 3-27)

(పానకుట్యామపి జ్వలిత్వా హుతవహో జ్వలతియజ్ఞవాటేపి,
నహి తే పరిహర్తవ్యా విషమదశాసంస్థితాః పురుషాః)

అగ్నిహోత్రుడు మాలవాని కుటీరంలోను మండుతాడు; యజ్ఞవాటిలోను మండుతాడు. కష్టదశలో ఉన్న పెద్దవాణ్ని ఉపేక్షించరాదు - అని ఈ గాథ భావము.

ఈ గాథలోని పాణ ఉడీ అనే పదానికి చండాల కుటీ అని వ్యాఖ్య. "ప్రాణోశ్వపచః" అని దేశీనామమాల. పాణ శబ్దం పొలసు (హొలసు) నుంచి జనించినది. మధ్యలకారం నకారంగా మారి పొనసు, పొలసు, పాణసి అయింది. "పాణసిపూవు బోడులము" (హరిశ్చంద్రోపాఖ్యానము ఆ-2), "పాణసి వారము" (శివరాత్రిమాహాత్మ్యము 3.58) అని ప్రాచీన ప్రయోగాలు. అంత నకారం క్రమంగా భ్రష్టమై పాణమాత్రం మిగిలింది. (దేశీనామమాల 7-38.)

## 21. తీర ఏ :

1. కేవీఅ వి రూసే ఉం ణ తీరఏ తమ్మి చుక్కవిణఅస్స,
జాఇఅఏహిఁ వ మాఏ ఇమేహిఁ అవసేహిఁ అంగేహిం.
(హాలస్సః-2-95)

(కేల్యాంపి రూషితుం న శక్యతే తస్మింశ్చ్యుతవినయే,
యాచితకైరివ మాతః ఏభిరవశైరంగైః.)

(ఎరవు తెచ్చుకొన్న తెలుగున వశముగా
కుండ జెడిన యట్టి యొడలు గలిగి
అమ్మ! తప్పులెన్ని యతడు చేసిన నెట్టు
లలుగనేర్తు నవ్వులాటకైన?)

2. ఉస్ససిఉం వి ణ తీరఇ కింఉణ గంతుం హాఅ థణేహిం.
(కఇరాయస్స 3–53)

(ఉచ్ఛ్వసితు మపి న తీరయతి కిం పునః గంతుం హాత స్తనాభ్యాం.)

"ఈ పాడు స్తనాలు చాలా పెద్దవి కావడంవల్ల ఊపిరి విడువడానికే తీరదే! సాధ్యం కాదే! ఇక లేచి వెళ్లడం కూడానా?'' అని ఒక గజకలభకుంభ సన్నిభ స్తని వాపోతున్నది.

3. అణ్ణహా న తీరఇ. (4–49)
(అన్యథా నశక్యత ఏవ.)
(అన్యథా సాధ్యమే కాదు.)

"నతీరఏ=నశక్యతే'' అనివ్యాఖ్య. తీరదు అని అర్థం. రూపాన్ని బట్టి అర్థాన్నిబట్టి ఇది తెలుగు పదం. ఇయ్యెడ దడవుగా నిలువ దీ అదు (భారతం. ఉద్యోగ(1–42)

## 22. కుసుంభ :

కుసుంభ శబ్దాన్ని పుష్పవాచకంగానూ, వర్ణవాచకంగానూ, వృక్ష వాచకంగానూ పలుగాథలలో ప్రయోగించారు ప్రాకృత కవులు.

1. లగ్గం కుసుంభ పుప్ఫం తి. (2–45)
(లగ్నం కుసుంభ పుష్ప మితి)
కుసుమపూవు అతుకుకున్నదని.

2. కుసుంభ తుమ్హ సాఏణప్ప (4–12)
(కుసుంభ తవ ప్రసాదేన)
కుసుమపూవా నీ ప్రసాదంవల్ల ;

3. మఅణే కుసుంభరంజిఅ కంచుఆహరణ మేత్తా ఓ. (6–45)
(మదనే కుసుంభ రాగ యుక్త కంచుకాభరణ మాత్రాః.)

మన్మథోత్సవంలో కుసుమ పెట్టిన రైకలు మాత్రం ధరించిన సుందరాంగులు.

కుః పృథివీ తస్యాం శోభత ఇతి కుసుంభః అని సంస్కృత పండితులు కుసుంభ శబ్దానికి చెప్పే వ్యుత్పత్తి. అందమైన పూవులుగల ఏ చెట్టయినా భూమికి అలంకారంగానే వుంటుంది గనుక అది సమంజసంగా కనిపించదు. సుశ్రుతుడు కుసుంభ గుణాలను "కటుర్విపాకే కటుకః కఫఘ్నో విదాహి భావాదహితః కుసుంభః'' అని వర్ణించినాడు. కుసుము అని దీనికి సామాన్య వ్యవహారం. ఇది రాయల సీమ, తెలంగాణా, కర్నాటక, మహారాష్ట్రలలో ఎక్కువగా పండే నూనెగింజ;

తక్కిన ప్రాంతాలలో లేని పంట. దీనికి కన్నడంలో కుసుబి అని వ్యవహారం. కుసుబి కుసు అనగా సన్నని ముల్లులాగ కోసుగా వున్న అని అర్థం. కుసుమగింజలు మొనదేలి వున్నందున కుసురు, కుసుము అని వ్యవహారం కలిగి వుంటుంది. కుసుబు, కుసుంబు శబ్దాన్ని సంస్కృత పండితులు సంస్కరించి కుసుంభ అన్నారు. "పసిడి కమ్ములతోడి కుసుమ పూవన్నియ నిద్దంబు బుట్టంబు నెఱయగట్టి'' అని శ్రీనాథుని ప్రయోగం (కాశీఖండం. 7-2). (దేశీనామమాల 'కుసుమణ్ణం= కుంకుమ' పదం గ్రహించింది. 2-41.)

## 23. ణడిజ్జఇ:

ఖంధగ్గిణా వణేసుం, తణేహిఁ గ్రామమ్మి, రక్ఖిఓ పహిఓ,
ణఅరవసిఓ ణడిజ్జఇ సాణుసఏణ వ్వ సీఏణ.

(స్కంధాగ్నినా వనేషు, తృణైర్గ్రామే రక్షితః పథికః,
నగరోషితః ఖేద్యతే సానుశయేనేవ శీతేన.)

ఒక పాంథుడు నగరానికి వలస వచ్చాడు. అడవుల్లో వున్నప్పుడేమో పెద్ద పెద్ద మొద్దుల నెగడు వేసుకొని చలికాచుకొన్నాడు. గ్రామాలలో నేమో గడ్డి మోళ్లతో చలికాలం గడిపాడు వెచ్చగా. నగరానికి వచ్చాడు. అక్కడ పూర్వపు సౌకర్యాలు లేవు. చలికి బాధపడుతున్నాడు. చలి తనను అడవిలోను, గ్రామాలలోను దరిచేరనీయలేదు గదా అన్న కసితో అతనిపై విరుచుకుపడింది.

ఈ గాథలోని ణడిజ్జఇ అనే క్రియకు వ్యాఖ్యాతలు "ఖేద్యతే ఇత్యర్థే ణడిజ్జఇ ఇతి దేశీ'' అని అర్థం చెప్పారు; ఇది దేశీపదమన్నారు. అనగా కష్టపెట్ట బడుతున్నాడు అని అర్థం. ణడిజ్జఇకి నణిజ్జఇ అనిపాఠాంతరం. ణడియో వంచితః, ఖేదిత ఇత్యన్యే'' అని దేశీనామమాల. ణడియో అనగా వంచితుడు, వష్టాలపాలు చేయబడినవాడు అని కొందరు చెబుతారు అని. ణడిజ్జఇ నలియు నలచు అనే తెలుగుధాతువు కర్మణి రూపమే. చెవఇ (చెబుతున్నాడు), చెజ్జఇ (చూస్తున్నాడు) మున్నగు ధాతువులు ప్రాకృతంలో చేరాయి కనుక నలి ధాతువు చేరడంలో ఆశ్చర్యంలేదు.

## 24 పక్కల :

పక్కలో త్తి చోరయువా. (2–78)
(ప్రవీర ఇతి చోర యువా)

ఒక వీరుడైన దొంగ బాటసారులను కొల్లగొట్టి వారిని బందీలుగా పట్టుకొన్నాడు. వారిలో ఒక సుందరి కూడ వుంది. ఆమె ఆ కష్టంలోను ఆ దొంగ పరాక్రమానికి ముగ్ధురాలై అతనివైపు గౌరవంతో చూచింది.

ఈ గాథలోని పక్కలో అనే పదానికి "ప్రవీరో యువా'' (గొప్పవీరుడైన యువకుడు) అని వ్యాఖ్య. "పక్కల శబ్దో దర్పవతి యూని వర్తతే" (గర్వించిన

యువకునికి పక్కల అని వ్యవహారముంది) అని కులబాలదేవుడు అంటున్నాడు. "పక్కో దృప్తః సమర్థశ్చ" అని దేశీనామమాల. తెలుగులో మొక్కలుడు, మొక్కలి, మొక్కలీడు అనే పదాలు ముష్కరుడైన పిరుకు అనే అర్థంలో ఉన్నవి. పక్కల మొక్కల శబ్దాలు ఒకే కుదురు నుంచి బయలుదేరిన వయివుంటాయి. పక్కల శబ్దమే క్రమంగా మొకారాదిగా మారి వుంటుంది.

## 25. చటుఅం :

> భిచ్ఛాఅరో పేచ్ఛఇ ణాహిమండలం సా వి తస్స ముహఅందం,
> తం చటుఅం అ కరంకం దోణ్హవి కాఆ విలుంపంతి.
>
> (సపిరాఅస్సః 2-62)
>
> (భిక్షాచరః ప్రేక్షతే నాభి మండలం సాపి తస్య ముఖచంద్రం,
> తచ్చటుకం చ కరంకం ద్వయో రపి కాకా విలుంపంతి.)

ఒక బిచ్చగాడు బిచ్చానికి వచ్చాడు. చాల అందగాడు. బిచ్చం వేయడానికి కర్రగరిటెతో ఒక యువతి వచ్చింది. ఆ అందగాడిని చూడగానే ఆమె గుడ్డ బొడ్డుకిందకి జారింది. బిచ్చగాని దృష్టి ఆ పాత్రంలో తారాడుతున్నది. ఆమె వాడి ముఖమే చూస్తూ నిలబడిపోయింది. ఇదే సందుగదా అని కాకులు ఆమెచేతి కర్రగరిటెలోని అన్నాన్ని, అతని భిక్షా పాత్రలోని అన్నాన్ని తమ ముక్కులతో కుక్కుకుంటున్నాయి.

ఈ గాథలోని చటువం అర్థం చూద్దాము. "చటుఅం భిక్షా దాన పాత్రం. దర్వీతి యావత్'' అని వ్యాఖ్య. అనగా గరిటె. 'చట్టూ దారహస్తః' అని దేశీనామ మాల. చట్టువ శబ్దం గరిటె, తెడ్డు అనే అర్థాలలో తెలుగు తమిళాలలో వుంది. "ప్రక్షాళితంబైన పసిడి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి'' (కాశీఖండం. 7-147), "చట్టువం బొక చేత బట్టి ఖడ్గము సంక దగిలించి'' (భారతం. విరాట. 1-211) అని ప్రయోగాలు. హేమచంద్రుడు చట్టూ పదం దేశి నామమాలలో గ్రహించాడు ఇదీ, చటుఅం ఒక్కటే. చెట్టునుంచి పుట్టిన ఈ పదం క్రమంగా దాళితో చేసిన గరిటెకు కూడ వ్యవహృతమయింది. (దేశీ. 3-1.)

## 26. డోరో :

> ఇఅరో జణో ణ పావఇ తుహ జహణారుహ సంగమ సుహేల్లిమ్,
> అణుహవఇ కణఅడోరో హుఅవహ వరుణాణ మాహప్పం. (3-11)
> (ఇతరో జనో న ప్రాప్నోతి తవ జఘనారోహణ సంగమ సుఖ కేళిమ్,
> అనుభవతి కనక డోరో హుతవహ వరుణయోః మాహాత్మ్యమ్,)

బంగారు మొలనూలు కట్టుకున్న ఒక జఘన సుందరిని చూచి ఒక రసికు డంటున్నాడు: నీ జఘన ప్రదేశం ఎక్కి బంగారు మొలనూలు ఎంతగా సుఖపడు తున్నదో! అది సామాన్యులకు అబ్బే సుఖమేనా? ఎంత తపస్సు చేయాలి? శ్యాము శబల వ్రతం=నిప్పులో కాగి, నీటిలో మునిగే వ్రతం-చేయాలి. బంగారు మొలనూలు నిప్పులో కాగి, నీటిలో మునిగింది దాని అదృష్టం!

కనక డోరో అనే పదానికి కనకసూత్రం అని వ్యాఖ్య చేశారు వ్యాఖ్యాతలు. డోరో, దారో కటి సూత్రమని దేశీనామమాల గ్రహించింది. ఇది గమనించదగిన విషయం. దారానికి డోరో, ధాగా, డోరా అని ఉత్తర భారత భాషలలో వ్యవహారం. దారం, తోరం తెనుగు పదాలు. దోరో దేశీనామమాలలో చేరింది గనుక తెలుగు పదంలాగే కనిపిస్తుంది.

## 27. లావణ్ణ ఉడే:

పడివక్ఖ మణ్ణు పుంజే లావణ్ణ ఉడే అణంగ గజకుంభే.

(ఉద్దఅస్సః 3-60)

(ప్రతి పక్షమన్యు పుంజౌ లావణ్యకుటౌ అనంగ గజ కుంభౌ.)

ఒక యువతి రొమ్ములు సవతుల కోపపు ముద్దలలాగ, లావణ్యానికి ఇండ్లు లాగ, మన్మథుని గజరాజు కుంభస్థలాలలాగ వున్నవట.

ఈ గాథలోని లావణ్ణ ఉడే అనేది మనకిక్కడ చర్చనీయాంశం. లావణ్ణ ఉడేకు లావణ్ణ ఉలే అనేది పాఠాంతరం. లావణ్యకుటే అని వ్యాఖ్య పయోధరాలు లావణ్య కుంభాలు అని అర్థం. ఉడే శబ్దానికి ఉలే అని ఉన్న పాఠాంతరం ఉళ్ (లోపల, ఇల్లు అనే అర్థాలు గల) పదానికి ప్రతిరూపమా అని సందేహం కలిగిస్తున్నది. లావణ్యానికి ఉళ్-వీడు అని పర్యవసితార్థం. ఇది లావణ్యకుటే అనే వ్యాఖ్యానంకన్నా సమంజసంగా వుంటుంది. వత్థఉడో అనే శబ్దాన్ని "వస్త్రాశ్రయః వస్త్ర నిర్మిత ఆశ్రయ ఇత్యర్థః" అని దేశీనామమాలలో హేమ చంద్రుడు వివరించాడు. వత్థఉడో=వస్త్రకూటః అనడం పొసగదు ఉళ్ శబ్దమే ఉలో, ఉడోగా మారిందనే ఊహకు పై వాదం సాధకం. వీడుకు పర్యాయమైన ఉళ్లు శబ్దం ప్రస్తుతం వ్యావహారిక తమిళంలో వున్నది. ఉళ్ తెలుగులో లో కాగా, ఇల్లు, వీడు మున్నగునవి మాత్రమే మిగిలి పోయివుంటాయి.

## 28. అవ్వో! :

"అవ్వో!" పదం దుఃఖాశ్చర్య సంభ్రమాలలో పలుచోట్ల ప్రయుక్తమైంది.

(1) అవ్వో దుక్కర ఆరఅ! (3-73)
(అవ్వో దుష్కర కారక)
(అమ్మో! ఎంత సాహసివి!)

ఇక్కడ సంభ్రమాశ్చర్యాలు;

(2) అవ్వో అణుణఅ సుహసంఖిరీఅ ! (4-6)
(కష్టం అనునయ సుఖ కాంక్షణ శీలయా)

(అమ్మో ప్రియునితో అనునయింప జేసుకొందామనే కాంక్షతో ఎంతపని చేసింది!) ఇక్కడ కష్టం!

(3) ఉమ్మూలిఆఇఁ అవ్వో అమ్హం రఅణాఇఁ వ సుహాఇం. (5-75)
(ఉన్మూలితాని కష్ట మస్మాకం రత్నానీవ సుఖాని.)

(అమ్మో ఈ విరహమనేది మా సుఖాలను సముద్రం నుంచి రత్నాలు వెలికి తీసినట్లు తీస్తున్నది.) ఇక్కడ దుఃఖాశ్చర్యాలు.

(4) అవ్వో సోచ్చిఅ చ్ఛణో తేణ విణా గామడాహో వ్వ. (6–85)
(దుఃఖం స ఏవ క్షణః తేన వినా గ్రామదాహ ఇవ)

(అతడు లేకపోయిన ఉత్సవం ఊరిలో నిప్పంటుకున్నట్టు వుంది.) ఇక్కడ దుఃఖం.

(5) హత్థాహత్థిం అహమహమిఆఇ వాసాగమమ్మి మేహేహిమ్,
అవ్వో కిం వి రహస్సం ఛణ్ణంపి ణహంగణం గలఇ. (6–80.)

(హస్తాహస్తి అహమహమికయా వర్షాగమే మేఘైః,
ఆశ్చర్యం కిమపి రహస్యం ఛన్నమపి నభోంగణం గలతి.)

(వర్షాకాలం రాగానే మేఘాలు నేను ముందంటే నేను ముందంటూ ఆకాశాన్ని కప్పాయిగదా ! ఇదేమిటి రహస్యం : అమ్మో! ఇంకా కారుతూనే ఉంది : కప్పితే కారడమేమిటి?) – ఇక్కడ కేవలం ఆశ్చర్యం

దుఃఖాశ్చర్య సంభ్రమాలను తెలుగువారు అమ్మో! అవ్వో! అమ్మయ్యో! అయ్యబాబోయ్ : అనే శబ్దాలతో ప్రకటిస్తారు. అవ్వ అమ్మకు ప్రాచీనరూపం; భారతాదులలో ప్రయుక్తం; ప్రస్తుతం కన్నడ ప్రాంతంలోను, తెలంగాణాలోను వ్యవహారంలో వుంది. దేశీనామమాల దీనిని గ్రహించింది– అవ్వా=అంబా అని (1–5).

## 29. ఖిసణేమి :

ఖిసణేమి త్తి పిఅఅమం. (5–12)
(విచ్ఛురామీతి ప్రియతమం)
(ప్రియునిపై విసిరివేద్దామని.

ఖసణేమి, ఖసలేమి అని పాఠాంతరాలు. విచ్ఛురామి అని వ్యాఖ్య "ఖిసణేమి ఇతి విచ్ఛురణే దేశీ" అని వ్యాఖ్యాత వివరణ. విసరు అనే తెలుగు ధాతువు ప్రాకృత వేషమిది. విసరు–బిసరు–ఖిసల–ఖిసణ అయి వుంటుంది. వీస్, బీస్ అని తమిళ కన్నడ రూపాలు, విసరుగా, ఊది పలకడంలో విసరు లోని ఆది వి, బి అయి ఖి అని మహాప్రాణమయింది.

## 30. పుప్ఫుఆ :

సూచిజ్జఇ హేమంతమ్మి దుగ్గఅ పుప్ఫుఆ సుగంధేణ.
ధూమకవిలేణ పరివిరళతంతుణా జుణ్ణవడఏణ.
(అణ్ణఅస్స: 4–29)

(సూచ్యతే హేమంతే దుర్గతః కరీషాగ్ని సుగంధేన,
ధూమకపిలేన పరివిరలతంతునా జీర్ణ పటకేన.)

అతడు దరిద్రుడూ అని ఈ చలికాలంలో స్పష్టమవుతున్నది చూచారా? అతడి గుడ్డలు పిడకల కంపు కొడుతున్నవి, పొగమారి వున్నవి. ఆ గుడ్డలు నేత కూడ విడిపోయి నవిసిపోయాయి.

ఈ గాథలోని పుప్ఫుఅ పదానికి కరీషాగ్ని అని వ్యాఖ్య. ఇది దేశీ పదమని కూడ వ్యాఖ్య చెబుతున్నది. పిడకల నిప్పు. పప్ఫుడో=అగ్ని భేదః అని దేశీ నామమాల ఉదాహరించింది. పిడక+నిప్పుక అనే రెండు పదాలు కలిశాయని, వీటిని కలిపి ఉచ్చరించేటప్పుడు కలిగిన వేగంవలన పిప్పుక అయి, మధ్యనవున్న పువర్ణ సామ్యం వల్ల మొదటి పి వర్ణం పు వర్ణంగా మారి పుప్ఫుఅ అని అయి వుంటుందని ఊహిస్తున్నాను. ఈ గాథ చెప్పినవాడు అణ్ణఅ తెలుగువాడుగా కనిపిస్తున్నాడు; పిడకల నిప్పు అనే శబ్దాన్ని గ్రహించి వుండవచ్చు. పిడక శబ్దానికి పిడుచు మూలం. పుప్ఫుఅ శబ్దానికి ఇంతకన్న సమంజసమైన వ్యుత్పత్తి చూపితే ఆమోదించడం నిస్సంశయం. పూపూ అని ఊదడంవల్ల కలిగిన అనుకరణ శబ్దంవల్ల కూడ ఈ పదం పుట్టిందనే వాదం కూడ సమంజసం కావచ్చు.

## 31. దే :

(1) హిఅఅ దే విరమ ఏత్తాహే. (4-45)
(హృదయ హే విరమ ఇదానీం.)
(ఓ హృదయమా, ఇప్పుడు ఆ పని మానుకో)

(2) హాలిఅఉత్త దే పహరసు వరాఇమ్. (5-56)
(హాలికపుత్ర హే ప్రహరస్వ వరాకీమ్.)
(ఓ కాపు కొడుకా ఈ నిర్భాగ్యురాలిని ఇప్పుడు కొట్టు)

(3) దే సుఅణు పసిఅ ఏణ్హిం. (5-66)
(హే సుతను ప్రసీ దేదానీమ్.)
(ఓ హృదయమా ఇప్పుడు ప్రసన్నం కమ్ము.)

"దే శబ్దః సంబోధనే." అని వ్యాఖ్య. ఎదుటివారి దృష్టిని మనవైపు మళ్ళించుకొనడం కోసం "ఇదిగో చూడండి! ఇదో చూడండి!" అని మనం సంబోధిస్తుంటాము. వచ్చు ధాతువు లోణ్మధ్యమ పురుషైక వచనరూపం 'రా'కు మారుగా 'దా' అని కూడ మనం వ్యవహరిస్తుంటాము (దామ్మా దా, దారా దా అని). సంబోధనార్థకంలో "శివ దో!" అని శివలీలావిలాసంలో ప్రయోగం కనిపిస్తుంది. దా! దే! దో! అనే సంబోధన రూపాలు ప్రాచీన కాలంలో వుండి వుంటాయి. దే దోలు జారిపోయి దా మాత్రం వ్యవహారంలో మిగిలిపోయి వుంటుంది. దో అనే సంబోధన వాచకం మహారాష్ట్రీ భాషలో వున్నదని పండితులు చెబుతారు. ఇది తెలుగునుండే పోయి వుంటుందేమో!

## 32. పేఛిరీ :

పుణరుత్త పేఛిరీఏ. (హాలస్య: 4-71)
(పునరుక్త మ్లేచ్ఛితకయా.)
(పునరుక్త గుప్త భాషణ శీలతో.)

'మ్లేచ్ఛితం గుప్త భాషణ' మని కులబాలదేవుని టీక. పెచ్చారి తన మంటే వాగుడు. "మచ్చరపు వాసుదేవుడు పెచ్చారితనంబు గ్రూను పిల నిట్లనియెన్" అని నాచనసోముడు ప్రయోగించాడు (ఉత్తరహరి వంశం. ఆ-3). ఈగాథలోని సందర్భాన్నిబట్టి గుప్తభాషితమనడానికి మారు పెచ్చారి తనమంటేనే సమంజసంగా వుంటుంది. పేశ్-పేచ్ ధాతువునుంచి పెచ్చారి పుట్టి వుంటుంది. ఈ ధాతువు తమిళంలో మిగిలి, తెలుగులో మరుగైంది. కాని ప్రేలులో కనిపిస్తున్నది.

## 33. చోజ్జం :

బలిణో వాఆ బంధే చోజ్జం ణిఉణత్తణం చ పఅడంతో,
సురసత్థ కఆణందో వామణరూవో హరీ జఅఇ.

(భోజఅస్స 5-6)

(బలే ర్వాచా బంధే ఆశ్చర్యం నిపుణత్వంచ ప్రకటయన్,
సురసార్థ కృతానందో వామనరూపో హరిర్జయతి.)

ఏంత చోద్యం! ఇంత పొట్టిబొటిక హరి. అంత పెద్ద బలికి వాకట్టు చేసి, తన నైపుణ్యం ప్రకటించుకొని, దేవ బృందానికి ఎంతో ఆనందం కలిగించాడు. నాలుగు కాలాలపాటు చల్లగా వుండనీ!

ఈ గాథలోని చోజ్జం అనే మాట పూర్తిగా తెలుగు. దీనిని చుజ్జం అని దేశీ నామమాల పఠించింది. కాని "చోద్యం స్యాదద్భుతే ప్రశ్నే చోదనార్థేతు వాచ్యవత్" అని మేదినీకారుడు చోజ్జాన్ని చోద్యంగా సంస్కృతీకరించి వాడుకున్నాడు. కాని చుద ధాతువును బట్టి ప్రశ్నార్థానికీ, చోదనార్థానికీ వ్యుత్పత్తి చెప్పవచ్చు గాని, ఆశ్చర్యార్థానికి వ్యుత్పత్తి కుదరదు. ఇది పూర్తిగా తెలుగుపదం. సోజిగ, సొజ్జిగ అని కన్నడంలో ప్రాచీన రూపాలు. మేదినీకారుడు చెప్పినట్టు ఇది సంస్కృతమే అయివుంటే, హేమచంద్రుడు దేశీమాలలో గ్రహింపవలసిన అవసరం వుండదు. చోజ్జ శబ్దానికి చోద్యం మూలరూపమయి వుంటుందనే భ్రాంతితో సంస్కృత కవులు ప్రయోగింపగా, మేదినీ కోశకారుడు గ్రహించి వుంటాడు. (దేశీనామమాల 3-14)

## 34. ఉప్పంగో :

ణవపల్లవం విసణ్ణా పహిఆ పేచ్ఛంతి చూఅరుక్ఖస్స,
కామస్స లోహి ఉప్పంగరాఇఅం హత్థభల్లమివ.

(6-85)

(నవ పల్లవం విషణ్ణాః పథికాః పశ్యంతి చూతవృక్షస్య.
కామస్య లోహిత సమూహరాజితం హస్తభల్లమివ.)

మామిడిచెట్టు చిగిర్చింది. చిగురుటాకులు ఎర్రగా కనిపిస్తున్నాయి. పాంథులు వాటిని చూచి విషణ్ణులయిపోయారు. ఆ చిగుళ్లు రక్తంపూసిన కాముని బల్లెంలాగ కనిపిస్తున్నది పాపం వారికి !

ఈ గాథలోని ఉప్పంగశబ్దం "దేశ్యాం సమూహ వచనః" అని వ్యాఖ్య. ఇది ఉప్పెన, ఉప్పొంగు అనే శబ్దాలనుంచి వచ్చిందేమో ! దేశీ నామమాలలో ఉంబర, ఉబ్బూర శబ్దాలు అధిక పర్యాయాలుగా గ్రహింప బడినవి. ఇవి ముమ్మరం, ఉబ్బరం, ఉమ్మరం అనే తెలుగు శబ్దాలేననడంలో సందేహం లేదు. ఈ శబ్దాలను అన్నిటా పోలిన ఉప్పంగ కూడ తెలుగు పదం కాక తప్పదు.

**35. అత్థక్క :**

(1) అత్థక్క గజ్జి ఉబ్బంత. (4–86)
(ఆకస్మిక గర్జి తో ద్భ్రాంత.)
(ఆకస్మికంగా ఉరుమడంవల్ల బెదరిన.)

(2) అత్థక్క రూసణం. (7–75)
(ఆకస్మిక రోషకరణం)

(ఆకస్మికంగా రోషం చూపడం ప్రేమ ప్రదర్శనంలో ఒక లక్షణం.)

"అత్థక్కేతి ఆకస్మికే. అస్కృతే వా దేశీ" అని వ్యాఖ్య. వ్యాఖ్యాకారుడు దీనిని దేశీ అంటున్నాడు. ఆకస్మికతకు, ఆశ్చర్యం తెలుపడానికి తెలుగువారు అమ్మక్క ! అమ్మకచెల్ల ! అమ్మయ్య ! మున్నగు పదబంధాలు ప్రయోగిస్తారు. వీని పోలికగల అత్థక్క కూడ తెలుగే నేమో ! అతర్కిత అనే పదం అత్థక్క కావడానికి అవకాశం వుంది. కాని వ్యాఖ్య దీనిని దేశీ అన్నది.

**36. పలాల :**

పాలేఇ అచ్ఛభల్లం వ ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంత ఆల పహిఅ విజ్ఝాయంతం పలాలగ్గిమ్.

(కాలసీహాస్సః 2–9)

(పాటయ త్యచ్ఛభల్ల మివ పశ్యత కుగ్రామ దేవకులద్వారే,
హేమంతకాల పథికః విధ్మాయమానం పలాలాగ్నిమ్.)

ఈ గాథలోని వర్ణనం అత్యంత హృదయంగమం. చలికాలం. పల్లెటూరి దేవాలయం ముంగిట ఒక బాటసారి గడ్డినెగడు వేశాడు. ఆరిపోతున్న గడ్డి నిప్పును కలియబెడుతుంటే ఎలుగుబంటిని చీల్చుతున్నట్టు వున్నది. కాలిన గడ్డి నిప్పు ఆరిపోగానే నల్లగా, పెద్ద రాశిగా కనిపిస్తుంది. నిప్పు వేడికోసం కర్రతో కలియబెట్టినప్పుడు లోపల నిప్పు ఎర్రగా కనిపిస్తుంది. ఇదే పొట్ట చీల్చిన ఎలుగుబంటిలాగ వుందన్నమాట. దీనిని కవి ఎంత మనోహరంగా ఉత్ప్రేక్షించాడో !

ఈ గాథలో గడ్డికి గాథాకారుడు పలాల అని ప్రయోగించాడు. పలతి సస్యశూన్యత్వం ప్రాప్నోతి—పలాలః అని శబ్దకల్పద్రుమకారుని వ్యుత్పత్తి.

ఈ వ్యుత్పత్తి అసమంజసమనడానికి వీలులేదు. పలాల శబ్దం అతి ప్రాచీనం. "ప్రోక్షణాత్తృణ ధాన్యంచ పలాలం చైవ శుద్ధ్యతి" (తృణధాన్యాలు, గడ్డి ప్రోక్షణంవల్ల పరిశుద్ధమవుతాయి) అంటాడు మనువు. పుల్లి, పిల్లిరీ శబ్దాలను తృణపరంగా దేశీనామమాల ఉదాహరించినప్పుడు పలాల శబ్దాన్నికూడ గ్రహించవలసింది. తెలుగు, కన్నడ, తమిళాలలో పుల్ తృణ సామాన్యవాచి. చిప్పర—చిర్ + పుల్...పచ్చిక పుల్లి, పిల్లిరీ, పలాల శబ్దాలు పుల్ నుంచి పుట్టినట్టివే. (దేశీనామమాల 6–79)

## 37. అలాహి :

అలాహి కిం పాఅరాఏణ? (2–27)
(అపగచ్ఛ కిం పాదరాగేణ?)
పారాణి ఒల్లను పో - అంటున్నది కోపించిన నాయిక.

అలాహి—నివారణే. అక్కరలేదు అని అర్థం. అలాహికి అలాభి అని పాఠాంతరం. అలాహి శబ్దాన్ని నివారణార్థంలో శబ్దానుశాసనంలో నిపాతం చేసినట్టు హేమచంద్రుడు దేశీ నామమాలలో సూచించాడు. వ్యుత్పత్తి కుదరక, ఆకరం తెలియకనే కదా పీడ విరుగడయిందని నిపాతంలో పడవేయడం! గాథలోని సందర్భాన్ని బట్టి అలాహి శబ్దానికి "అక్కరలేదులే, ఒల్లను పో" అని అర్థం. అలాహి ఒల్ల శబ్దం నుంచి కాని, నిషేధార్థకమైన అల్ల శబ్దం నుంచి కాని పుట్టి వుంటుంది అల్ల, ఇల్ల, ఉల్ల శబ్దాలలో ఇల్ల శబ్దం తెలుగులో లే అయి, ఉల్ల ఒల్లగా మారి, అల్ల వ్యవహార భ్రష్టమయింది

## 38. ఉఅ, ఉఅహ :

(1) ఉఅ ణిచ్చల ణిప్పందా! (1–4)
(పశ్య నిశ్చల నిఃస్పందా!)
(చూడు ఆ కొంగ ఎంత నిశ్చలంగా కూర్చున్నదో!)

(2) ఉఅహ పడలంతరోఇణ్ణ ణిఅఅ తంతుద్ధపాఅ పడిలగ్గమ్,
దుల్లక్ఖ సుత్త గుత్తేక్క బఉలకుసుమం వ మక్కడఅమ్ (1–63)
(పశ్యత పటలాంతరావతీర్ణ నిజక తంతూర్ధ్వపాదప్రతిలగ్నమ్,
దుర్లక్ష్య సూత్రగ్రథితైక బకులకుసుమ మివ మర్కటకమ్.)

చూచారా? పైకప్పు నుంచి సాలీడు తన దారం అందుకొని తల్లకిందులుగా జారుతున్నది. కాని దాని దారం కనిపించడం లేదు. కనిపించని దారంతో కట్టిన పొగడ పూవు లాగ వుంది ఆ సాలీడు.

(3) ఉఅ! పోమ్మరాఅ మరగఅ సంవలిఅ ణహాఅలాఓ ఓసరఇ.
ణహసిరి కంఠభ్భట్ఠ వ్వ కంఠిఆ కీరరింఛోళీ. (1–75)
(పశ్య! పద్మరాగ మరకత సంవలితా నభస్తలా దవతరతి,
నభఃశ్రీ కంఠభ్రష్టేవ కంఠికా కీరపంక్తిః.)

చూచారా ఆకాశంలో పైనుంచి కిందికి దిగివస్తున్న చిలుకలబారు! ఆకాశలక్ష్మి పద్మారాగాల, పచ్చల కంఠె జారి పడుతున్నట్టు లేదూ?

(4) ఉఅ సంభమ విక్ఖిత్తం. (5-61)
(పశ్య సంభ్రమ విక్షిప్తం.)
(చూడండి చెదరి ఎగరేసిన గుడ్డ.)

(5) ఉఅహ తరుకోడరాఓ. (6-62)
(పశ్యత! తరుకోటరాత్.)
(చూడండి! చెట్టు తొఱ్ఱ నుంచి.)

(6) ఉఅ సింధవ పవ్వఅ సచ్ఛహో ఇం. 
(పశ్య సైంధవ పర్వత సదృశాణి.)
(చూడండి సైంధవలవణ పర్వతాలవంటి.)

"ఉఅ, ఉఅహలను–పశ్య, పశ్యత" అని వ్యాఖ్య. ఈ రెండు శబ్దాలూ పలుమారు ప్రయోగింపబడినవి. కొన్నిటిని మాత్రమే పైన ఉదాహరించాను. ఈ రెండు రూపాలూ పశ్య, పశ్యత అనే లోణ్మధ్యమ పురుష రూపాలకు నిపాతాలు. యథావత్తుగా గ్రహించి నిపాతం చేయడంవల్లనే ఇవి దేశీ శబ్దాలని విస్పష్టమౌతున్నది కదా! తెలుగు ప్రాచీన సంబోధన రూపమైన ఓయి ఉఅ, ఉఅహ అనే ప్రాకృత వేషంతో దర్శనం ఇస్తున్నదని నా ఊహ.

## 39. కఏ:

(1) తుజ్ఝ కఏ తహవి తనుఆఇ. (హాలసప్తశతి: 1-30)

(తవకృతే తథాపి తనుకాయతే.)
(అయినా, నీకోసం చిక్కిశల్యమౌతున్నది.)

(2) భణ కస్స కఏ కఓ మానో? (5-32)
(భణ కస్యకృతే కృతో మానః?)
(చెప్పు, ఎవరి కోసం ఈ మూతి బిగింపు?)

(3) జస్స కఏ ణం పిఅసహి? (6-22)
(యస్య కృతే నను ప్రియసఖి?)
(ప్రియ సఖి ఎవరికోసం?)

(4) ధవలస్స కఏ జీఅంతి గిట్టీఓ. (7-38)
(ధవలస్య కృతే జీవంతి గృష్టయః)
(ఓవృషభరాజమా, నీకోసమే ఆవులు బ్రదుకుతున్నాయి సుమా!)

పై గాథలలోనే గాక, మరిపెక్కు గాథలలోను కఏ ప్రయుక్తమైంది. ఇది తెలుగు చతుర్థీ విభక్తి కయి–కైల ప్రాకృత వేషం. ప్రాకృతంలో చతుర్థీ విభక్తి లేదు. నాసికలోని అశోకుని శాసనంలో చతుర్థీ విభక్తి కనిపించదు.

శౌరసేనీ ప్రాకృతంలో చతుర్థీ విభక్తి లేదని, మహారాష్ట్రీ ప్రాకృతంలో అకారాంత శబ్దాలకు క్వాచిత్కంగా ఏకవచనంలో మాత్రం వుందని పుల్నర్ పండితుడు ప్రాకృతవ్యాకరణ ప్రవేశికలో తెలిపాడు.[12] తమిళ భాషలో కు, అక్కు,కన్నడంలో గె, ఇగె, ఇంగే, ఇకే, కం, గం అనే చతుర్థీ విభక్తి ప్రత్యయాలు తెలుగు కై, కయిలను పోలివున్నవి. తెలుగు కై, కయి ప్రాకృతంలో కఏగా మారి చేరివుంటుంది. ఈ కఏను సాధించడం కోసం సంస్కృతపండితులు కృతే అనే అవ్యయాన్ని కల్పించుకొని సంతృప్తి పడ్డారు.

## 40. అనుకరణ శబ్దాలు :

అనుకరణ శబ్దాలు, పదబంధాలు లేని భాష వుండదు. కాని, తెలుగులోని అనుకరణ శబ్దాల వంటివే మరొక భాషలో కనిపిస్తే ఆ రెండు భాషలూ ఆదాన ప్రదానాలు చేసుకొన్నాయని అనుకుంటాము. ఏదైనా వస్తువు పైనుంచి పడినప్పుడు వివిధ భాషలలో వివిధ అనుకరణ శబ్దాలు పుడుతాయి. ఏదైనా పడితే హిందీ వారు ధఢాంసే గిరా అంటారు. దభీమని పడింది అని తెలుగువారంటారు. ధన్నంత బిత్తు అని కన్నడులంటారు. ప్రాకృతంలో వీటికి దగ్గరగా వున్న పదబంధాలు కనిపిస్తే, ఆయా భాషల నుంచి చేరి వుంటాయేమోనని భావిస్తాము.

(1) మాణో సురసురంతో. (1-74)
(మానః సురసురాయమాణః.)
(సురసురమంటూ కోపం చల్లారిపోయింది.)

(2) హత్థా థరహరంతి. (2-65)
(హస్తౌ థరథరాయేతే.)
(చేతులు థరథర వణకుతున్నాయి.)

(3) హిఅఅం థరథరేఇ. (2-87)
(హృదయం థరథరాయతే).
(హృదయం థరథర మంటున్నది.)

(4) సణిఅం సణఅం. (5-8)
(శనైః శనైః.)
(సన్నగా సన్నగా.)

(5) ధుక్కాధుక్కఇ జీవం.) (6-88)
(ధుకధుకాయతే జీవః.)
(ధుకధుక లాడుతున్నది జీవం.)

---

12. ప్రాకృత వ్యాకరణం - ఉపోద్ఘాతం-పుట 82, 88.

సణిఅం సణిఅం=శనకైః శనకైః అనివ్యాఖ్య. మెల్లగా, సన్నగా-సన్నగా అనే తెలుగు పదబంధం సణిఅం సణిఅంకు అన్నిటా పోలివుంది. సన్న, చిర్, చిన్న మున్నగు పదాలు అన్ని దాక్షిణాత్య భాషలలోను కలవు. కనుక ఈ పదబంధం తెలుగుదనడం అన్యాయమేమీ కాదు. ఇంకా వాదానికి వస్తే శనైః అనే అవ్యయానికి కూడ చిన్న సన్న శబ్దాలే మూలమని ఘంటా ఘోషంగా చెప్పవలసి వుంటుంది.

సంస్కృత ప్రాకృతేతరపదాలని ధ్వనించే హాల హాలం=కామౌత్సుక్యమ్, టిడహాట=తరుణ్యాః, వాడిల్లఅం, చిత్రం.=ఊవరం=కేవలం, తిత్తిల్లట=దౌవారకః, వేల్లహాలం=సుందరం, రించోళి=పంక్తి, హాల్ల ఫలం=కోష్ణసుగంధి జలం మున్నగు ఉక్కు సెనగల వంటి శబ్దాలను మెదిపి గంధం తీయవలసివుంది.

ఇంతకూ, దాదాపు రెండువేల యేండ్ల క్రిందటి తెలుగు పదాలు ప్రాకృత సాహిత్యంలో ఎలా చేరిపోయాయో పరిశీలించడమే ఈ వ్యాసం ఉద్దేశం. సోపపత్తికంగా వున్నవాదాన్ని గ్రహించడానికి అభ్యుదయ కాములెవరూ వెనుకాడ రనుకుంటాను.

— o—

31

## గాథాసప్తశతిలోని నగనట్రు

"నాన్నా, నాకొక కంటె కొని పెట్టవూ! మెడలో వేసుకుంటే ఎంచక్కగా ఉంటుందో!'' అని అడిగింది నాలుగేళ్ళ మాపాప నీరజ. "కంటె యేమిటమ్మా? చాలాపాతకాలం నగ! నీకు కొత్త నెక్లెసే చేయిస్తాలే'' అని అన్నాను. "ఊహు! నాకు కంటే కావాలి. అదే ఇప్పుడు ఫాషన్ అని పక్కింటి జయ చెప్పింది. దాని కంటే నీకేమి తెలుసు ఫాషన్ సంగతి? అది నాకంటే రెండేళ్లు పెద్ద. రెండో క్లాసు చదువుతూంది.'' అని మండలించింది నన్ను పాప. "ఔనండీ! పాతవన్నీ మరీ ఇప్పుడు ఫాషన్లు అవుతున్నాయి.'' అని సమర్థించింది మా ఆవిడ అనంతలక్ష్మి.

చక్రనేమి క్రమమంటే ఇదే కాబోలు!—అనుకున్నాను. అయినా, మన సంస్కృతి చక్రనేమి క్రమంకాదే; శంఖావర్తక్రమమే. మన సంస్కృతి శంఖంమీది వర్తులంలాగ చుడుతూ పైకిపోతుంది. ఒక్కొక్క వంపుతిరుగుతున్నప్పుడల్లా వచ్చిన స్థానానికే వస్తున్నట్టు అనిపిస్తుంది. కాని, తీరా దగ్గరికి వచ్చేసరికి ఆ వంపుదాటి కొంతపైకే గమనం కనిపిస్తుంది. మరి పాతఫాషన్లు రావడమేమిటి? — అని అనుకుంటున్నాను.

ఇంతలోకే అడిగింది మా ఆవిడ "కంటె పాతది పాతది అంటున్నారే ఎంత పాతదండీ?" అని కోర్టులో క్రాసు పరీక్ష చేసినట్టు; విధానసభలో అత్యవసర ప్రశ్న అడిగినట్టూను. "రెండు వేల యేళ్ల పాతది" అన్నాను. "చిత్రంగా వుందే. ఆ కంటె ఒక్కటేనా? ఇంకేమయినా నగలున్నాయా?'' అని మరొక అనుబంధ ప్రశ్న వేసింది. "ఇంకా ఎన్నో వున్నాయి'' అన్నాను. సాక్ష్యం భట్టీయం పెట్టిన సాక్షిలాగ. "సరిగా ఇలాటి నగలేనా?" అని మరొక ప్రశ్న విసిరింది న్యాయవాది నిందితుని క్రాస్ పరీక్షలో కార్నర్ చేస్తున్నట్టు. "దాదాపు ఇలాటివే!" అని సమాధాన మిచ్చాను పోలీసు సాక్షిలాగ. "మరి చెప్పరేమండీ వాటిని? కొత్త ఫాషనులు సృష్టించి కీర్తి కొట్టేద్దును కదా!'' అని దెప్పింది; ఇంతవరకు చెప్పకపోవడం నా తప్పే అయినట్టు. "ఇప్పుడైనా చెప్పండి వాటిని. ఫాషన్‌పితామహి అయిపోతాను'' అన్నది.

### 1. పచ్చల కంటె :

సంస్కృత నాటకాలలోని అంకావతరణంలాగ సాతవాహనుల నాటి తెలుగుసీమ నా ఎదుట అవతరించి పొద్రిపూల పరిమళం గుప్పున కొట్టి, తల దిమ్మెక్కి పోయింది. ఉద్యానవనంలో విహరిస్తున్న ఇద్దరు ప్రేయసీప్రియులు

కనిపించారు. నిర్మల నీలాకాశం, మునిమాపువేళ, చిలుకలు బారులుకట్టి గూళ్లకు చేరుకుంటున్నాయి. ప్రియుడన్నాడు: "ప్రియతమా, చూచావా, ఆ చిలుకల బారును? ఆకాశంనుంచి ఒంపుగా ఎలా దిగుతున్నదో! గగనలక్ష్మి మెడనుంచి జారి కిందికి పడుతున్న పచ్చలు, పద్మరాగాలు చెక్కిన కంఠెలాగ లేదూ?" ప్రియురాలు విస్తుపోయి అలా చూస్తూనే వుంది.

ఉఅ పోమ్మరాఅ మరగఅ సంవలిఆ ణహఅలాఓ ఓసరఇ,
ణహసిరి కంఠభ్భట్ఠ వ్వ కంఠిఆ కీరరింఛోళీ. ( 1–75 )

(పశ్య పద్మరాగ మరకత సంవలితా నభస్తలా దవతరతి,
నభః శ్రీ కంఠభ్రష్టేవ కంఠికా కీరపంక్తిః.)

## 2. గాజులు :

ఇంతలోనే గలగలలు -గాజుల గలగలలు వినిపించాయి. ఆ గలగలలలోనూ ఏదో గాభరా ధ్వనించింది. ఒక వియోగిని! పతి దూరదేశం వెళ్లాడట. ఇదిగో వస్తాడు, అదిగో వస్తాడు అనుకొని చింతిస్తూ కాలం గడుపుతున్నదేమో, కళ్ళు మూసుకొని పక్కపై పడుకొని పతిధ్యానంతో! పతి సమీపించాడనే భ్రాంతి చెందింది కాబోలు! తన్నుతానే కౌగలించుకొంది. చేతిలోని గాజులు గలగలమంటూ జారిపోయాయి. పాపం! ఆమెను భ్రాంతిలోనే వుండనీండి. భ్రాంతికూడ ఒకప్పుడు సుఖదాయకమే. రజ్జు సర్పభ్రాంతి మాత్రం భయావహం సుమండీ! రంగరజత భ్రాంతి దురాశావహం.

సఅణే చింతా మఇఅం కాఊణ పిఅం ణిమీలిఅచ్ఛిఏ,
అప్పాణో ఉవఊఢో పసిఢిల వలఆహిం బాహాహిం. (2–88)

(శయనే చింతామయం కృత్వా ప్రియం నిమీలితాక్ష్యా,
ఆత్మా ఉపగూఢః ప్రశిథిల వలయాభ్యాం బాహుభ్యామ్.)

ఎంత అమాయకురాలీమె! భర్త పరదేశం వెళ్ళగానే బెంగపడిపోయి, తామరతూడులాగా వసివాడిపోయింది. చెలికత్తెను అడుగుతుంది గదా—భర్తలు దూరం వెళ్లగానే ప్రతి వనిత చేతిలోని గాజులూ ఇలాగే పెరుగుతాయా ?—అని. బాగుందమ్మా బాగుంది. ఇలా అడక్కు. ఎవరైనా వింటే నవ్వుతారు!

సహి సాహసు సబ్భావేణ పుచ్ఛిమో కిం అసేస మహిలాణమ్,
బడ్ఢంతి కరత్థిఆ వ్విఅ వలఆ దఇఏ పఉట్టమ్మి. (5–53)

(సఖి కథయ సద్భావేన పృచ్ఛామః కి మశేష మహిలానామ్,
వర్ధంతే కరస్థితా ఏవ వలయా దయితే ప్రోషితే.)

అంతగా అఘాయిత్యం చేస్తున్న అత్తగారు అమాంతం చల్లబడిపోయింది, ఎందుకూ అక్కడ? కోడలిపైన కారాలూ మిరియాలూ నూరేదే సదా సర్వకాలమూ. కాని కుమారుడు ఊరిలో లేనట్టుంది. కోడలు పాదాభివందన

తీయబోగా రెండు చేతులలోని గాజులూ జారి కింద పడ్డాయి—తన పాదాలమీద. ఎంత రాతి గుండెగలదైతే మాత్రం, తన కుమారుని కోసరం వనరుతున్న కోడలిని కనికరించదూ? తనూ కంట తడి పెట్టింది.

అఇ కోవణా వి సాసూ రుఆవిఆ గఅవఇఆఅ సోహ్ణాఏ,
పాఅపడణోణ్ణఆఏ దోసు వి గలిఏసు వలఏసు. (5–98)

(అతికోపనాపి శ్వశ్రూ రోదితా గతపతికయా స్నుషయా,
పాదపతనావనతయా ద్వయోరపి గలితయోర్వలయయోః.)

ఈ దృశ్యం మరీ బాగుంది! అల్లుడు అత్తవారింటికి వచ్చాడు. అపరాహ్ణమైంది. అమ్మాయేమో తీరికగా పెరట్లో స్నానం చేస్తున్నది. ఒకటే గాజుల గలగల! వాకిట్లో అరుగుపై కూర్చున్న అల్లుడి మనస్సు ఏ గతిలో పడుతుందో మీరే చెప్పండి. ఆలస్యంగా ఎందుకు వచ్చాడట! ఉదయమే రాకపోయాడా! ఇంతకూ అమ్మాయికి ఏమి సరదా చెప్పండి తీరికగా గాజులను చప్పుడు చేస్తూ, ఒళ్లు తోముకుంటూ స్నానం చేయడం! స్నానం చేస్తుంది పో. ఆ గాజుల చప్పుడు ఎందుకు! ఆ చప్పుడును ఎవరు ఆలకించమన్నారు అల్లుడిని! బాగుంది. ఎవరి ధ్యాన వారిది.

అవరణ్హాగఅ జామాఉఅస్స విఉణేఇ మోహణుక్కంఠమ్.
బహుఆఏ ఘరపలోహర మజ్జణ పిసుణో వలఅసద్దో. (7–83)

(అపరాహ్ణాగత జామాతుః ద్విగుణయతి మోహనోత్కంఠమ్,
వధ్వాః గృహ పశ్చాద్భాగ మజ్జనపిశునో వలయశబ్దః.)

ఊహుఁ! ఎంత తమాషా అయినా గాజులు చిట్లగొట్టడం న్యాయం కాదు. ఆ అమ్మాయి అయినా ఏమీ ఎరుగని భోళా మనిషి అయి వుండాలి. లేదా, ఆమె ప్రియుడైనా వెర్రిబాగులవాడయి వుండాలి. పెండ్లి పెటాకులూ లేని పిల్ల గాజులు చిట్లగొట్టి రట్టు రట్టు చేస్తే ఏమి సాధించినట్టు! మనకెందుకు మధ్య! ఏమైనా, అతడు ఆ దురదృష్టవంతురాలి ప్రియుడు!

కో వి ణ ఆణఇ తస్స వి కహేఇ భగ్గాఇం తేణ వలఆఇం,
అఇఉజ్జుఆ వరాఈ అహవ పిఓ సే హఆసాఏ. (5–87)

(కోఽపి న జానాతి తస్యాపి కథయతి భగ్నాని తేన వలయాని,
అతిఋజుకా వరాకీ అథవా ప్రియ స్తస్యాః హతాశాయాః.)

ఇది మరీ బాగుంది. తన గుడ్డంత అన్నం ముద్ద కనిపిస్తుంటే, కాకి ఎందుకు ముట్టుకోదు! ఆ ఇల్లాలు పాపం తన భర్త మేలు కోసం కాకికి పిడచలు వేసింది. దానిలో విషమేమైనా కలిపిందా! లేదే. మరి హాయిగా తినరాదూ? ఏం! ఓహో అదా సంగతి? విరహవేదనతో కృశించిన ఆ ఇల్లాలి చేతి గాజు ఆ ముద్ద చుట్టూ పడిందయ్యా, దానితో, అదేదో తనను పట్టుకోవడానికి వేసిన ఉచ్చు అనుకొని కాకి ముట్టుకోవడం లేదు. తన మనోవేదనలో ఆ ఇల్లాలు తన గాజు సంగతే మరచిపోయింది.

పాపాసంకే కాకే [illegible] దిణ్ణం పి వహిఆ ఘరణీఏ,
ఓణంత కరఅల[illegible] పిండమ్. (3-5)

(పాశాశంకీ కాకో నేచ్ఛతి దత్తమపి పథిక గృహిణ్యా,
అవనత కరతలావగలిత వలయ మధ్యస్థితం పిండమ్.)

## 3. బంగారు కుండలాలు-తాటికమ్మ :

కాలం ఒకే తీరుగా వుంటుందా? ఓడలు బండ్లను వచ్చును ఓడలు నా బండ్లమీద వొప్పుగ వచ్చున్ గదా? కలిమిలేములు కావడికుండలు. ఒకప్పుడు ఈ ఇల్లాలు బంగారు కుండలాలు ధరించి, ఆ కుండలాల కాంతి చెక్కిళ్ల మీద పడితే మహా కులికేదేమో! కాలం మారింది. ఏమి చేస్తుంది మరి? తాటికమ్మలు పెట్టుకోవలసివచ్చింది. ఇంతకూ సహజ సుందరులకు నగ లెందుకు లెండి? తాటి కమ్మలైనా అందమిస్తాయి; తారకలైనా తళతళలు లిస్తాయి.

పరిరద్ధ కణఅ కుండల గండత్థల మణహరేసు సవణేసు,
అణ్ణఅ సమఅ వసేణ అ పహిరజ్జఇ తాళవేంటజుఅమ్. (4-98)

(పరిరబ్ధ కనకకుండల గండస్థల మనోహరయోః శ్రవణయోః,
అవ్యాసమయ వశేన చ పరిధ్రియతే తాలవృంత యుగమ్.)

## 4. నీలాల దుద్దులు :

అరెరె! ఎందుకామె కాటుక కంటినీరు కురిపిస్తోంది? ప్రక్కనే ప్రియుడున్నాడే! ఎక్కడికైనా వెళ్ళిపోతున్నాడా? అలాటి ప్రయాణ చిహ్నాలేవీ కనిపించవే? మరి ఎందుకా కంటి నీరాలు? చెక్కిళ్లు తడిసిపోతున్నాయే. ప్రియుడు కూడ చేత్తో తుడుస్తున్నట్టున్నాడు!........ఓహ్! రంగరజత భ్రాంతి అంటే ఇదే కాబోలు? ఏమేమో చెవులకు నీలాల దుద్దులు పెట్టుకుంది. మంచి[illegible] నీ[illegible]లేమో మెరసిపోతున్నాయి కాంతులు చెక్కిళ్ళ మీద పడి. దానికి తోడు వెన్నెల వెలుగు. ఆ నీలాల కాంతి, వెన్నెలా కలిసి కాటుక కంటినీరులా కనిపించింది. దగ్గరవున్న ప్రియుడు కూడ మోసపోయి చేత్తో తుడిచివేయడానికి ప్రయత్నించినప్పుడు, దూరంగా నిలబడి చూస్తున్న నాలాటివాడు చూచి భ్రాంతిపడడంలో అబ్బురమేముంది?

పుసిఆ అణ్ణాహర ణేందణీల కిరణాహఆ ససిమఊహా,
మాణిణి వఅణమ్మి సకజ్జలంసు సంకాఇ దఇఏణ. (4-2)

(ప్రోంఛితాః కర్ణాభరణేంద్రనీల కిరణాహతాః శశిమయూఖాః,
మానినీ వదనే సకజ్జలాశ్రుశంకయా దయితేన.)

## 5. కర్ణావ[illegible] :

ఆ రైతు [illegible] ఆనందంగా ఉన్నాడు. చెవిలో వేరేదు చివురు చెక్కుకుని. [illegible] అరమోడ్పు గన్నులలో అతనివైపే చూస్తోంది? అ[illegible] ఆ చూపులు !

పామాఇ సామలిజ్జఇ అద్ధచ్ఛి వలోఇరీఅ ముహసోహా,
జంబూదల కఅ కణ్ణావఅంసభరిఏ హాలిఅవుత్తే. (2-80)

(శ్యామాయాః శ్యామలాయతేऽర్ధాక్షి ప్రలోకన శీలాయా ముఖశోభా,
జంబూదలకృత కర్ణావతంస భ్రమణశీలే హాలిక పుత్రే.)

నవ యౌవనంతో మిసమిసలాడే ఆ [illegible] చిక్కుకున్న పూగుత్తి చెక్కిలిపై వాలడం బాగానే ఉంది. [illegible] చెక్కిలి చక్కదనమంతా లాగివేస్తున్నట్టు ఊగిసలాడడం మాత్రం భరింపలేమండి!

సామాఇ గురుఅ జోవ్వణ విసేసభరిఏ కవోల మూలమ్మి.
పిజ్జఇ అహోముహేణ వ కణ్ణవఅంసేణ లావణ్ణమ్. (5-89)

(శ్యామాయా గురుక యౌవన విశేషభృతే కపోలమూలే,
పీయత్యధో ముఖేనేవ కర్ణావతంసేనే లావణ్యమ్.)

## 6. గురువింద దండ :

ఎవరి ఇష్టాన్నిబట్టి వారు ఇతరులను ఆదరిస్తారు; వస్తువులపై కూడ అభిరుచి చూపుతారు; గుణాన్నిబట్టి కానేకాదు. ఆ పుళిందుల అభిరుచి ఏమిటో చెప్పండి. ముత్యాలు మాని గురిగింజలనే గ్రహిస్తారు. ముత్యాలు వారికి లెక్కలోనివి కావు; ఏనుగులను చంపి ఎప్పుడు ఐడితే అప్పుడు సంపాదిస్తారు. గురిగింజలంతా పరువం తగిలినప్పుడే గదా పండుతాయి ! "అతి పరిచయా దవజ్ఞా" అని పెద్దలు ఊరికే అన్నారా ?

న గుణేన హీరఇ జణో హీరఇ జో జేణ భావిఓ తేణ,
మోత్తూణ పులిందా మోత్తిఆఇఁ గుంజాఓ గేణ్హంతి. (4-10)

(న గుణేన హ్రియతే జనో హ్రియతే యో యేన భావిత స్తేన,
ముక్త్వా పులిందా మౌక్తికాని గుంజాః గృహ్ణంతి.)

## 7. సిగపై నెమలి పింఛం :

ఈ వ్యాధ వధువంతా మరీ [illegible] చంపి సంపాదించిన ముత్యాల దండలు వేసుకొని [illegible] దురూంటే, తను అవన్నీ మాని, నెమలి పింఛం [illegible] కొని మరీ ఇదిగా మురిసిపోతున్నది.

సిహి పేహుణావఅంసా వహుఆ వాహస్స గవ్విరీ భమఇ,
గఅమోత్తిఅ రఇఅ పసాహణాణం మజ్ఝే సవత్తీణమ్. (2-73)

(శిఖి పిచ్ఛావతంసా వధూ ర్వ్యాధస్య గర్వితా భ్రమతి,
గజ మౌక్తికరచిత ప్రసాధనానాం మధ్యే సపత్నీనామ్.)

## 8. ముత్యాల దండ :

ఆమె ఎత్తైన, సందులేని రొమ్ములపైన ముత్యాల హారాలకు దారి కనిపించలేదేమో! ఏమీ తోచక యమునా నది నీటిపై తేలాడే నురగ ముద్దల్లాగ అటూ ఇటూ దొర్లాడుతున్నాయి.

మగ్గం చ్చిఅ అలహంతో హారో పీణుణ్ణఆణ థణఆణమ్,
ఉవ్విగ్గో భమఇ ఉరే జఉణాణఇ ఫేణ పుంజో వ్వ. (7–69)

(మార్గమివాలభమానో హారః పీనోన్నతయోః స్తనయోః,
ఉద్విగ్నో భ్రమత్యురసి యమునా నదీ ఫేన పుంజ ఇవ.)

## 9. బంగారు మొలనూలు :

"పెద్ద పదవులు ఎంతో తపస్సు చేస్తేగాని రావు. వ్రతాలు, పూజలూ తపస్సు లాంటివే. నిప్పులో కాలి, నీటిలో తడిసి చేసే వ్రతాన్ని శ్యామ శబల వ్రత మంటారు. ఓ బంగారు మొల త్రాడూ, నీవు నిప్పులో కాలి, నీటిలో మునిగి శ్యామ శబల వ్రతం చేశావు. కనుకనే ఆ సుందరి జఘనారోహణ సంగమ సుఖం అనుభవిస్తున్నావు. మరొకరికి ఈ సుఖం లభిస్తుందా!" అని ఒక కాముకుడు కనకమేఖలాలంకృత అయిన ఒక కాంతను చూచి వాపోయాడు. ఇలాటి రోడ్ సైడ్ రోమియోలు లేని కాలమంటూ ఉందంటారా!

ఇఅరో జణో ణ పావఇ తుహ జఘణారుహణ సంగమసుహేల్లిం,
అణుహవఇ కణఅ దోరో హుఅవహ వరుణాణ మాహప్పం. (8–11)

(ఇతరో జనో న ప్రాప్నోతి తవ జఘనారోహణ సంగమ సుఖకేలిం,
అనుభవతి కనక దోరో హుతవహ వరుణయో ర్మాహాత్మ్యమ్.)

## 10. నీలాల మొలనూలు :

తుమ్మెదలదే అదృష్టమంటే! బాగా వికసించిన కమల మందిరంలో మకరందం మస్తుగా తాగి, ఝుయ్ మంటూ బారులు కట్టి బయలుదేరుతాయి. చూచేవాడికి వసంత లక్ష్మి నీలమణి మేఖల—నీలాల మొలనూలు-వలె కన్పిస్తూ మహానందం కలిగిస్తాయి.

రుంచారవింద మందిర మఅరందానంది అలిఅరింఛోళీ,
ఝణ ఝణఇ కసణ మణిమేహల వ్వ మహుమాస లచ్ఛీఏ. (6–74)

(ఋహాదరవింద మందిర మకరందానందితాలి పంక్తిః,
ఝణ ఝణాయతే కృష్ణమణి మేఖలేవ మధుమాస లక్ష్మ్యాః.)

## 11. కాలి అందెలు :

ఇదిగో ఇక్కడ ఇలే తమాషా జరుగుతున్నది. ఔను మరి? భార్యతే ఎప్పుడూ నమస్కారం చేయాలా భర్తలకు? భర్తలు చేస్తే ఏం పోయిందట! ఏమి తప్పు చేశాడో ఏమో భార్య కాళ్లపై పడ్డాడు. తప్పేమి పెద్దది కాదట. గడువుకు సరిగా ఇల్లు చేరుకోలేదు. పరదేశం వెళ్లిన వాడు మరి? ఆమేమో కొంచెం బిగుమానం మనిషి. వచ్చిన వాడిని పలుకరించలేదు పట్టింపు లెందుకు తల్లీ? పతి దైవం కదా! అతడు సామాన్యుడా! మరి గడసరి. వెంటనే కాళ్లబేరం. అపరాధ సహస్ర భాజనం అని ఆమె పాదాలపై పడ్డాడు; కిటుకు తెలిసి. అదృష్టవశాత్తు ఆమె కాలి అందెలలో అతని జుట్టు చిక్కుకుంది. ఆమె తటాలున వంగి విడిపించడం మొదలు పెట్టింది. అబ్బాయ్! ఇక అమ్మగారి కోపం చల్లబడినట్టే. లేకపోతే చిక్కుకున్న జుట్టు చిక్కెందుకు విడిపిస్తుంది?

ణేఉర కోటి విలగ్గం చిఉరం దఇఅస్స పాఅవడిఅస్స,
హిఅఅం పఉత్థమాణం ఉమ్మోఅంతి వ్విఅ కహేఇ.

(అణంగస్సః 2-88)

(నూపురకోటి విలగ్నం చికురం దయితస్య పాదపతితస్య,
హృదయం ప్రోషితమానం కథయత్యున్మోచయంత్యేవ.)

## 12. పచ్చల సూదికి చెక్కిన ముత్యాలు :

వర్షాకాలం. పచ్చికపై వాన నీటి బిందువులు పడి పచ్చలసూదికి చెక్కిన ముత్యాల అందంతో మెరుస్తుంటాయి. ఆ ముత్యాల నీటి చుక్కలను నెమలి ఒయ్యారంగా తన నీలలోహిత గళాన్ని సాచి పరుగుని తాగుతున్నది. ఎంత అందం!

మరగఅ సూఈ విద్ధం వ మొత్తిఅం పిఅఇ ఆఅఅగ్గీఓ,
మోరో పాఉసఆలే తణగ్గ లగ్గం ఉఅఅ బిందుమ్. (పాలిత్తస్సః 4-84)
(మరకత సూచీ విద్ధ మివ మౌక్తికం పిబ త్యాయతగ్రీవః,
మయూరః ప్రావృట్ కాలే తృణాగ్రలగ్న ముదకబిందుమ్.)

## 13. గంటల పట్టెడ :

ఏమిటీ గణ గణలు! ఎద్దు తెంచుకొని పరుగెత్తి వస్తున్నదా ఏమిటి? మనిషి మాత్రమే కనిపిస్తున్నాడు. ఎందుకేమిటి? అమ్మకానికా గహపతి గారూ! కాదా! తనకున్న దున్నపోతు చచ్చిపోయిందట. దాని గంటల పట్టెడ ఇది. ఎన్నో దున్నపోతుల సంతలకు వెళ్లి చూచాడట పట్టెడకు తగిన దున్నపోతును కొందామని. కాని ఆ పట్టెడకు తగిన దున్నపోతు దొరకలేదుట. కనుక విసుగెత్తి గంటల పట్టెడను అమ్మవారి కాలకు అప్పగించడానికి వెళ్లుతున్నాడట. ఇంత విశాల ప్రపంచంలో మంచి దున్నపోతా దొరక్క పోయింది! ఏమో! ఎవరి పిచ్చివారి కానందం. పట్టెడ మాత్రం చాలా బాగుంది. గంటలనాదం............

గహవఇణా ము అప్పైరిహ ధుండు అదామం చిరంవహే ఊణ,
వగ్గస ఆఇం దేఉణ ణవరిఅ అజ్జాఘరే బిద్ధం.

(వచ్చుపామిణో. 2-72)

(గృహపతినా మృతస్పైరిభ బృహద్ఘంటాదామ చిరమూఢ్వా,
వర్గశతాని నీత్వా నంతర మాద్యా గృహేదత్త.)

"పాతకాలవు నగల సంగతి తెలుపమంటే ఇదేమిటండీ పట్టెడ పట్టెడ అవి వలవిస్తూ దిక్కులు చూస్తున్నారు వెర్రివారిలాగ?' అంది మాఆవిడ. ఒక్కసారిగా మాయమైపోయింది సాతవాహనులనాటి జీవన సౌందర్యం.

"ఏమీలేదు. రెండువేల యేండ్లనాటి నగలు తెలుపమన్నావుకదా అని గాథాసప్తశతి అనే రెండువేల యేళ్లనాటి గ్రంథంలోని గాథలను జ్ఞాపకం చేసుకుంటున్నాను." అన్నాను దొంగలాగ.

"మీ గాథాసప్తశతి, గోథాసుప్తగతి ఎవరికి కావాలండి? మననం, నిదిధ్యాసనం తర్వాత చేసుకోండి. ఇప్పటికి పావకు కంటెచాలు" అంది నాపై ఎంతో దయచూపుతూ మా ఆవిడ.

"కాంచనం కలుపాపహం అనుకుంటూ మిథ్యా జగత్తులో పడ్డాను.

# గాథా సప్తశతిలో నాట్య, నాటక రీతులు

ఇంగ్లాండులో పదిహేడో శతాబ్దిని ఒక వింత జరిగిందట. నాటకాలు చూచి ప్రజలు పతితులై పోతారనే భయంతో ప్యూరిటనులు నాటకాలపై కత్తికట్టారు. నాటక ప్రదర్శనాలకు అవకాశమిస్తే కదా ఈ చిక్కు ! అనే అభిప్రాయంతో దేశంలోవున్న రంగస్థలాలన్నింటినీ మూయించివేశారట !

మనుస్మృతికారులూ ఈ ప్యూరిటనులకన్నా రెండాకులెక్కువ చదివిన వారే. కావ్యాలాపాలు కూడదు; వాటిని మానివేయాలి — అని శాసించారు. నటులు అపాంక్తేయులని బహిష్కరించారు. అయినా, అభినవ గుప్తాచార్యుడు ప్రకరణాంతరంలో అన్నట్టు భరతముని కాలం నుంచి నేటివరకు మహానటులూ ఉన్నారు; నాటకకళా నశించలేదు. దీనికి కారణం నాటకకళ మానవుని జీవితంతో పెనవేసుకొని పోవడమే.

కళలన్నిటికీ అనుకరణ మూలమయినట్లే నాటకకళకు కూడ మూలం అనుకరణమే. చీమ చిటుక్కుమంటె బెదరుకన్నులతో చెదరిపోయే లేళ్ళూ, కలకలలాడే వసంతంలో కలగానంచేసే కోయిలలు, కారుమబ్బులు కమ్ముకొనగా మత్తిల్లి నర్తించే నెమళ్ళు అది మానవునికి భావరాగతాళాలు (భరతం) నేర్పి ఉంటాయి. అయినప్పుడు, మానవజాతి తొలి సాహిత్య భండారమైన వేదంలో రూపక బీజాలు కానరావడంలో వింతేముంది !

ఋగ్వేదంలోని సరమా పణి సంవాదం, యమ యమీ సంవాదం, ఊర్వశీ పురూరవ సంవాదం మన రూపకాలకు తొలి ఛాయలు—పిదప ఎన్నదగినది బృహదారణ్యకంలోని విదుషి, వాచక్నవి అయిన గార్గి యాజ్ఞవల్క్యునితోను, అతని పత్ని మైత్రేయునితోను జరిపిన బ్రహ్మ మీమాంస. ఇవన్నీ ఛాయా మాత్రం. కాని, పాణిని కాలానికి నాటకాలు ప్రచురంగా ఉండడమే గాక కృశాశ్వుడు, శిలాలి అనేవారు నాట్య సూత్రాలను రచించారనడానికి అష్టాధ్యాయే సాక్షి.

బౌద్ధ యుగంలో రకరకాల రూపకాలే వెలసినవి. బుద్ధుడు స్వయం నాట్యశాస్త్రవేత్త అని బుద్ధుని తొలి జీవిత చరిత్రమైన లలితవిస్తరంలో ఉదాహరింపబడింది. (వీణాయాం, వాద్యే, నృత్యే, గీతే, పఠితే, ఆఖ్యానే, హాస్యే, లాస్యే, నాట్యే, విడంబితే ... సర్వత్ర బోధిసత్త్వ ఏవ విశిష్యతేస్మ.) బుద్ధుడు రాజగృహంలో ఉన్నప్పుడు అతని శిష్యులు మౌద్గల్యాయనుడు, ఉపతిష్యుడు తమ నటన నైపుణిని చూపారట. బింబిసారుని ఆస్థానంలో నాగరాజుల గౌరవార్థం నాటకం ప్రదర్శింపబడిందట. బుద్ధుని ఎదుట రాజగృహంలో

కువలయ అనే దాక్షిణాత్యనటి ఆయన చరిత్రనే అభినయించిందట. కళజాతకం, ఉదయ జాతకం, కనవేర జాతకం మున్నగు జాతక కథలలో నట సమాజ నాటక ప్రసక్తి పెక్కుసార్లు వచ్చింది.

ఇక బృహద్రామాయణ రచనాకాలానికి శైలూషులు, సమాజాలు (నాటక మందిరాలు), నాటకాలు ప్రచురంగా ఉండేవనడానికి పెక్కు నిదర్శనాలున్నాయి.

"స్వయంతు భార్యాం కౌమారీం చిర మధ్యుషితాం సతీం,
శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి."
(అయోధ్యాకాండం)

"వాదయంతి తథా శాంతిం లాసయంత్యపి చాపరే,
నాటకాన్యపరే స్మాహుః హాస్యాని వివిధాని చ."
(అయోధ్యాకాండం)

అరాజకం ఉంటే ప్రహృష్టులైన నట నర్తకులు ఉండరు. దేశాన్ని అభివృద్ధికి తెచ్చే ఉత్సవాలు, సమాజాలు (నాటక మందిరాలు) పెంపొందవు—అని వాల్మీకి మరొకచోట అంటాడు.

అశోక చక్రవర్తికి నాటకాలంటే మహాప్రీతి అని గిర్‌నార్ శాసనంలో ఉల్లేఖించబడింది. ఉత్సవాల్లో నాటకాలు ఆడేవారని మహావంశం అంటున్నది. అశ్వఘోషుడు సారిపుత్రుని బౌద్ధమత దీక్షను ప్రకరణంగా రచించాడు.

ఇక నాటికీ నేటికీ అభ్యుదయ పథంలో అంగలు వేస్తున్న తెలుగుజాతి, భావుకత పొంగిపొర్లే తెలుగుజాతికి నాటకాలు లేవంటే నమ్మేదెలాగు! కనిపించిన దానినంతా కవితలోనే కమలవండువు చేసుకుంటూ కలలుగాంచే తెలుగువాడు దృశ్య కావ్యాన్ని భావించకపోయాడంటే ఒప్పుకోడమెలాగ! నేటివలె నాడు కూడ కొందరు పైవారి ఉపేక్ష మననాటకాలు నటమంత్రంలోనే బలమై పోవడానికి కారణమై వుంటుందా!

కాని, తెలుగుజాతి వాఙ్మయ కళాసక్తికి, తెలుగువాని నాటక ప్రసక్తికి రెండువేల ఏళ్లనాటి సాక్ష్యం మాత్రం మనకు మిగిలింది. అదే గాథా సప్తశతి. గాథా సప్తశతి కొంతకు కొంత తెలుగు గడ్డపై వెలసిన రచన. ప్రజాకవులు రచించిన ఈ అమరగాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు సంతరించినవాడు హాల సాతవాహనుడు. హాలునికాలం క్రీస్తు శకం ఒకటవ శతాబ్దమని పండితుల నిర్ణయం. దీనిలో మంగళవారం ప్రస్తావం ఉందిగనుక, ఈ తిథితో పాటు వారం పేర్కొనడం 8వ శతాబ్దినుంచే ప్రచారంలోకి వచ్చినందున ఈ గాథా సంపుటి అంత ప్రాచీనం కాదనేవారున్నారు. కాని, రుద్రదాముని శాసనంలో గురువారం పేర్కొనబడింది గనుక పై ఆక్షేపణ నిరాస్తమయింది. ఫాల్గుణ బహుల సద్విథీయా గురువాసరే సింహాల పుత్రస ఓవశతసహస్ర గోత్రదస.) రామకృష్ణ గోపాల భండార్కర్ వంటి పండితులు దీనిని క్రీస్తు శకం ప్రథమ

శతాబ్ది నాటిదిగానే నమ్ముతున్నారు. తెలుగువాడు శేన ఈ కవిరాజు గుప్తరించిన ఈ గాథలలో దేశిపదాలు ముఖ్యంగా తెలుగుపదాలు. తెలుగు సంప్రదాయమూ వెల్లి విరియక మానవుగదా ! ('భారతి' సర్వధారి చైత్ర సంచికలోని నా వ్యాసం "గాథాసప్తశతిలో తెలుగుపదాలు" అనేదానిని కూడగోరితాను. అది ఈ సంపుటిలో మొదటి వ్యాసం.)

హాలుని ఈ గాథా సప్తశతిలో అప్పటి జానపద జీవితం పరీవాహమై ప్రవహించింది. పుట్టుకలు, పెండిండ్లు, సముద్రలు, అల్లుళ్ల అలకలు, ముద్దరాళ్ల ముచ్చట్లు, ఉత్సవాలు ఊరేగింపులు, నాట్యాలు నాటకాలు, వినోదాలు విలాసాలు, అబ్బ ! గ్రామ జీవన సౌందర్య భండారం ఈ గాథా సప్తశతి. మనం వారి నాట్యం, నాటకం, సంగీతం ఎలా వున్నాయో చూచి ఆనందిద్దాం.

## గానం:

సంగీతమంటే ఆనందావిర్భావమన్నారు పెద్దలు. మనసులో మోదం ముప్పిరి గొన్నప్పుడు కూనిరాగాలు వాటంతటఅవే వస్తాయి. మరి పైరు కోర్కె దైవారగా పండింది. ఇక రైతు దంచిన కొత్త బియ్యంలా తెల్లగావున్న శరత్కాలపు వెన్నెలరాత్రులలో హాయిగా గొంతు విప్పి ఎందుకు పాడడు ?

> ణిప్పణ్ణ సస్సరిద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ,
> దలిఅణవసాలి తండుల ధవల మిఅంకాసు రాఈసు. (7-89)

> (నిష్పన్న సస్య ఋద్ధిః స్వచ్ఛందంగాయతి పామరః శరది,
> దలితనవశాలి తండుల ధవల మృగాంకాసు రాత్రిషు.)

కొందరు పాడుతూవుంటే ఏడిచినట్టు ఉంటుంది. కొందరు ఏడుస్తూ వున్నా కాకలీస్వరంలా వినిపిస్తుంది. పాపం! ఒక ఇల్లాలు పాటపాడుతూవుంది. కాని అది పాటగాలేదు. భరింపరాని ఆవేదన, ఉత్కంఠ. కోపంతో కంఠం గద్గదమై పోయి తడబడుతున్న మాటలు. ఇవన్నీ చూస్తే ఆమె ఎవరినో తలచుకొని గేయమనే నెపంతో ఏడుస్తున్నట్టు తోస్తుంది.

> గేయచ్ఛలేణ భరిఉం కస్స తుమం రుఅసి ణిబ్భరుక్కంఠమ్,
> మణ్ణు పడిరుద్ధ కంఠద్ధణింత ఖలిఅక్ఖరుల్లావమ్. (4-84)

> (గేయచ్ఛలేన స్మృత్వా కస్య త్వం రోదిషి నిర్భరోత్కంఠమ్,
> మన్యుప్రతిరుద్ధకంఠార్ధ నిర్యత్ స్ఖలితా క్షరోల్లాపమ్.)

## మంగళగీతం :

వివాహం మానవుని జీవితంలో మధురాతి మధుర ఘట్టం. పెండ్లికొడుకు మాట అలా ఉండగా, పెండ్లి కూతురు మనస్సును భావకలిత నునురుకుంటుంది. ఒకవైపు చెలుల సయ్యాటలు, మరొకవైపు ముత్తయిదువుల-మంగళగాయికల-

మంగళగీతాలాపాలు. ఆ గీతాలలోనే వధూవరుల పేర్లు కలిపి పాడటం చేయడం కూడ ఐదునాళ్ళ పెండ్లిండ్లలో ఆచారం. ఈ విధంగా మంగళగాయికలు మంగళ గీతాలు పాడుతూ వుంటే, చెవులు రిక్కించుకొని వింటున్న ఆ పెండ్లికూతురు ఒళ్ళు పులకరించి పోతున్నది చూచారా? వరుని పేరు విందామని పులకలుగా ఉబలాటపడుతున్నవిలా పైకి వచ్చాయి.

గిజ్జంతే మంగళగాయిఆహిం వరగోత్తదిణ్ణ అణ్ణాఏ,
సోఉం వ ణిగ్గఓ ఉఅహ హోంత వహుఆఇ రోమంచో. (7—12)

(గీయమానే మంగళగాయికాభి ర్వర గోత్రదత్తకర్ణయా,
శ్రోతుమివ నిర్గతః పశ్యత భవిష్యద్వధూకాయా రోమాంచః.)

వధువు ముగ్ధ అయితే, ఈ ఉత్కంఠా, ఉత్సాహమూనూ. మరి అదివరకే వదీ వరకా మంచి రసికులు చవిచూచివుంటే వివాహ మంగళోద్గీతం విని నివ్వెరపోదూ ఆ మిటారి? ఆ పాత చెలికాండ్లు, పాత సంకేత స్థలాలయిన ప్రబ్బలి పొదలూ నవ్వుతున్నట్టు, వెక్కిరిస్తున్నట్టు తోచదూ ఆమెకు?

మణ్ణే ఆఅణ్ణంతా ఆసణ్ణవిఆహమంగళుగ్గీఅమ్,
తేహిం జువాణేహిం సమం హసంతి మం వేఅసకుడంగా. (7—43)

(మన్యే ఆకర్ణయంత ఆసన్న వివాహ మంగలోద్గీతమ్,
తైర్యువభిస్సమం హసంతి మాం వేతస నికుంజాః.)

## తూర్యం :

పండుగలు వచ్చాయంటే పట్టణాలలో అంత సంరంభం కనిపించదు గాని, పల్లెపట్లలో హడావుడి ఎక్కువ. అడ్డా దిడ్డంగా పరుగెత్తే జనం, ఎక్కడ చూచినా ఆనంద కోలాహలం, తూర్యాల ఆరావాలు—మరి మహోత్సాహంగా వుండదూ! కాని, మనకు ఇష్టమైనవారు ఆ ఉత్సవానికి రాలేదనుకోండి. ఎందుకీ ప్రళయం! ఊరు కాలిపోతున్నట్టు ఎందుకీ పరుగులు? ఎందుకీ కేకలు? తూర్యాలు (నగరాలు) వాయించి అయినా జనాన్ని చేర్చడమెందుకు? — అనిపిస్తుంది. మనస్సే కారణం అన్నిటికీని. (ఉత్సవాల్లోను నగారాలు వాయిస్తారు. జనం సరంభం ఎక్కువగా ఉంటుంది. ఊరిలో అగ్ని ప్రమాదం జరిగినప్పుడు హెచ్చరిక కోసమూ, సహాయం కోసమూ నగారా వాయించి జనాన్ని చేర్చుతారు. అప్పుడూ కల్లోలం తప్పదు.)

ఉప్పహ హావిఅ జణో పవి జీమ్భిఅ కలఅలో పహఅతూరో,
అహో సోచ్చేఅ ఛణో తేణ విణా గామడాహోవ్వ. (6—35)

(ఉత్పథ ప్రధావిత జనః ప్రవిజృంభిత కలకలః ప్రహతతూర్యః,
దుఃఖం స ఏవ క్షణః తేన వినా గ్రామదాహ ఇవ.)

## పటహం :

ఇష్టులు దగ్గర ఉన్నప్పుడు ఇంపుగా ఉన్నవి, వారు దగ్గర లేనప్పుడు ఇంపుగా వుండవు. వానకారు ఎంత సొంపైనది! ప్రియునితో ఆ సుందరి ఎంత

ఇదిగో గడిపింది! ఆయన దూరమయ్యాడు. ఉరుములు విన్నది. అది తప్పు చాటుతూ నేరగాడిని వధ్యస్థానానికి తీసుకువెళ్ళేటప్పుడు వాయించే తప్పెట మోతలాగ-పటహ ధ్వనిలాగ వినబడింది, ఆకరి పడింది. అనవితో అనుభవించిన సుఖాలు జ్ఞాపకం వచ్చాయి. వెనుకటి మేఘాలధ్వనే ఇంగగొట్టింది ఆమెను. ఆ సుఖాలన్నీ తప్పులు మమా అన్నట్టుంది ఆమేఘరవం!

అజ్జ మప తేణ విణా అనుహూఅ సుహాఇం సంభరంతీప,
అహిణవ మేఘాణం రవో ణిసామిఒ వజ్ఝపడహోవ్వ. (1-29)

(అద్య మయా తేన వినా అనుభూత సుఖాని సంస్మరంత్యా,
అభినవ మేఘానాం రవో నిశామితో వధ్యపటహ ఇవ).

తడితే పాప నిద్రపోతుంది. తప్పెట కొడితే పసివాని కాళ్లు అప్రయత్నంగా చిందులు తొక్కడానికి పైకి లేస్తాయి. ఇక మంచి ఇల్లాలు మగడు కొట్టే తప్పెటకు చిందులు తొక్కడంలో వింతేముంది? తప్పెట తడాఖా అది! ఈ ఇల్లుని భార్య మరీ మేనకురాలు. భర్త ఎంత అవమానించినా భర్త తప్పెట కొట్టగానే ఆడడం ప్రారంభిస్తుంది. "మల్లీ! నీకు సిగ్గులేదూ! నీ దౌర్భాగ్యాన్ని చాటుతున్నదే ఆ పటహ శబ్దం! తప్పెట కొట్టి నీ మగడు ఆన తిచ్చాడో లేదో వెంటనే నృత్యం చేస్తావు? ఏం చేసినా పడివుంటావు!" అని చెలులు నిందించినా వినదు. మంచి ఇల్లాలు మరి!

అణత్తం తేణ తుమం పఇణా పహాపణ పడవాసద్దేణ,
మల్లి ణలజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జంతే. (7-85)

(ఆజ్ఞప్తం తేన త్వాం పత్యా ప్రవహతేవ పటహశబ్దేన,
మల్లి న లజ్జసే నృత్యసి దౌర్భాగ్యే ప్రకటీక్రియమాణే.)

ఢక్క :

తిమగును చూస్తే నవ్వూ వస్తుంది; దుఃఖమూ కలుగుతుంది. ఎంతటి మహాకాయం! మామూలు మనిషికి లోబడి, కుక్కలాగ మాటవిని పిల్లిలాగ అణగి వుంటుంది. పూర్వం రాజులు యుద్ధాలకు వెళ్తుతూంటే, ఢక్కలు, నగారాలు మోసుకొని వెళ్ళేది; కోట కవాటాలు బద్దలు కొట్టేది; అంత విజయమూ సాధించి తనది కాదన్నట్లు ఏ రాజునో అంబారీలో ఊరేగించేది. గౌరవమేది గొప్పది. దానికోసం ఎన్నికష్టాలైనా పడవలసివుంటుంది. ఈ గజేంద్రం కూడ గౌరవం కోసం-కీర్తి కోసం ఢక్కను మోస్తున్నది. ధూళినీ, బురదనూ లెక్కపెట్టడం లేదు. గడ్డిగాదం తిని పొట్టపోసుకుంటుంది. అయినా, ఢక్కాను మోయడం కీర్తికోసమే అంటాడు ఒక అజ్ఞాతకవి.

ధూలి మఇలో వి పంకంకిఓ వి తణరఇఅ దేహాభరణో వి,
తహ వి గఇందో గరుఅత్తణేణ ఢక్కం సముబ్వహఇ. (8-26)

(ధూలి మలినోపి పంకాంకితోపి తృణ రచిత దేహాభరణోపి,
తథాపి గజేంద్రః గురుకత్వేన ఢక్కాం సముద్వహతి.)

## మద్దెల :

దుర్మార్గులు మద్దెలవంటి వారు. అన్నం పెడుతున్నంతసేపూ చక్కగా పలుకుతారు. మానివేశామా, మూతి ముడుచుకుంటారు; విరసంగా పలకడమూ ప్రారంభిస్తారు. ఇలాటి రెండు ముఖాల వారికి దూరంగా ఉందామా అంటే కుదరదు. ప్రతివారి అవసరమూ ఈ మాయలోకంలో తప్పదు గదా! మద్దెల బాగా పలకడానికి ఉడికించిన పిండి మెత్తడం అవసరం.

అఉలీణో దోముహఓ తా ముహరో భోఅణం ముహే జావ,
మురఓ వ్వ ఖలో జిణ్ణమ్మి భోఅణే విరస మారసఇ. (3-53)

(అకులీనో ద్విముఖః తావన్ముఖరో భోజనం ముఖే యావత్,
మురజ ఇవ ఖలో జీర్ణే భోజనే విరసమారసతి.)

## నృత్యం :

నృత్యం జీవికి సహజమైన క్రియ. ప్రకృతిలో కలిగే సుందర పరిణామం జీవిని ఆనంద తన్మయుని చేస్తుంది. దానితో సంగీతం, నృత్యం బయలుదేరుతాయి. హృదయం కరిగిపోయే కారు మబ్బులు, ఉరుములు, మెరుపులు ఎచ్చట చూచినా సుందర శీతల ప్రకృతి. ఇక నెమళ్ళు నీలాల మెడ చాచుకొని గంతులువేయడంలో ఆశ్చర్యమేముంది? నెమలి నృత్యం చూచేవుంటారు మీరు; భరతంలో ఆరితేరిన వారివలె అడుగులు వేస్తుంది.

## పరవాద్య నర్తనం :

అహిణవ పాఉస రసిఏసు సోహఇ సామాఇఏసు దిఅహేసు,
రహసపసారిఅ గీవాణం ణచ్చిఅం మోర వుందాణమ్. (6-59)

(అభినవ ప్రావృడ్ రసితేషు శోభతే శ్యామాయితేషు దివసేషు,
రభసప్రసారిత గ్రీవాణాం నృత్యం మయూర బృందానామ్.)

కొందరు ఆడరు. వాద్యాలు వాయించి ఇతరులను ఆడిస్తారు. ప్రతి రంగంలోను ఇలాటివారుంటారు. పరవాద్య నర్తనశీలులు తర్వాత సిగ్గు, పశ్చాత్తాపం పడతారు. కాని ఆడించే వారికేం? ఇతరులు నష్టం, కష్టం పడుతుంటే ఆనందిస్తారు. పాపం ఒక ముద్దరాలు ప్రియునిపై అలిగింది, చెలికత్తెలు ఊరికే పోరుపెట్టగా. ప్రియుడు ఎంతగానో బ్రతిమాలినాడు. ఊహుఁ! ఆమె కనికరించలేదు. సఖీమణుల ఉపదేశం అంత గట్టిది గదా! అతడు సిగ్గుతో, కోపంతో వెళ్ళిపోయాడు. అప్పుడన్నా చెలికత్తెలు ఆమెకు మంచి హితవు చెప్పారా? అతడు వెళ్ళిపోతూంటే చూస్తూ ఉపేక్షించారు. ఆమె తను ఎంత నిర్భాగ్యురాలను అని పశ్చాత్తాప పడింది. చేతులు కాలాక ఆకులు పట్టుకొని ఏమి ప్రయోజనం!

అహ సో విలక్ఖ హిఅఓ మఏ అహవ్వాఏ అగహిఅణుణఓ,
పరవజ్జ ణచ్చిరీహిం తుమ్హాహిఁ ఉపేక్ఖిఓ ణేంతో, (5-20)
(అథ స విలక్షహృదయో మయా అభవ్యయా అగృహీతానునయః,
పరవాద్య నర్తన శీలాభిః యుష్మాభి రుపేక్షితో నిర్యన్.)

రాసలీల :

కొందరు ధైర్యంతో అన్ని పనులూ చేస్తారు. కొందరు చేయరు; ఏదో నెపంతో పని అయిందని అనిపించుకొంటారు. చూడండి, ఆ గోపికకు కృష్ణుణ్ణి ముద్దాడాలనే ఆశేమో వుంది. సాధ్యం కాలేదు. మరి ఏంచేసింది?! "భేష్! బాగుంది! బాగా నర్తనం చేశావు సుమా!" అంటూ పాటి గోపికలను అభినందించే సాకుతో వారి మెరుగు బుగ్గలపై ప్రతిబింబించిన కృష్ణుని రూపాన్ని ముద్దాడింది. ఇది మంచి ఎత్తే సుమా! ఒక దెబ్బకు రెండు పిట్టలు! ఎంత నిపుణురాలు! ఇది రాసలీల. నిపుణురాలయిన గోపిక రాసలీలలో పాల్గొన్న గోపికలందరి బుగ్గల మీద ప్రతిబింబించింది కృష్ణుని రూపం; అతడు మధ్యన ఉన్నాడు గనుక.

ణచ్చణ సలాహణ ణిహేణ పాసపరిసంఠి ఆ ణిఉణ గోవీ,
సరిసగోవిఆణం చుంబఇక వోలపడిమాగఅం కణ్హమ్. (2-14)

(నర్తన శ్లాఘన నిభేన పార్శ్వ పరిసంస్థితా నిపుణ గోపీ,
సదృశ గోపీనాం చుంబతి కపోల ప్రతిమాగతం కృష్ణమ్.)

రంగస్థలం :

కొందరు హితవు చెప్పినట్లే చెప్పి వినేవారిని పెడదారి పట్టిస్తారు. నెల తాలింతరాలిని, ఆరు నెలల చూలింతను, ఒక రోజు జ్వరంతో పడి లేచినదానిని, నాట్యం ముగించి అప్పుడే రంగస్థలంనుంచి దిగిన దానిని-రంగోత్తీర్ణమ-కామించు అని పలవా ఇస్తారనుకోండి. ఏం బాగుంటుంది ? కాని, ఉపదేశించేవారి దృష్టి కామశాస్త్రదృష్టి. అది ఎంతవరకు ఆచరణీయమో చూడవలసింది వినేవారు.

మాసపసూఅం ఛమ్మాస గబ్భిణిం ఎక్కదిఅహ జరిఅంచ,
రంగుత్తిణ్ణం చ పిఅం పుత్తఅ కామంతఓ హోవా. (3-59)

(మాసప్రసూతాం షణ్మాస గర్భిణీం ఏకదివసజ్వరితాం చ,
రంగోత్తీర్ణాం చ ప్రియాం పుత్రక కామయమానో భవ.)

పూర్వరంగం : నాటకం :

ఆత్మీయులు సన్నిహితులై వున్నప్పుడు వారివి తాకితేగాని సంతృప్తి కలుగదు. తల్లి తన బిడ్డలను తలమంచి కాళ్ళవరకు పవరి తబ్బుకుంటుంది. తండ్రి తన సాటికొడుకును కౌగిలించుకొని శిరము మూర్కొంటాడు. ఇక ప్రేయసీ ప్రియులు కలుసుకొన్నప్పుడు ఒక్కటైపోతారు. ఈ పరిష్వంగం, అవగూహనం కోపాలను, తాపాలను కరిగించి వేస్తుంది; ఒంటికంతా ఆప్యాయత కలిగిస్తుంది. పెనుగాలి చెట్టును కూలదోసినట్టు బింకాన్ని పటాపంచలు చేస్తుంది. ఇలాటి ఆలింగనాన్ని రతినాటకానికి పూర్వరంగంగా కవి ప్రశంసించాడు. ఆ అవగూహనానికి భద్రం కలుగనీ.

మాణ దుమ పరుస పవణస్స మామి సవ్వంగ ణివ్వుఇ అరస్స,
అవఊహణస్స భద్దం రఇణాడఅ పువ్వరంగస్స. (4-44)

(మానద్రుమ పరుష పవనస్య మాతులాని సర్వాంగ నిర్వృతికరస్య,
అవగూహనస్య భద్రం రతినాటక పూర్వ రంగస్య.)

ఈ వర్ణనలను బట్టి గాథాసప్తశతి నాటి తెలుగుదేశంలో చక్కని సంగీతం, పటహం, మురజం, ఢక్క, తూర్యం వంటి వాద్యాలు; నృత్యం, నర్తనం, నాట్యం వంటి నాట్యరీతులూ ప్రచారంలో వుండడం అలా ఉండగా నాట్యరంగం, సంపూర్ణ నాటకరంగస్థలం, నాటకం ఉన్నట్టు స్పష్టమౌతుంది.

తెలుగునాట సంగీత నాట్య నాటకాలు రెండువేలఏళ్లనాడే విరివిగా వున్న వనడానికి గాథాసప్తశతి మాత్రమేకాక అప్పటి వాస్తు శిల్పాలుకూడ సాక్ష్యమిస్తున్నాయి. అమరావతి, నాగార్జునకొండ మున్నగు బౌద్ధ స్తూపశిల్పాలలో వివిధ వాద్యాలు వాయిస్తున్న స్త్రీ పురుషులు, వివిధ నృత్య నాట్యాలు చేస్తున్న నర్తకీ నర్తకులు దర్శనమిస్తారు అప్పటి శిల్పులు గండరించిన బుద్ధ జాతక కధలలో బుద్ధుని జీవిత చరిత్రలో అడుగడుగునా నాట్య నాటక రీతులూ, సంగీత వాద్యాల వైవిధ్యమూ చూస్తే తెలుగువారి కళాభిరుచి ఎంత విస్తృతమో స్పష్టమవుతుంది.

ఇంతటి సాక్ష్యమున్నా, ఇంతటి జీవిత వైశద్యమున్నా ఒక్కపాత తెలుగు నాటకమన్నా ఎందుకు మిగలలేదో ఆశ్చర్యమే.

# గాథాసప్తశతిలో గ్రామీణ జీవన సౌందర్యం

రాజకీయ ప్రాబల్యం, సాహిత్య ప్రాచుర్యంగల భాషలు ఇతర భాషలను, జాతులను లోగొంటాయని ఇదివరకే చెప్పాను. పూర్వం మతానికీ, రాజకీయాలకూ అంతరం లేదు గనుక సంస్కృత భాష ఇతర భారతీయ భాషలను కొన్ని శతాబ్దాల వరకూ తలయెత్తనివ్వలేదు. మతంతోపాటు వ్యాపించిన సంస్కృతం విభిన్న జాతులతో, సంఘాలతో సంబంధం ఏర్పడిన కొద్దీ ఆయా భాషల పదాలను, ఆయా జాతుల భావాలు, సంప్రదాయాలనూ ఆకళించుకొంది. అన్య భాషా పదాలను, సంతరించుకొనకపోయివుంటే సంస్కృత సాహిత్యం ఇంత విస్తృతం, సమృద్ధం అయివుండేదే కాదు.

బుద్ధ భగవానుడు తన అభిప్రాయాలను ప్రకటించింది పాలీ భాషలో. బుద్ధుని సందేశాలు, మతం, పాలీభాష అశోకునికి ముందే దక్షిణా పథానికి, ముఖ్యంగా ఆంధ్ర మధ్య దేశాలకు వచ్చాయి. అశోకుడు వానిని వ్యాపింపచేశాడు. మత భాష అయిన పాలీ క్రమంగా రాజకీయ భాష అయింది. ఈ విధంగా బౌద్ధ, జైన మతాల ద్వారా దక్షిణాపథంలో పాకుతున్న పాలీ ప్రాకృతాలు సంస్కృతం వలెనే దేశ భాషల సంప్రదాయాలను, పదజాలాన్ని సొంతం చేసుకొన్నాయి. ప్రాకృతంలో మిళితమైపోయిన రోలంబ, ఘోరిణీ, తాలూరాది దేశీ శబ్దాలను సంస్కృత మహాకవులు కూడ గతానుగతికంగా ప్రయోగించగా, నిఘంటుకారులు కూడ వాటిని స్వీకరించి సంస్కృత ముద్ర వేశారు.

ప్రాకృతంలో తెలుగు సుబంతాల మాటలు చేరడం అలా వుండగా చెప్పు, చెక్కు, చూచు వంటి తిఙంతాలు చవఇ, చఅఇ, చచ్ఛఇ మున్నగు మార్పులతో గుర్తింపరానంతగా చేరిపోవడం వల్ల ఆచార్య హేమచంద్రుడు దేశీ శబ్దాలకు అన్వయమే కుదరదని, కుదిరినా అర్థం కావడం కష్టమని అన్నాడు[1]. దేశికి వ్యుత్పత్తి తెలియనందున ప్రాచీన సంప్రదాయ సిద్ధమైన అర్థాన్నే గ్రహించాలనీ హేమచంద్రుడు ఆదేశించాడు. దేశీ శబ్దాలు అర్థం కాక తప్పుడు వ్యాఖ్యలు చేసేవారిని "ఇప్పటి దేశీ కవులవి, వ్యాఖ్యాతలవి ఎన్ని తప్పులని పరను!" అని కష్టపడ్డాడు[2].

గాథా సప్తశతి తెలుగు గడ్డపై కొంతకు కొంతయినా వెలసిన రచన. ప్రజా కవులు పలికిన అమర గాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువును

1. దేశీ దుస్సందర్భా, ప్రాయస్సందర్భితాపి దుర్బోధా.
ఆచార్య హేమ చంద్రః తత్తాం సందృభతి, విభజతిచ. (దేశీనామ మాల)

2. అధునాతన దేశ్యకారాణాం, తద్వ్యాఖ్యాతృణాంచ కియంత స్సమ్మోహాః
పరిగణ్యంతే. (దేశ్యనామమాల, అష్టమసర్గ, 13వ ఆర్య).

కై చేసినవాడు హాల సాతవాహనుడు. తెలుగు గడ్డనేలిన హాలుడు సేకరించిన ఈ గాథలలో దేశీ పదాలు, ముఖ్యంగా తెలుగు పదాలు, సంప్రదాయమూ వెల్లివిరియక మానవని ఇదివరకే తెలిపాను. సాహిత్యం జాతి జీవన ప్రతిబింబమన్నారు. గనక తెలుగు జానపదలావణ్యం ఈ గాథలలో తొణికిసలాడుతున్నదన్నా ఆశ్చర్యం లేదు.

“ఊరిమీద నూరుపడినా కరణం మీద కాసు పడదు”- అన్నది పల్లెటూరి సామెత. ఒక జాతి నాగరికత మరొక జాతిని, దేశాన్ని ముంచెత్తినా, పల్లెపట్ల పసదనం మాత్రం చెక్కుచెదరదని చెప్పడానికి మనం ఈ సామెతను ఉపయోగించుకొందాము. ఏడు లక్షల పల్లెలకు పట్టుగొమ్మయిన భారతదేశంలో- ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఈనాడు పల్లెపట్లలో కనిపిస్తున్న నాగరికతకు గాథాసప్తశతినాటి గ్రామ నాగరికతకు ఎక్కువ అంతరం లేదంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

ఇప్పటి పల్లెల పరిస్థితి – గ్రామాధికారుల పెత్తనం, అధికారుల బంధువుల పెత్తనం, తంటాలు, పంటలు అందరికీ తెలిసినవే. జానపదుల వేష భాషలు, ఒయ్యారాలు, సరాగాలు, సాహసాలు, విలాపాలు, వినోదాలు అప్పటిలాగే ఇప్పుడూ సహజ సుందరమైనవే. ప్రొద్దుగ్రుంకగనే పల్లెపెద్దలు రచ్చచావడి మీదనో, గుడిముందరనో కొలువుతీర్చి రాచకార్యాలు చక్కబరచుకొంటున్న సంగతి మనకేమీ కొత్తదిగాదు. రెండువేల సంవత్సరాలనాడూ మన జనపదాల పరిస్థితి, పద్ధతి ఇదేనా !-:అని అబ్బురపడేవారు నాతో రండి, హాలుని కాలపు గ్రామాలు కొన్ని చూచివద్దాం!

రండి! రండి! ఏదో కోలాహలం వినిపిస్తున్నది. ఏమిటది ? ఏదో పండుగలాగ ఉందే! జాతర కాబోలు! ఆడ మగ అటుఇటు పరుగెత్తుతున్నారు తూర్యారావాలు వినిపిస్తున్నాయి. గోలలో ఏమీ వినబడడం లేదు.[3] ఏదో పొడి చల్లుకుంటున్నారు.[4] ఆడ మగ భేదం లేకుండా బురదకూడ ఒకరిమీద ఒకరు చల్లుకుంటున్నారు. తప్పులేదు కాబోలు![5] ఏమిటా తూలటం ? తాగారా ఏమిటి? ఆఁ! తాగారు. జంటలు జంటలుగా నాట్యాలు చేస్తున్నారు. జుట్టు ముళ్ళు జారిపోతున్నాయి[6] కుసుమరంగు చీరలవారు, చెంగావి చీరలవారు! పైటలు గాలికి ఎగిరి పోతున్నాయే; బోసిరొమ్ములు. అబ్బ! ఒకరిద్దరు కుసుమరంగు రైకలు తొడుక్కున్నవారూ వున్నారు. ఏం జాతర ఇది ?[7] మన హోలీ పండుగలాగుందే ! ఆఁ! ఆఁ! హోలియే లేకపోతే ఈ విచక్షణలేని పరవశ్యమిటి ?

---

3. ఉప్పహ పహావిహజణో పరిజిమ్మిఅ కలకలో పహాఅతూరో,
అహ్యో సొచ్చేఅ ఛణో తేణవిణా గామ డాహోవ్వ. (6-35)

4. ఘేత్తూణ చుణ్ణముట్ఠిం హరిసూససిఆఏ వేవమాణాఏ,
భిసిణేమి త్తి పిఅఅమం హత్థే గంధోదఅం జాఅమ్. (4-12)

5. ఫగ్గుచ్ఛణ ణిద్దోసం కేణవి కద్దమ పసాహణం దిణ్ణమ్.
థణ అలస ముహపలోట్టంత సేఅధోఅం కిణో ధుఆసి. (4-69)

6. దఇఅ కరగ్గహ లులిఅ ధమ్మిల్లో సీథుగంధిఅం వఅణమ్.
మఅణంమ్మి ఏత్తిఅంచిఅ పసాహణం హరఇ తరుణీణం. (6-44)

7. గామ తరుణీఓ హిఅఅం హరంతి ఛేఆణ, థణహరిల్లీఓ.
మఅణే కుసుంభరంజిఅ కంచుఅఆహరణ మేత్తాఓ. (6-45)

పూర్వాంధ్ర ప్రాంతంలో ఇది లేదుగాని, పశ్చిమాంధ్రంలో బాగా అలవాటే. ఇంతకూ నేడు ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ కాదూ!

దగ్గరకు వెళ్ళి చూద్దాం రండి. వారంతగా సంబరపడుతుంటే మనం మాత్రం ఆనందించకూడదూ మరి? ప్రకృతిదేవి వీరికి కింకరి అయిందా ఏమిటి! పూవులు, మొగ్గలు చివుళ్ళు కనిపిస్తున్నాయే! కొప్పునిండా పూలు, కొప్పులు పూలను ఉమ్మివేస్తున్నట్లు లేవూ? ఉత్సవానికి అనుగుణమైన వేషాలు[8]. చెవుల మీదినుంచి ఏమిటా వేలాడే నగలు? చెంపసరాలా? జుమికీలా? అబ్బే! పూవులు చిగుళ్ళూను, నల్ల కలువలు, నేరేడు చివుళ్ళు[9], పాటలి పూగుత్తులు, ఇప్ప పూగుత్తులు, విరజాజులు, మరువం, ఊడుగు చివుళ్ళు, రెల్లు పూలు, కొసకి వెదురాకులు కూడ చెవిసందున ఇరికించుకున్నారే. ఆ చక్కని చుక్క చెవిలోని పూలు ఆమె చెక్కిలి చక్కదనాన్ని ఎంచి తాగుతున్నట్లు లేదూ[10] మగవారు కూడ ఈ కర్ణావతంసాలు ధరించారు. తలలో పూలు కూడ తురుముకొన్నారు. ఆ రైతుబిడ్డ తలలో చూడండి మామిడి పూగుత్తి! దానిచుట్టు తుమ్మెదలు ఎలా వెంటబడి తిరుగుతున్నాయో![11] ఆ పెద్దమనిషి తలలోని పాటలిపూలు గుప్పుమంటున్నవి.[12] ఎవరండీ ఆయన? గ్రామాధికారో, ఆయన కుమారుడో అయివుంటారు. లేకపోతే అంత ఠీవి, అంత హంగు ఎందుకు? అవును గ్రామాధికారే - గ్రామణియే.

అందరూ ఎంత ఆనందంగా మైమరచి తిరుగుతున్నారో మైకంతో! ఉండనివ్వండి. మనం గ్రామానికి వెళ్ళి విశ్రాంతి తీసుకొందాం.

పొలిమేరలోనే ఏమిటి గుడిలాగ వుందే? గ్రామదేవతదా? ఆఁ! గ్రామదేవతదే. ఉద్వాసన చేసినప్పుడు వేసిన పూలమాల - అవమాలిక ఎండిపోయి అలాగే గాలికి ఎగురుతున్నది.[13] ఇటువైపు కొలను. కొలనిలో తామరపూవులు. పచ్చల పళ్ళెంమీద పెట్టిన శంఖం లాగ ఆ తామరపాకుమీద కదలక మెదలక ఉన్న ఆ కొంగను చూడండి.[14] ఇదేమిటి? పీతలాగ వుందే! కాదు. వాలుంకిట అంటే బల్లెంక, కాలివేళ్ళకు చుట్టుకుంటుంది. పాపం! పుటుపుటుమని వ్రేళ్ళు కాస్త విరిగిపోతాయి.[15] ప్రేమలేని బాలవాలుంకి తంతువులాంటిది, పట్టి లాగితే

8. పిఅదంసణ సుహరస మఉలిఆఇ జఇసే ణ హోంతి ణయణాఇం,
తా కేణ కణ్ణరఇఅం లక్ఖిజ్జఇ కువలఅం తిస్సా. (4-28)

9. సాహీఇ సామలిజ్జఇ అద్ధచ్ఛి పలోఇరీఅ ముహసోహా,
జంబూదల కఅ కణ్ణావఅంస భరిఏ హాలిఅ ఉత్తే. (2-80)

10. సామాఇ గరుఅజోవ్వణ విసేస భరిఏ కవోలమూలమ్మి,
పిజ్జఇ అహోముహేణ వ కణ్ణావఅంసేణ లావణ్ణం. (5-95)

11. ణిక్కక్కుడిఅం సహఆరమంజరిం పామరస్స సీసమ్మి,
బందిమ్మివ హీరంతిం భమర జువాణా అణుసరంతి. (4-81)

12. గామణి ఘరమ్మి అత్తా ఏక్కచ్చిఅ పాడలా ఇహగ్గామే,
బహుపాడలం చ సీసం దిఅరస్స ణ సుందరం ఏఅం. (5-69)

13. సా తుహ సహత్థ దిణ్ణం అజ్జవి రే సుహఅ గంధరహిఅం పి,
ఉవ్వసిఅ ణఅర ఘరదేవదే వ్వ ఓమాలిఅం వహఇ (2-94)

14. ఉఅ ణిచ్చల ణిప్పందా భిసిణీ పత్తమ్మి రేహఇ బలాఆ,
ణిమ్మల మరగఅ భాఅణ పరిట్ఠిఆ సంఖసుత్తివ్వ. (1-4)

15. వహి ఊరిసివ్వాఇ గఈ మా రువ్వసు తిరిఅ వలిఅ ముహ అందం,
ఏఅణ బాలవాలుంకి తంతు కుడిలాణ పేమ్మాణం. (1-10)

పుటపుట తెగిపోతాయి–అని వెనకటికి ఒకతె తన సఖికి ప్రేమోపదేశం చేసిందట. చూచి అడుగువేయండి. నలికిరి తోకలాగ వుంది ఎర్రగా. అబ్బే! ఎంత మోస పోయాను. మామిడి మోస, నలికిరి కాదు.[16]

అబ్బ! ఎంత హాయిగా వుందండీ! ఊరి పొలిమేరకొక మఱ్ఱిచెట్టుంటే చాలు, ఊళ్ళో సత్పురుషుడున్నంత సంతోషంగా, శ్రీరామరక్షగా వుంటుంది. సత్పురుషుడు పోతె వూరంతా పాడయిపోయినట్టు వుంటుంది. మఱ్ఱిచెట్టు కూలిపోయినా ఊరి పొలిమేరంతా బిక్కుబిక్కు మన్నట్టు వుంటుంది.[17] మఱ్ఱాకులమీద ఆ తెల్లటి మరకలేమిటి అసహ్యంగా కాకి రెట్టలా? చెట్టంతా రెట్టలు వేసివుంటాయా? కాదండీ, ఎవరో సున్నమో, పిండో కలిపి చిలకరించినట్లున్నారు; జనం ఆకులు కోసుకుపోరాదనో, ఇక్కడికి రాకూడదనో![18] మఱ్ఱి విత్తనం మహాత్తు ఏముందోగాని నలుసంత వుంటుందిగదా! ఎక్కడ బడితేనూ సరే. తక్కిన చెట్టే దయినా దానికి మించిపోయిందా, పోతుందా? అన్నీ దానికిందే గదా![19]

మఱ్ఱి వృక్షం ఎంత బాగుంటే ఏమి? రాత్రి ఎలా గడుపుతాం? ఇక్కడ ఏదో దేవాలయంలా వుందే. అక్కడికో మరెక్కడికో వెళ్ళి రాత్రి కా విశ్రమించామా రేపటిసంగతి చూచుకుందాము. ఏమిటి ఈ రొద గోపురంలోని పావురాలరొద. దేవాలయ గోపుర శిఖరం పడిపోయింది, దాని మేకు మాత్రం మిగిలింది; దూసుకు వచ్చినట్టు. మేకు దూసుకురావడం, రొదా చూస్తే గోపురాన్ని కొరత వేస్తున్నట్టు లేదూ?[20] ఇక్కడ ఈ రొదలో ఉండలేమండి. ఏ ఇంటి అరుగుమీదనన్నా పడుకొందాం. మన పల్లెవారు అతిథి సత్కార నిరతులు కదా! అంతమాత్రం ఆదరించరూ!

ఇంచుమించు అన్ని ఇళ్ళ చుట్టూ కంచె లున్నాయి. కంచెసందునుంచి వెలుపలికి వచ్చి మనలను పిలుస్తున్నట్టు లేమూ ఆ ఆముదపాకు! పద్దెడేసి రొమ్ములు గలవారు ఇంట్లో వున్నారు సుమా అని సూచిస్తుంది ఆ ఆముదపాకు–అంటారేమో! తప్పు కాదూ! అలా భావించడం![21] కంచెల సందులోనుంచి చూడండి ఎవరైనా కనిపిస్తారేమో! అక్కడ కంచె అంత ఎత్తుగా లేదు. మీగాళ్ళెత్తి చూడండి; ఎవరైనా కనిపిస్తే పిలుద్దాం.[22] ఇంటి అరుగుమీద పడుకొని తొలికోడి

---

16. దరపుడిఅ సిప్పిసంపుడ ణిలుక్కహాలాహలగ్గ ఛేప్ప ణిహం,
పక్కంబట్టి విణిగ్గఅ కోమల మంబంకురం ఉఅహ. (1-62)
17. సుఅణో జం దేశ మలంక రేఇ తం విఅ కరేఇ పవసంతో,
గామాస ణ్ణుగ్గాఅ మహావడ ట్ఠాణ సారిచ్ఛం. (1-94)
18. పహిఉల్లూరణ సంకాఉలాహిం అసఈఇం బహల తిమిరస్స,
ఆఇప్పణేణ ణిహులం వడస్స సిత్తాఇం పత్తాఇం. (2-66)
19. ఎక్కేక్కమవి వడవీఅంకురేణ సఅల వణరాఇ మజ్ఝమ్మి,
తహ తేణ కఓ అప్పా అహ సేదుమా తలే తస్స. (7-70)
20. ఉవరి దర దిట్ఠ థణ్ణుఅ ణిలుక్క పారావఆణ, విరుఏహిం,
ణిత్థణఇ జాఅవేఅణ, సూలాహిణ్ణం వ దేఅఉలం. (1-64)
21. వఇ వివర ణిగ్గఅదలో ఏరండో సాహఇవ్వ తరుణాణం,
ఎత్థ ఘరే హాలిఅవహూ ఏద్దహ మేత్తత్థణీ వసఇ. (3-57)
22. ఏక్కేక్కమ వఇవేఢణ వివరంతర దిణ్ణ తరల ణఅణాఏ,
తఇ వోలంతే బాలఅ పంజరసఉణాఇఅం తీఏ. (3-20)
23. తాంతరోకి జ్ఞఇఉం సి త తీఅ వఇవేట్ట పేల్లిఅ థణీఏ.
పాఅంగుట్ఠద్ధక్కిత్త ణిసహంగీఅవి ణ దిట్ఠో. (3-21)

కూయగానే లేచిపోదాం. పరచుకునేందుకు పక్కలు కూడానా? బాగుంది వరస ఇక్కడి ఆచారం ప్రకారం గడ్డి మోపు ఇస్తారట పక్క కుమారు. పరదేశం. ఎలాగో సర్దుకుందాం. గడ్డి పరచుకొని పైన అంగవస్త్రం వేసుకొని పడుకుంటే వెచ్చగానే వుంటుంది. ఎందుకు ఈ ఇంటి ఇల్లాలు గడ్డి వెంటి ఇవ్వడానికి కూడ సంకోచిస్తుంటూంది? దినమూ వచ్చిపోయేవారు మనలాంటి వారెందరో మరి! విసుగుపడితే తప్పా పాపం![24] అబ్బ! భరించలేమండీ పల్లెటూళ్లలో కుక్కలగోలను! కొత్తవారు కనిపించారా, ఒకే మొరుగుడు.[25]

లేవండయ్యా లేవండి, కోడి కూస్తున్నది; ప్రయాణానికి తయారుకండి. అని మనకు, మీ మీ పని చేసుకోండని ఇతరులకు చెబుతున్నట్టుంది.[26] ఏమిటి మిత్రమా! ఆ కోడికూతకు అంత అదిరి పడతావు? వెనకటికి మా మిత్రుడొకడు, పరగృహాలకు మరిగిన వాడు, కోడి కూతతో చల్లగా ఇల్లు చేరుకొనేవాడు. ఒకప్పుడు తన ఇంట్లో పడుకున్నప్పుడు కోడికూత విన్నా పరగృహం అనుకొని పయనం అయ్యేవాడట.[27] పదండి బయలుదేరుదాం. ఊరిబయటి కొలనిలో స్నానం చేసివద్దామా? ఓహో! నిశ్చలంగా చెరువు ఎంత అందంగా ఉందండీ. లోపల నీలాకాశం ప్రతిబింబిస్తూ వుంటే ఆకాశాన్ని ఎవరో విసిరి కొలనిలో పడేశారా—అన్నట్టుగా వుంది. అంత పెద్ద ఆకాశం పడినా ఒక్క కమలం నలగలేదు. ఒక్క హంసా ఎగిరిపోలేదు.[28] నీరు ఎంత హాయిగా వుందండీ! ఈదుదాం రండి. మహిళలు కూడ మజ్జనం చేస్తున్నారన్నమాట. కొంచెం తప్పుకొని స్నానం చేద్దాం. పల్లె పడుచులు బాగా ఈదుతున్నారు సుమా. అరె! అరె! మొసలా ఏమిటి? కాళ్లు లాగుతున్నది? అయ్యో! అయ్యో! ఆరి పిడుగా! మనిషివా? మొసలనుకున్నాను. ఎవరినో లాగబోయి పొరపాటు చేశావంటావా? ఓహో! ప్రియురాలినా ఏమిటి?[29] ఆవిడను చూచారూ? స్నానం చేసి నిలుచుంది. కురుల నుంచి నీరు జారుతున్నది. ఇక తన్ను కట్టి ముడి వేస్తారే అని తలకట్టు కన్నీరు జాలువారుస్తున్నట్టు లేదూ![30]

కొలని నుంచి తిరిగి వచ్చేలోపుగానే ఏమిటీ కోలాహలం? నిన్నటిలాగా మరేదైనా ఉత్సవమా? ఓహో! అదా సంగతి! గ్రామణిగారి (గ్రామాధికారి) కుమార్తె

---

23. తహ దో ణ్హాఇ పులఇఓ దరవలిఅంతద్ధతారఅం పహిఓ,
జహ వారిఓవి ఘరసామిఏణ ఓలిందఏ వసిఓ. (3-54)

24. భండంతీఅ తణాఇం సోత్తుం దిణ్ణాఇం జాఇం పహిఅస్స,
తాఇం చేఅ పహాఏ అజ్జా అఅట్టఇ రుఅంతీ. (4-79)

25. సుణఅ పఉరమ్మి గామే హిండంతీ తుహ కఏణ సా బాలా,
పాసఅ సారివ్వ ఘరం ఘరేణ కఇఆ వి ఖజ్జిహిఇ. (2-88)

26. చోరాణం కాముఅణం అ పామరపహిఅణ, కుక్కుడో వఅఇ,
రే రమహ వహహ వాహయహ ఏత్థ తణుఅఅఏ రఅణీ. (7-98)

27. ణిఅ ఘరిఅం ఉవగూహఉ కుక్కుడ సద్దేన ఝత్తి పడిబుద్ధ,
పరవసఇవాసనంకిర ణిఅఏ వి ఘరమ్మి మా భాసు. (6-82)

28. కమలాఅరా ణ మలిఆ హంసా ఉడ్డావిఆ ణ అ పిఉచ్ఛా,
కేణవి గామ తడాఏ అబ్భం ఉత్తాణఅం వ్యూఢమ్. (2-10)

29. పితుణేంతి కామిణీణం జలలుక్క పిఅవఊహణ సుహేల్లిం,
కండఇఅ కఓలువ్పుల్ల ణిచ్చలచ్ఛీఇం వఅణాఇం. (6-58)

30. పత్తణి అఅవ్వంసా ణ్హాణుత్తిణ్ణాఏ సామలంగీఏ,
జలబిందుఏహిం చిహురా రుఅంతి బంధస్స వ భఏణ. [illegible]

పెండ్లట. సకుటుంబ సపరివార సమేతంగా రావాలని ఊళ్లో అందరికీ ఆహ్వానాలు వచ్చాయి. మనం కూడా నిన్న విశ్రమించిన ఇంటివారి పరివారంలోని వారం అయాముగా మరి! వెళ్లుదాం పెండ్లి చూడడానికి.

ఈ గ్రామణిగారు మంచి పరాక్రమవంతుడు. ఈయనేకాదు, తాత ముత్తాతలు అటు, ఇటు కుమారుడూ మొనగాళ్ళేనట. అంతకు ముందు ఊళ్ళో దొంగలు పడడం, గ్రామవాసులు భయంతో చెట్టుకొకరు పుట్టకొకరుగా పారిపోవడం, కొండల్లో గుహల్లో తలదాచుకోడం మామూలట. ఈయన పాలనలో అలాంటి భయమేమీ లేదు. ఎవరూ అలా పరుగెత్తే ఊహే చేయలేదు.[31] ఈయన తండ్రి మరణ సమయంలో ఈయన్ను పిలిచి "నా పేరుతో నీవు సిగ్గు పడకుండా వుండేట్టు నడచుకో." అని ఉపదేశించి మరణించాడట. ఇక ఈయన కుమారుని సంగతి మరీ ముచ్చటైనదట. కుర్రవాడైనా తండ్రికి చేదోడు వాదోడుగ వుంటాడట. పరిజనులు, ప్రతిపక్షులూ విస్తుపోయేట్టు గ్రామరక్షణ చేస్తున్నాడట.[33] గ్రామణిపుత్రుడు మేటి విలుకాడు. పోరాటాలలో ప్రహారాలకు గాయాలు ంట్లూ పడ్డ ఆయన రొమ్ముపైన ఆయన భార్య సుఖంగా నిద్రించలేకపోయినా, పల్లెంతా హాయిగా గుండె మీద చేయి వేసుకొని నిద్రపోతుందట.[34] ఇక నిష్ఠ అందామా? పరస్త్రీ పరాఙ్ముఖుడు గనుక కులట లందరూ ఆయనను పరమ దుర్దర్శనుడని, నింబకీటం (చేదంటేనే తినే వేప పురుగు) వంటి వాడని, కెండ్లానికి భయపడతాడని, నిర్దయుడని నిందిస్తుంటారట.[35]

గ్రామణిగారి ఇల్లు అందంగానే ఉంది. ఇంటి ముందు గున్నమామిడి; పూచిందికూడ. మామిడి పూస్తే ఇకనేముంది? ఒంటరి గాళ్లకు అనర్థమే.[36] దొడ్లో పాదిరిచెట్టున్నట్టుందే; గుప్పుమంటున్నది వాసన. ఊడుగుమానుంటే దయ్యాలు రావని నమ్మకం వీళ్ళందరికీని. ప్రతి ఇంట్లోను ఊడుగమాను ఉండవలసిందే. అంకోటం (ఊడుగు) వాసన తెలివి తప్పిన వారిని కూడ బ్రతికిస్తుంది.[37] పాదిరిపూల పసదనమే పసదనం. తలదిమ్మెక్కిపోతుంది.[38] అరె, అరె ఎవరో

---

31. విఞ్ఝారుహాణాలావం పల్లీ మాఉణఉ గ్రామణీ సవహ.
వచ్ఛిట్టిఏ ఐహాఅహా విసుణఇ తా జీవిఅం ముఅఇ. (7-81)

32. అప్పాహేఇ మరంతో పుత్తం పల్లీపఈ పయత్తేణ,
మహ ణామేణ జహా తుమం ణ లజ్జసే తహా కరేజ్జాసు. (7-82)

33. జహ చింతేఇ పరిఅణో ఆసంకఇ జహా అ తస్స పడివక్ఖో,
బాలేణ వి గామణిణందణేణ తహా రక్ఖిఅ పల్లీ. (7–28)

34. పహరవణ మగ్గ విసమే జాఅ కిచ్ఛేణ లహఇ సే ణిద్దమ్,
గామణి ఉత్తస్స ఉరే పల్లీ ఉణ సా సుఖం సుఅఈ. (1-8)

35. ణిక్కిఅ జాఅభీరుఅ దుద్దంసణ ణింబకీటసారిచ్ఛ,
గామో గామణిణందణ తుజ్ఝకఏ తహవి తణుఅఇ. (1-80)

36. ఖేమం కంతో ఖేమం జో సో ఖుజ్జంబఏ ఘరద్దారే,
తస్స కిల మత్థఆఏ కోవి అణత్థో సముప్పణ్ణో. (6-99)

37. సుట్టిం పుసను కిసోఅరి పడోహరంకోల్ల పత్తచిత్తలిఅమ్,
ఛేఆహిం దిఅరజాఆహిం ఉజ్జుఏ మా కలిజ్జిహిసి. (4-18)
మహమహఇ మఇఅవాఏ అత్తా వారేఇ మం ఘరాణేంతిమ్,
అంకోల్ల పరిమలేణ వి జోక్ఖు మఏ సో మఏ వ్వేఅ. (5-97)

38. గామణి ఘరమ్మి అత్తా ఏక్కవ్విఅ పాడలా ఇహగామే
బహుపాడలంచ సీసం దిఅరస్స ణసుందరం ఏఅం,?

రంగుచీరెల వారు, రక్తదుకూలాలవారు-48 భేష్! ఎవరావిడ? వనలక్ష్మిలా నెమలిపింఛం కొప్పులో తురుముకొన్న నెరజాణ. ఎంత ఠీవిగ అడుగులు వేస్తూ నడుస్తున్నది, ప్రపంచసుందరులను ఇప్పుడే గెలుచుకొని వచ్చినట్టు. భిల్ల పసితలా వుందే! మెడలో పద్మరాగాల మాలికలాగ గురువింద దండ. ఈమె ముందు ముత్యాల దండల పేర్లు వేసుకున్న వారంతా దిగదుడుపుసుమా!49 ఎవరండీ ఈ రైతు పడుచు! కుసుమ పూవు రంగు చీరచుట్టుకొని మురిసిపోతూ, వీథంతా తనే అయినట్టు నడిచివస్తున్నది? లేకలేక తెచ్చి ఇచ్చాడు కాబోలు భర్త ఈ చీరను.50

ఏమిటండీ పెళ్ళికూతురుని అలా బోసమెడతో కూచోబెట్టారు? సంబరంలో ఏమీ తోచలేదు కాబోలు! ఆ పచ్చల కంటె వేయించండి.51 పాపట దిద్ది రేగిన జుట్టును దువ్వెనతో అలా అనండి. ఏమి దువ్వెనండీ! మురికి పేరుకొని పోయింది. పుల్లతో మురికి తీసివేయండి త్వరగా.52 ముఖంలో తిలకం చెదరి పోతే ఏమి బాగుంటుంది? తిలకం బాగా దిద్దించండి.53 పసపాడించారు. కాళ్ళకు పారాణి పూశారు.54 కాటుక పెట్టారు. బాగుంది. కొప్పులో పూవులు తురిమారు. స్నానసుగంధిలమైన చికుర భారం పూలను ఉమ్మి వేస్తున్నట్టుంది. మరీ బాగుంది.55 కాని కంచుకం లేక పోవడం ఏమీ బాగా లేదు. ఈ శుభదినాననైనా కంచుకం తొడిగించండి, ఎర్రిదో, నల్లదో, కుసుమ పూవు రంగుదో! నల్లరైకే తొడిగించండి. మేఘాలలోని చంద్రుని

---

48. ణీలపడ పాఉఅంగీ త్తి మా హ ణం పరిహరిజ్జాసు,
పట్టంసుఅం పి ణద్ధం రఅమ్మి అవణిజ్జఇ చ్చేఅ. (6-20)

పంఝూరాటత్థఇఅ దీసఇ గఅణమ్మి పడిపఅ చందో,
రత్తదుఊలంతరిఅ థణ ణహలేహో వ్వ ణవవహుఏ. (6-69)

ఉఅ సంభమ విక్ఖిత్తం రమిఅవ్వ అలేహఅఏ అసఈఏ,
ణవరంగఅం కుడంగే ధఅం వ దిణ్ణం అవిణఅస్స. (5-61)

49. పిహిపేహుణావఅంసా వహుఅ వాహస్స గవ్విరీ భమఇ,
గఅమోత్తిఅ రఇఅ పసాహణాణం మజ్ఝే సవత్తీణమ్. (2-73)

ణ గుణేణ హీరఇ ఉణో హీరఇ జో జేణ భావిఓ తేణ,
మోత్తూణ పులిందా మోత్తిఆఇ గుంజాఓ గేణ్హంతి. (4-10)

50. అప్పత్తపత్తఅం పావిఊణ ణవరంగఅం హాలిఅసోణ్హా,
ఉఅహ తణుఈ ణ మాఅఇ రుందాసు వి గామరచ్ఛాసు. (8-41)

51. ఉఅ పోమ్మరాఅ మరగఅ సంవలిఆ ణహఅలాఓ ఓఅరఇ,
ణహసిరి కంఠబ్భట్ఠవ్వ కంఠిఆ కీరరింఛోలీ. (1-75)

52. మజ్ఝే పఅణుఅ పంకం అవహో వాసేసు పాణచిక్ఖిల్లమ్,
గామస్స సీస సీమంతఅం వ రచ్ఛాముహం జాఅమ్. (7-82)

ణ్హాణ హలిద్దా భరిఅంతరాఇ, జాలాఇ, జాలవలఅస్స,
సోహంతి కిలించిఅ కంటఅణ కం కాహిసి కఅత్థం? (1-78)

53. తిఅ ముహాహిం తుహ ముహం తు జ్ఝ ముహాఓ అ మజ్ఝ చలణమ్మి
హత్థాహత్థీఅ గఓ అఇదుక్కరకారఓ తిలఓ. (2-79)

54. అహఅం లజ్జాలుఇణీ తస్స అ ఉమ్మచ్ఛరాఇ పేమ్మాఇం,
సహిఆ ఉణో వి ణిఉణో అలాహి కిం పాఅ రాఏణ? (2-27)

55. థణఅస్స ఉరే పఇణో ఠవేఇ గిమ్హావరణ్హ రమిఅస్స,
ఓలం గతంతకుసుమం ణ్హాణ సుఅంధం చిఉరభారం. (8-99)

అందంవస్తుంది మిట్టలకు.56 చందనం చెక్క చెడదు లెండి. ముత్యాల హారాలు యమునా తరంగాలపై దొరే నురుగులాగ అందమిస్తాయి.58 కట్టిన పట్టుచీర జారిపోకుండా పోకముడి గట్టిగా బిగించండి.59 బంగారు మొలనూలు మాత్రం మార్చి అకృష్టం చేసుకుంది లెండి. మరి మొదట ఆ నిప్పులో పడి ఆ తర్వాత నీటిలో మునకవేసి శ్యామశబల వ్రతం చేసింది కదా! అంత మాత్రం సుందర స్థానం పొందవద్దూ!60 మరిచాను. పెళ్ళికూతురు నగల వర్ణికలు-నమూనాలు బాగున్నాయి.61 ఏ బతునితో చేయించారో! బంగారులో కల్తీ లేదు గదా! పరపెట్టి చూపించారా?62 రత్నాలన్నీ పరీక్ష చేయించుకున్నారా?63

ఏమండీ, పూలమాలలేవీ? మొదలే జాగ్రత్తపడవద్దూ? ఏమిటి గోల వెలుపల? ఓ! మాలాకారి! మంచి సమయానికే వచ్చింది. వెళ్ళి పూలనూలలు తెండి. మాలాకారి మంచి జాణ. పూవులిచ్చే సాకుతో భుజాలు ఎత్తుతూ తమాషాలు చేస్తూ కోడెగాళ్లను కవ్విస్తున్నది.64 ఏమిటి తమ్ముడుగా పూలబేరం సాకుతో ఎక్కడ చూస్తున్నావు? మాలాకారి బాహుమూలాలనా?65 ఛా! గృహద్వార తోరణంపై వున్న ఆ ఎండిపోయిన వందనమాలను తీసివేసి కొత్తది వేయిద్దురూ.66 ద్వారంలో మంగళ కలశాలు కూడ పెట్టండి బాబూ! పెండ్లి సంబరంలో సర్వసాధారణమైన ఆచారాలు మరిస్తే ఎట్లా?67

---

56. అజ్జాఇ నీలకంచుఅ భరి ఉవ్వరిఅం విహాఇ థణవట్టం,
అల భరిఅ జల హారంతర దరుగ్గఅం చందబింబవ్వ. (4-96)
57. తావ మవణేఇ ణ తహా చందణ పంకోవి కామి మిహుణాణమ్,
జహ దూసహేవి గిమ్హే, అణ్ణోణాలింగన సుహేల్లీ. (8 88)
58. మగ్గంచ్చిఅ అలహంతో హారో పీణుణ్ణఆణ థణఆణమ్,
ఉవ్విగ్గో భమఇ ఉరే జముణాణఇ ఫేణ పుంజోవ్వ. (7-69)
59. జాఓ సోవి విలక్ఖో మఏవి హసిఊణ గాఢ మువగూఢో,
పఢ మోసరిఅస్స ణిఅంసణస్స గంఠిం విమగ్గంతో. (4-51)
అలిఅ పసుత్త వలంతమ్మి ణవనరే ణవ నహూఅ వేవంతో,
సంవేల్లిఊరు సంఅమిఅ వత్థగంఠిం గఓ హత్థో, (7-43)
60. ఇఅరో జణో ణ పావఇ తుహ జఘణారుహాణ సంగమ సుహేల్లిమ్,
అణుహవఇ కణఅణిరో హుఅవహ వరుణాణ మాహప్పమ్. (8-11)
దీహుణ్హ పఉర లసాస పణిరిఓ వాహాసలిల పరిసిత్తో,
సాహేఇ సామసవలం పలీప అహరో తుహ విఓఏ. (2-85)
61. దోఅంగులఅ కవాలఅ పిణద్ధ సవిసేస ణీలకంచుఇఅ,
దావేఇ థణత్థల వణ్ణిఅం వ తరుణీ జూఅజణాణమ్. (7-20)
62. వాఉవి అ వరిహోసణ కుఢంగపత్తలణ ములహసంకేఅ,
సోహగ్గకణఅ కసవట్ట గిహ్ణ మా కహ వి రిఖజ్జిహిసి. (7-26)
63. రుస్సిఖ్ఖిఅ రఅణపరిక్ఖపేహిఁ ఫిట్టోపి పత్థరే కావా.
కా తిలమెత్తం వట్టపి మరగఅ కా తుజ్ఝ ముల్లకహా (7-27)
64. మాలారీ లలి ఉల్లువిఅ బాహుమూలేహిఁ తరుణహిఅ అఇం,
ఉల్లూరఇ సజ్ఝల్లూరి అఇఁ కుసుమాఇ, దావేంతీ, (6-96)
65. మాలారిప వేల్లహల బాహుమూలావలోఅ ణ సఅహ్లో,
అలిఅంపి భమఇ కుసుమగ్గపుచ్ఛిరో పంసల జువాణో. (6-98)
66. సా తుహ కఏణ బాలఅ అణిసం ఘరదారతోరణ ణిసణ్ణా,
ఓససఈ వందణ మాలిఅవ్వ దిఅహం విఅ వరాఈ. (8-26)
67. రత్థావ ఇణ్ణ ణఅణుప్పలా తుమం సా పడిచ్ఛఏ ఏంతమ్,
దార ణిహిఏహిఁ దోహిఁవి మంగలకలసేహిఁ వ థణేహిం. (2-40)

ఇక పెండ్లికూతురికి పెడికకేలు (అవిదవాలక్షణ వలయాలు) తొడిగించండి.[68] పూజాకలశంలో తామరపూలు వేయండి.[69] మంగళ గాయికల మంగళగీతాలాపాలు కానివ్వండి. మంగళగీతంలో భావిపతి పేరు, వంశం శ్రద్ధగా వింటున్న పెండ్లికూతురు ఒళ్ళు పులకరించిపోతున్నది చూచారా?[70] పెండ్లికూతురు మనసు హృదయఫలకం మీద ఆశ అనే బలపంతో ఏమేమి తియ్యని కలలు వ్రాసుకొంటున్నదో కదా![71] మంగళవాద్యాలు వాయించండయ్యా. పటహం-తప్పెట వాయించండి.[72] గ్రామణిగారి గొప్పకు తగినట్టు ఏనుగుపై నగారా వేసి కూడ వాయిస్తున్నారు! బాగుంది. ఏనుగుతో పెళ్ళిపందిరి మరీ నిండుగా వుంది లెండి.[73]

పెండ్లి సందడిలో భోజనం సంగతి చూచేవాళ్ళున్నారా, లేదా? మహానసం వైపు వెళ్ళి వద్దాం రండి. వంటలు మహాజోరుగా సాగుతున్నాయండోయ్. పిండి దంచుతున్నది ఒకావిడ. అరిసెలకా ఏమిటి? పిండి ఒళ్ళంతా పడి క్షీర సముద్రం నుంచి పుట్టిన లక్ష్మిలా వున్నావమ్మా, మహా అందంగా.[74] లడ్డుకాలు కూడ కడుతున్నట్టున్నారు.[75] మోదకాలు కూడానా! పూర్ణంవా? పిండివా? అందుకేనేమిటి సెనగలు వేయించి చేటలో పోశారు! చేట కాలిపోదేని? దూరంగా పెట్టండి.[76] ఏమమ్మా, వంటమసంతా నీ ముఖానికే పూసుకున్నట్టున్నావే? మసి పూసుకున్నా నీ ముఖానికేం కుందు కలుగలేదు; అచ్చం చంద్రునిలాగ వుందిలే. అయినా, నవ్వుతారమ్మా పెండ్లివారు. తుడుచుకోరాదూ![77] ఎందుకండీ అలా ఊదుతున్నారు పొయ్యిని? మీరు ఊదిన

---

68. అవిహవలక్ఖణవలఅం బాలా ణేంతో పుణో పుణో గలిఅం,
సహసత్థోచ్ఛిఅ ఘూణం సణిఅ వలయారఓ ణాఅ. (6-89)

69. కం తుంగథణుక్ఖిత్తేణ పుత్తి దారట్ఠిఆ పలోఏసి,
ఉణ్ణామిఅకలసణివేసిఅగ్ఘకమలేణ వ ముహేణ. (3-56)

70. గిజ్జంతే మంగలగాఇఆహిం వరగోత్తే దిణ్ణకణ్ణాఏ,
సో ఉంవ ణిగ్గఓ ఉఅహ హోంత వహూఅఇరోమంచో. (7-42)

మగ్గే ఆఅణ్ణంతా అహణ్ణ అహమంగలుగ్గాఇమ్,
తేహిం జుఆణేహిం సమం హసంతివేం విఅసఉధంగా. (7-48)

71. జం జం ఆలిహఇ మణో ఆసావట్టీహిం హిఅఅఫలఅమ్మి,
తం తం బాలోవ్వ విహీ ణిహుఅం హసిఊణ పమ్హుసఇ. (7-56)

72. అణ్ణత్తం తేణ తుమం పఇణో పహాఏణ పడహసద్దేణ,
మల్లి ణ లజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జంతే. (7-85)

73. ధూలిమఇలో వి పంకంకిఅవిణరఇఅ దేహభరణో వి,
తహవి గఇందో గరుఅత్తణేణ ఢక్కం సముఞ్వహఇ. 6-26)

74. పేచ్ఛంతి అణిమిసచ్ఛా పహిఆ హలిఅస్స పిట్ఠపండురిఅం,
ధూఅం దుద్ధసముద్దుత్తరంత లచ్ఛిం విఅ సఅణ్హా. (4-88)

75. కమలం ముఅంత మహుఅర పక్కకఇత్థాణ గంధలోహేణ,
ఆలేక్ఖలడ్డుఅం పామరోవ్వ ఛివిఊణ జాణిహిసి. (7-42)

76. సచ్చం దడ్ఢం చణఅ వ భజ్జిఅ సో జువా అఇక్కంతో,
అత్తా వి ఘరే కువిఅ భూఅణం వ వాఇఅ వంసో. (6-57)

77. సరిసేహి మగ్గంస కమ్మరగ్గమసిమఇలేణ హత్థేణ,
ఛిత్తం ముహం హసిజ్జఇ చందావత్థం గఅం సఇణా. (2-28)

కొద్దీ మీ దగ్గరగా ఉందామని కాబోలు నిప్పు మండనే మండడంలేదు.[78] ఆవిడను చూడండి మరీ ఇదిగా ఉంది. పిండి దంచిందా! ఆ పిండి రొమ్ములపై పడిందా! తామరపూవు వద్ద ఉన్న హంసలులా లేవూ?[79] ఆసందులు (ముక్కాలిపీటలు) ఒకదానిపై ఒకటి ఉచ్చావచంగా పెట్టి ఏమిటి అంటుకుంటున్నారు?[80] పాల చట్టినా? అయితే దింపుకొని దీనిలో పోయనా? దిగేప్పుడు పడిపోయేరు? ఇంతకూ పాలల్లో పాలు కలిపితే ఏమి తెలుస్తుంది, నీళ్ళు కలిపినా తెలియనప్పుడూ?[81] చట్టువంతో అన్నం కలియబెట్టండి. వార్పా? అత్తెసరా?[82] కాకులు వచ్చి కలుషితం చేసేను, తోలండి, తోలండి.

వంట లెప్పుడవుతాయో? ఆకలవుతున్నది. ఆ వేయించిన సెనగ లిలా ఇవ్వండి. నమిలి మంచినీరు తాగుతాను. ఇదేమిటి? మంచినీళ్ళు ఇవ్వమంటే కాగి చల్లారిన నీరిచ్చారు, జ్వరం తగిలినవానికి ఇచ్చినట్లు. కాగి చల్లారిన నీటిలో రుచా? పచా?[83] మనస్పర్థల తర్వాత కలిసిన ప్రేమ, కాగి చల్లారిన నీరు నీరసమని తెలియదూ? స్వప్నంలో తాగిన నీటిలాగ,[84] చిత్రంలో చూచిన లడ్డులాగ[85] దాహం తీరుతుందా? ఆశ తీరుతుందా?

పెళ్లి పందిరిలో పిల్లల అల్లరికూడ సరదాగానే వుంది. ఎందుకా పెద్ద మనిషిని అందరూ ఏడిపిస్తున్నారు? పాపం! ధార్మికుడిలా ఉన్నాడు. ప్రాచీన సంప్రదాయంతో తమంత తాము వుండే వారంటే—ధార్మికులంటే ఎందుకో కుర్రకారుకు గిట్టదు. ఎందుకలా ఆటపట్టిస్తున్నారు ఆయనను? చిలక కొరికిన మామిడిపండెను కోసుకుంటున్నాడు మీగాళ్ళత్తి.[86] "ఏమిటి ధార్మికయ్యగారూ, మీగాళ్ళెత్తారు? మామిడికాయ కోసుకుంటూ అలాగే స్వర్గానికి లేచిపోతారా?"– అని అందరూ కేరింతలు. మొన్న మరొక ధార్మికుడు గోదావరి గట్టున కానుగ కొమ్మను విరుచుకుంటూంటే ఒకావిడ అలాగే ఎత్తి పొడిచిందట.[87] పిల్లి కి

78. రంధణకమ్మ ణిఉణిఏ మా జూరసు రత్తపాడల సుఅంధమ్,
ముహమారుఅం పిఅంతో ధూమాఇ సిహీ ణ పజ్జలఇ. (2-24)

79. ముహపుండరీఅ ఛాఅఇ సంఠిఅ ఉఅహ రాఅహంసేవ్వ,
ఛణపిట్ఠకుట్టణుచ్ఛలిఅ ధూలిధవలే థణే వహఇ. (7-24)

80. కహం తంపి తుఇ ణ ణాఅం జహ సాఅ సందిఅణ బహుఅణం,
కాఊణ ఉచ్చవచిఅం తుహదంసణ లేహలా పడిఅ. (2-10

81. గమ్మిహిసి తస్స పాసం సుందరి మా తురఅ వడ్ఢఇ మియంకో,
దుద్ధే దుద్ధంమిఅ చందిఆఇ కో పేచ్ఛఇ ముహం పేదే. (7-7)

82. ఉచ్ఛాఅరో పేచ్ఛఇ ణాహిమండలం సావి తస్స ముహఅందం,
తం చఉఅం అ కరంకం దోణ్హవి కాఆ విలుంపంతి. (2-62)

83. పేమ్మస్స విరోహిఅ సంధిఅస్స పచ్చక్ఖదిట్ఠ విలియస్స,
ఉఅఅస్స వ తావిఅసీఅలస్స విరసో రసో హోఇ. (2-58)

84 అవిఅణ్హా పేక్ఖణిజ్జేణ తక్ఖణం మామి తేణ దిట్ఠేణ,
సివిణఅపీఏణ వ పాణిఏణ తణ్హా చ్చిఅ ణ ఫిట్టా. (1-93)

85. కమలం ముఅంత మహుఅర వక్కకవిత్థాణ, గంధలోహేణ,
అలేక్ఖ లడ్డుఅం పామరోవ్వ ఛివిఊణ జాణిహిసి. (7-41)

86. చంచుపుడాహఅ విఅలిఅ సహఆరరసేణ సిత్తదేహస్స,
కీరస్స మగ్గలగ్గం గంధంధం భమఇ భమరఉలమ్. (7-66)

87. ఖంఖంతస్స వి తుహ సగ్గగామిణో ణఇకరంజపాహోఅ,
పాఅ అజ్జవి ధమ్మిఅ తుహ కఏ థరణిం విహ ఛివంతి. (2-67)

గంజినీరు పెట్టాడు ఆ కుర్రవాడు. నాయనా పిల్లి గంజిని పాలనుకుంటుందా ?[88] కోతికి ఆవకూర తినిపించారా? ఒకే గోల చేస్తున్నది; పొట్ట బాదుకొంటున్నది.[89] ఆ రెండవ కోతి నేరేడు పండిచ్చినా తినదేం ? ఒకసారి తుమ్మెద కుట్టిందట అప్పటినుంచి ఆ కోతి నేరేడు పండంటే తుమ్మెద అని భయపడుతున్నదట. [90] ఆ మూడో కోతి సంగతేమిటి? దూలగొండాకు తాకించారా ఏమిటి? తెగ బరుక్కుంటున్నది ఒళ్ళంతా. దూలగొండాకు అనుకొని పెంటి కోతి చేతిని కూడ అది తాకడంలేదట.[91]

నాగవల్లి (చతుర్థీ మంగళం) చేసుకొని అల్లుడు వెళ్ళుతున్నట్టున్నాడు.[92] ప్రస్థానకలశం పెట్టించండి. [93] పంపవలసిన సామగ్రిని సర్దుతున్నారా? ఒకే ఎద్దుపై అంతగా బరువు వేయకండయ్యా బరువుకు కుసిపడి పోతుంది. [94] రండి, రండి, ఊరి పొలిమేర వరకు సాగనంపి వద్దాం పెళ్ళివారిని. [95] మనం మళ్ళీ ఎప్పుడు కలుస్తామో!

పెండ్లి సందడిలో కనిపించలేదుగాని, ఏమి ఎండలు! ఏమి ఎండలు! భరించలేమండి. ఎండకాలం వచ్చింది కదా! ఎండలుకాక మంచు కురుస్తుందా అంటారేమో! అయినా ఇంతటి ఎండలా? నిప్పులు చెరిగేస్తున్నవి. చెట్ల నీడ కూడ ఎండ భయానికి చెట్టు దాటి రావడం లేదు. [96] చెట్లలోని కీచురాళ్ళు గీపెడుతూంటే, చెట్లు ఎండ భయానికి ఏడుస్తున్నట్టు అనిపిస్తుంది. [97] ఈ ఎండ సంగతి తెలిక ఊరు కదిలాను. అబ్బ! అదేమిట! దూరంగా నిప్పంటుకున్నట్లుందే. కానండీ! అవి కొండమీది అడవులు. ఎండకు దావాగ్ని రగిలి కాలి

---

88 ణ విణా సబ్భావేణ గ్గేప్పఇ పరమత్థ జాణుఏ లోఏ,
కోజుణ్ణమంజరం కంజిఏణ వేఆరిఉం తరఇ. (8-86)

89 గోలా ణఇఏ కచ్ఛే చక్ఖంతో రాఇఆఇ పత్తాఇం,
ఉప్పడఇ మక్కడో ఖోక్కఏఇ పోట్టం వ పిట్టేఇ. (2-71)

90. ఓసరఇ ధుణఇ సాహం ఖోక్కాముహలో పుణో సముల్లిహఇ,
జంబూఫలం ణ గేణ్హఇ భమరో త్తి కఈ పఢమ డక్కో. (61-81)

91. ణ ఛివఇ హత్థేణ కఈ కండూఇఅపఅ పత్తలణిఉంజే,
దరలంబిఅగోచ్ఛ కఇకచ్ఛు సచ్ఛహం వాణరీహత్థమ్. (6-82)

92. ఉఅగఅచఅ ఉత్థిమంగల వాఓంత విఓఅ సవిసేస లగ్గేహిం,
సీఅ వఏస్సఅ సేఅంశుపహిం రుణ్ణం వ హత్థేహిం. (7-44)

93. హారిహఇ పిఅస్స ణవచూఅ పల్లవో పఢమ మంజరి సణాహో,
మా రుఅసు పుత్తి పత్థాణ కలసముహసంఠిఓ గమణమ్. (2-48)

94. ఉజ్ఝసి పిఆఇ సమఅం తహవిహు రే భణసి కీస కిసిఅం త్తి,
ఉవరి భరేణ అ అణఅ ముఅఇ బఇల్లో వి అంగాఇం. (8-75)

95. అచ్ఛఉ తావ మణహరం పిఆఇ ముహదంసణం అఇమహగ్ఘమ్,
తగ్గామ ఛేత్త సీమావి ఝత్తి దిట్ఠా సుహావేఇ. (2-68)

96. ఘోఅం పి ణ ణీసరఈ మజ్ఝణ్ణే ఉహ పహిర తలఉక్కాఏ,
అఅవభఏణ ఛాఈ వి వహిఅ తాకిం త వీసమసి. (1-49)

97. రోవంతి వ్వ అరణ్ణే దూసహ రఇకిరణ ఫంస సంతత్తా,
అఇతార ఝిల్లి విరుఏహిం పాఅవా గిమ్హే మజ్ఝణ్హే,

పోతున్నాయి. 98 అడవిలో ఎండ తాపానికి జంతువులు కూడ వివశ లేకుండా పడిపోతున్నాయే. 98 ఎనుబోతు నల్లత్రాచుపామును సెలయేటి నీటిజాలని నాకబోతన్నది. ఆదేమో ఎనుబోతు చొంగను నల్లరాతి దొణనుంచి వచ్చేనీరని నాకబోతున్నది, 99 వడదెబ్బకు అలసిసొలసిన యేనుగైతే, కొండపాము కుబుసాన్ని సెలయేటి నీటిధార అనే భ్రాంతితో తొండం తడుపుకొంటున్నది. 100 అమాయమైన జింకలు అడవిలో నిప్పంటుకొన్నా, పూచిన మోదుగలు అనుకొని కదలడం లేదు. 101 మామిడి తోటలు నిప్పు మంటలాగ కనిపిస్తున్నాయి. అవేమిటి? పొగలా? అవ్వే తుమ్మెదలండీ! 102 చిన్న చెరువులు మడవలు ఎండిపోయాయి. 103 దూరంలో రహట్టం (కుండల కపిల) కనిపిస్తుంది. అక్కడికి వెళ్ళయినా చుక్క నీళ్ళు తాగుదాం. నోరెండిపోతున్నది. కుండల కపిలను చూస్తే దుష్టులు జ్ఞాపకం వస్తారు. నీళ్ళు ముంచుకొని నీలుగుతూ పైకి వస్తుంది. దుష్టులు తమ అవసరం తీరడానికి ఎంతో వినయంతో ప్రవర్తిస్తారు. పని తీరిన పిదప పెడమొగం పెట్టుకుపోతారు.104

బాబూ! ఇది వట్టి దరిద్రగొట్టు గ్రామం. పూరా మొప్పె పల్లెలా వుంది.105 ఎవరితో మాట్లాడమంటారు? ఎవరితో తమాషా చేయమంటారు? గ్రామణి గారేమో మరీ మొప్పె. పొట్ట పొడిస్తే అక్షరం లేదు. "సిద్ధిరస్తు" అని కూడా వ్రాయలేడు.106 గ్రామణీ పుత్రి అట, వట్టి విషపు తీగట.107 ఆమెను గురించి రకరకాలుగా చెప్పుకుంటారు. చిన్ననాటి నుంచే పదిమందినీ తన వెంట తిప్పుకునేదట. గ్రామణి గారికి మంచి చెరకు తోటలున్నాయి. గానుగాడిస్తాడు. ఏం లాభం? ఇంట్లో ఉప్పు, నేయి లేని కూడు తింటాడు.108 ఇక అతిథులకేమి పెడుతాడు? సరకం చెరకు సారా దండిగా తీయించి, అమ్ముకొని దండిగా డబ్బు

---

98. గిహ్మే దవగ్గి మసిమఇలిఆఇఁ దీసంతి విఞ్ఝ సిహరాఇం,
ఆసస పఉత్థ వఇఏ ణ హోంతి ణవపాఉసబ్భాఇం. (1-70)

99. గిరి సోత్తోత్తి భుఅంగం మహిసో జీహాఇ లిహఇ సంతత్తో,
మహిసస్స కణ్హ పత్థర ఝరో త్తి సప్పో పిఅఇ లాలమ్. (6-51)

100. ఉఅ ఓల్లిజ్జఇ మోహం భుఅంగకిత్తీఅ కడగలగ్గాఇ,
ఓజ్ఝర ధారాసద్దాలుఏణ సీసం వణగఏణ. (7-40)

101. తమ్మిర వసరిఅ హుఅవహ జాలాలివలీవిఏ వణాహోఏ,
కింసుఅ వణంతి కలిఊణ ముద్ధహరిణో ణ ణిక్కమఇ. (6-68)

102. అంబవణే భమరఉలం ణవిణా కజ్జేణ ఊసుఅం భమఇ,
కత్తో జలణేణవిణా ధూమస్స సిహాఉ దీసంతి. (6-48)

103. వాఊరిఅ వరిసోసణ కుడంగ పత్తలణ సులహసంకేఅ,
సోహగ్గ కణఅ కసపట్ట గిమ్హ మాకహవి ఝింజీహిసి. (7-26)

104. ఉఅఅంల హిఅణ ఉత్తాణిఅణణా హోంతి కేవి సవిసేసమ్,
రిత్తాణమంతి సుఇరం రహట్టఘడియ వ్వకాపురిసా. (5-90)

105. వక్కం కో పులఇజ్జఉ కస్స కహిజ్జఉ సుహం వ దుక్ఖం వా,
కేణ సమం వ హసిజ్జఉ పామర పఉరే హఅగ్గామే. (2-64)

106. చిరఅం వి అఆణంతో లోఅ లోఏహిఁ గోరవబ్భహిఅ,
సోణారతులేవ్వ ణిరక్ఖరా వి ఖందేహి ఉబ్బంతి. (2-91)

107. పత్తావచ్చిఅ మోహం జణేఇ బాల త్తణే వి వట్టంతీ,
గ్రామణి ధూఅ విసకందళివ్వ వడ్ఢిఅ కాహిఇ అణత్థం (5-10)

108. భుంజసు జం సాహీణం కుత్తో లోనం కుగామరిద్ధమ్మి,
సుహాఅ స లోణేణవి కిం తేణసిణేహో జహిం ణత్థి. (4-16)

చేసుకుంటాడు.[109] ఇక్కడ అందరూ తాగుబోతుల్లాగే ఉన్నారు. ఆడా మగా అందరూను.[110] గ్రామణి ఇంటికి ఎవరైనా వెళ్ళితే స్నానానికి నీళ్ళు కూడా దొరకవు. నేరేడుపట్ట పొడి ఇచ్చి గోదావరికి వెళ్ళి మునిగిరమ్మంటాడు. [111] దొడ్లో మామిడి చెట్టు. పిల్లవాడు ఏడ్చినా ఒక్క పండుముక్క ఇవ్వడు.[112] నిధులు దొరికాయట. రాజుకు తెలియపరచకనే స్వాహా చేశాడట. పాములాగ వాటికి కాపలా వుంటాడట.[113] పిల్లికయినా బిచ్చం పెట్టడు. అంతడబ్బుండి ఏమి ప్రయోజనం, మండే ఎండలో వెళ్ళేవాడి నీడలాగ?[114] దొడ్లో గొడ్డు గోదా చూద్దామా! సన్నంచివే వున్నాయి. అయినా వట్టిపోయిన ఆవును కూడా పితుకుతాడు. ప్రవాసి. మంచి గుడ్డలైనా కడతాడా అంటే, అదీ లేదు. పిడకల పొగచూరిన పాత గుడ్డలు కట్టుకుంటాడు.[115] అయినా అధికారి కాదూ? ఊరివారికంతా భయమే. అతనితో అందరికీ పని పడుతూవుంటుంది. వారి జీవితమంతా అతని చేతిలో వుంటుంది. రాజద్రోహం చేసినవారు మాట్లాడినట్లు అతని సంగతి గుసగుసలుగా చెప్పుకుంటారేగాని బాహాటంగా చెప్పరు. [116] ఒక్క చలివేంద్రం వుంది. దానిలో పడుచుదాన్ని పెట్టాడు. దానిని చూడడానికి వచ్చే కోడెగాళ్ల తండాయే ఎక్కువ. ఏం చేస్తాం! నీళ్లు పోసేప్పుడు చూడాలి వారి ఎగసక్కెలు, సయ్యాటలూను. [117]

ఏమిటి అలా పరుగెడుతున్నారు కుండలు, ముంతలు, కడవలు చేత్తోపట్టుకొని? నిప్పంటుకుందా? అదో పొగ! ఔను. నా చేతికికూడ ఒక కడవ అందివ్వండి. [118] బారులు తీరి నిలబడండి. ఆమడ దూరంనుంచి అయినా సరే నీళ్లు అందిద్దాం, చేతులమీద. లాభంలేదండీ, లాభం లేదు. ఊరంతా నాశనమైపోయింది. చేయదగిందీ, చేయగలిగిందీ చేశాం. పెద్ద ఇళ్లు కాలిపోయాయి.

---

109. అరుహఇ జుణ్ణఅం బూజ్జఅం వి జం ఉఅహ వల్లరీ తడంసి,
ణీలువ్వల పరిమళవాసిఅస్స సరఅస్స సోదోసో. (6-64)

110. ఏకఅగ్గహ రహసుత్తాణిఅ ణణా సిఅఇ పిఅముహవిఇణ్ణమ్,
థోఅంథోఅం రోసోసహంవ ఉఅ మాణిణీ మఇరమ్. (6-50)

111. తుజ్ఝంగరాఅ సేసేణ సామలీ తహ ఖరేణ సోమారా,
సా కిల గోలా ఊలే వ్హాఅ జంబూ కసాఏణ. (2-89)

112. విసమట్టిఅ పక్కేక్కందసంపణే తుజ్ఝసత్తుఘరిణిప,
కోకోణ పత్థిఓ పహిఅణం డింభే రుఅంతమ్మి. (6-95)

113. చోరా సభఅ సతణ్హం పుణో పుణో పేసఅంతి దిట్ఠీఓ,
అహిరక్ఖిఅ నిధికలసేవ్వ పోఢవఇఆ థణుచ్ఛంగే. (6-76)

114. హోంతీవి ణిప్ఫలచ్చిఅ ధణరిద్ధీహోఇ కివిణపురిసస్స,
గిహ్మఅవ సంతతస్స ణిఅఅఛాహివ్వ పహిఅస్స. (2-86)

115. మూఇజ్జఇ హేమంతమ్మి దుగ్గఓ పుఫుఅ సుఅంధేణ,
ధూమ కవిలేణ పరివిరల తంతుణా జుణ్ణ వడఏణ. (4-29)

116. రాఅవిరుద్ధంవకహం పహ్ణో పహిఅస్స సాహఇ ససంకం,
జత్తో అంబాణ దలం తత్తోదరణిగ్గఅం కింపి. (4-96)

117. ఉద్ధచ్ఛో పిఅఇ జలం జహ జహవిరలంగులీ చిరం పహిఓ,
పావాలిఆవి తహతహ ధారం తణుఇంసి తణుఏఇ. (2-61)

118. సవ్వస్సమ్మి విదద్ధే తహవివాసు హిఅఅస్స ణివ్వుదిచ్చేఅ,
ంతేణ గామడాహే హత్థాహాఇం కుడో గహిఓ. (8-29)

మూలబంధం-(పునాది) మాత్రం మిగిలింది. 119 కొట్టం ఖాళీ, గొడ్డూ గోదా కాలిపోయాయి. 120 జనంకూడా మరణించారు. అబ్బా! చూడలేమండీ ఆ వైధవ్యవేషాన్ని. ఆ గ్రామణి చచ్చేప్పుడు కూడ తన ప్రియురాలినే చూచాడట. 121 వైధవ్యవేషం బలి తీసుకుపోతున్న దున్నపోతును అలంకరించినట్టుందండీ. 122 ఏం సంఘమో! అనుమరణంకూడా ఉంది! కొండపైనుండి కూడ అనుమరణం చేస్తారటగా. 123 బలే!బలే! ఆయన బతికాడటగా శ్మశానానికి తీసుకు వెడుతూంటే. ఆయన భార్యల విధవావలయాలు అవిధవాలక్షణ వలయాలయ్యాయటగా. 124 ఎవరాయన? ఇల్లుకాలి చస్తుంటే, అగ్ని నమస్కారం చేయక సూర్య నమస్కారాలేమిటయ్యా. 125

అయ్యో! తేలండీ తేలు! 126 ఈ పాడు ఊరినుంచి రేపే వెళ్లిపోదామనుకున్నాం. తేలుకుట్టింది. ఎలా వెళ్లడం? వైద్యుడెవడూ లేడూ? మంత్రమో! తంత్రమో! వైద్యమో! మంగలి వైద్యమో! ఏదో చేయించండి. బలే మంత్రమయ్యా. ఏం తలచుకుని ఛస్తే అదే జన్మ వస్తుందటగా మరోజన్మలో! ఈ గ్రామం రాకుండా వెంటనే మంత్రం వేద్దూ! బలేవాడివయ్యా. ఎక్కడో మనసుపెట్టి పెదవులు కదలిస్తావేం? మంత్రం గట్టిగా అను. 127 సలువండీ, సలువు! ఆయనేనా వైద్యుడు. మామూలు నాపితుడనుకున్నాను. ఎందుకాకడ పరుగెత్తివస్తున్నది! ఆవిడకుకూడ తేలు కుట్టిందా? మంగలి వైద్యుణ్ని చూచి పిల్లవాడు భయపడుతూవుంటే అలా పరుగెత్తుతున్నదా? 128 అమ్మయ్య! బతికానురా బాబూ! మందు మంచిదే. కొంచెం చేదనుకోండి. అయితేనేమి? మందు అందించిన అందగత్తెనుచూచి ఎలాటి మందైనా మింగవచ్చు. 129

---

119 ధణ జహాణ ణిఅంబోవరి ణహారంభా గఅవఅణ, వణిఅణమ్,
ఉర్వసి అణంగణివాస మూలబంధవ్వ దీసంతి. (8-88)

120 గేహం వనిత్తరహిఅం ణిజ్జరకుహరం వ వలిలమ్మట్టవిఅమ్,
గోహాణ రహిఅం గోట్ఠం వ తీఅవఅణం తుహ విఓగే. (7-9)

121 గామణిణోసవ్వాసు వి పిఅసు అణుమరణ గహిఅవేసాసు,
మమ్మచ్ఛేపసువి వల్లహాఇ ఉవరీ వలఇగట్టీ. (5-49)

122 గోత క్ఖలణం సోఊణ పిఅఅమె అజ్జ తీఅ ఖణదిఅహే.
వజ్ఝ మహిసస్స మాలవ్వ మండణం ఉఅహ పడిహాఇ. (F-96)

123 ఖరపవణ రఅ గలత్థిఅ గిరి ఊడావడణ భిణ్ణదేహస్స,
ధుక్కుధుక్కఇ జీఅంవ విజ్జుఅ కాలమేహస్స. (6-88)

124 అణుమరణ పత్థిఆఏ పచ్చాగఅజీవిఏ పిఅఅమమ్మి,
వేహవ్వ మండణం కులవహూఅ సోహగ్గఅం జాఅమ్. (7-88)

125 సూరచ్ఛలేణ పుత్తఅ కస్స తుమం అంజలిం పణామేసి?
హాస కడక్ఖమ్మిస్సా ణ హోంతి దేవాణ జేక్కారా. (4-82)

126 పఇపురఓ వ్విఅ ణిజ్జఇ విచ్ఛుఅ దట్ఠేత్తి జారవేజ్జఘరమ్,
ణిఉణసహీకరధారిఅ భుఅజుఅలందోలిణీ బాలా. (8-87)

127 సంఝూ గహిఅ జలంజలి పడిమా సంకంత గోరిముహకమలమ్,
అలిఅం చిఅ ఫురిఓట్ఠం విఅలిఅమంతం హరం ణమహ. (7-00)

128 ధావఇ విఅలిఅ ధమ్మిల్ల సిచఅ సంజమణ వావడకరగ్గా,
చందిలభఅ వివలాఅంత డింభ పరిమగ్గిణీ ఘరణీ. (8-91)

129 మహ పుచ్ఛిఆఇ హలిఓ ముహసంకఅసురహి పవణ ణివ్వవిఅమ్.
తహ పిఅఇ పఅఇకడుఅం పి ఓసహం జహ ణ ణిట్ఠాఇ. (4-17)

ఇదేమిటి ఈ గ్రామంవస్తే వానలు పట్టుకున్నాయి? బాగానే వుంది. వీధులన్నీ బురద. ఆ బక్కావు బురదలో చిక్కుకుపోయిందే; తీయనా! 130 కడలదంతి. ఏం చేయను! మనకు నిలువనీడనిచ్చిన యిల్లాలు ఎంత ఉత్తమురాలు! ఇల్లు కారుతున్నా మనకు మాత్రం మంచి స్థలమే చూపింది, తాను కన్నీటితో తడవని ప్రాంతాలు తడుపుతూ. 131 మన అదృష్టం బాగానేవుంది. ఇక్కడ మనకు నోరు తియ్యనవుతుంది. గహపతి (పెద్దకాపు)గారి కుమార్తె తొలిసమర్తట. తొలి సమర్త గుడ్డను ఆనందపటమంటారట. 132 దానిని అందరికీ చూపడం ఇక్కడి ఆచారమట. పుష్పవతిని చూడడమే తప్పంటారు కదా! ఇదెందుకు? 133 ముఖానికి నేయిరంగ పూత ఏమిటి వికారంగా? అదీ ఆచారమేనా? సరే. ఆ ఇల్లాండ్రు ఎందుకలా దూరంగా కూర్చున్నారు? ఇంటికి వెలుపల వున్నారా? ముట్టుకోరేమిటి? 134 మరి ఈ సమర్తపిల్లోయ్ గహపతి గారికి చాలమంది భార్యలున్నారటగదా! ఇంకా పిల్లలులేరా మోజు కాబోలు! ఇంతకూ న్యాస 135 (కదువ) పెట్టయినా ఎందుకండీ ఈ దుశారా? సరే ఎలాగూ చేయిస్తున్నారు సమర్తపిల్ల కూర్చునేచోట వెనుక కుడ్య చిత్రాలు సరిగా వేయించండి. 136 మంచి వర్తిక ఇప్పించండి. అరె! అరె! పడిపోతూందండి అమ్మాయి. వడ్రంగిని పిలిపించి ఆసంది (ముక్కాలిపీట) కోళ్లు సమంగా దారం (ప్రమాణసూత్రం) వేయించి రంపంతో కోయించండి. 137 మేకులు తాటించండి. వాయినాలు పంచరా? 138 రాత్రి నాటకం కూడా ఆడారు. చాలాబాగుంది. పూర్వరంగంలోనే నాటకం మంచిదని తెలిసి పోయింది. ఏం నాటకమనుకున్నారు? శ్రీరాధ్ధిమదనం. నవరసాలూ! ఓహ్! 139

---

130 కహం సా ణివ్వణ్ణిజ్జఇ జీఅ జహా లోఇఅమ్మి అంగమ్మి.
దిట్ఠీ దుబ్బలగాఈ వ్వ పంకపడిఅ ణ ఉత్తరఇ. (8-71)

131 పహిఅ వహూ వివరంతరగలిఅ జలోల్లే ఘరే అణిల్లంపి,
ఉద్దేసం అవిరఅ వాహసలిల ణివహేణ ఉల్లేఇ. (6-40)

132 కేరిమ మాణందవడం ఖామిజంతం వహూఅ సహీఅహిం,
పేచ్ఛఇ కుమారిజారో హాసుమ్మిస్సేహిం అచ్ఛీహిం. (5-57)

133 జఇ లోకణిందిఅం జఇ అమంగలం జఇ విముక్కమజ్జాఅం,
పుప్ఫవఇదంసణం తహవి దేఇ హిఅఅస్స ణివ్వాణం (5-80)

134 వణ్ణఅ ఘిఅలిప్పముహిం జో మం అఇఆయరేణ చుంబంతో,
ఏణ్హింసో భూసణభూసిఅం పి అలసాఅఇ ఛివంతో. (6,19)

135 ణాసం వహ కహో తే అజ్జవి తుహ దంతమండలం బాలా,
ఉబ్భిణ్ణ పులఅ వఇవేఢపరిగఅం రక్ఖఇ వరాఈ. (1-96)

136 హిఅఅం హిఅఏ ణిహిఅం చిత్తాలిహిఅవ్వ తుహ ముహే దిట్ఠీ,
ఆలింగణరహిఅఇం ణవరం ఖిజ్జంతి అంగాఇం. (5,85)

అణ్ణక్కమరహిఅస్స వి ఏస గుణో ణవరి చిత్తకమ్మస్స,
ణిమిసం పి జం ణ ముంచఇ పిఓ జణో గాఢముపగూఢో. (7-12)

137 విరహకరవత్త దూసహ ఫాలిజ్జంతమ్మి తీఅ హిఅఅమ్మి,
అంసూ కజ్జల మఇలం పమాణసుత్తం వ్వ పడిహాఇ. (2-58)

138 దిఢమూలబంధగంఠివ్వ మోఇఆ కహవి తేణ మే బాహూ,
అమ్హేహిం వి తస్స ఉరే ఖుత్తవ్వ సముక్ఖఆ థణఆ (8-76)

139 మాణదుమ పరుసపవణస్స మామి సవ్వంగణివ్వుఇ అరస్స.
అవగూహణస్స భద్దం రఇణాడఅ పువ్వరంగస్స. (4-44)

ఎందుకయ్యా అంతతొందర అల్లుడూ! పెరట్లో అమ్మాయి నీళ్లు పోసుకుంటుంటే...గాజులు చప్పుడైతే ఎందుకలా అటిరి పడుతావు? నీళ్లగది తూముగుండా వచ్చే నీళ్లలో పసుపును పరిశీలిస్తున్నావేమిటి? 140 మరదండ్లు బాగానే ఏడిపిస్తున్నారే. 141 ఉత్పలి కంగ (విద్దెంవిద్దెం) ఆడించమంటున్నారా?

ప్రస్థాన కలశమట' మంగళవారమట! వెళ్లవయ్యా. జ్యోతిష్కుని పిలిపించి హోరలువేయించి (పలకపై గీతలు మొదలయిన లెక్కలు వేయించి) బాధపడటమెందుకు? 142 లక్ష్మి పక్కన వుండగా ఏమిటయ్యా జంకు పయనానికి?

ఏమిటయ్యా రైతూ అలాచూస్తున్నావు? ఈ ఆకాశం ఎంత బాగా కప్పినా, ఇంతగా కాస్తున్నదేమా అనా? వరదలకు దున్నపోతు కొట్టుకపోతే, మరోదున్నపోతు దొరకదని దాని గంటలపట్టెడను అమ్మవారి గుడికి చేర్చావటగా! మరొక ఊరిలో వెదకలేకపోయావా? 143

ఈ ఊరు మరీ బాగుందండోయ్! వానలు వెలిశాయి. దారి బురదే అయినా, సత్పురుషుల మనస్సులా పైకి అరి గరుగ్గా, లోపలమెత్తగా వుంది. ఏరువాక అప్పుడే అయిందేమో! తిండి తెస్తున్న ఇల్లాలిని చూస్తూ దున్నుతున్న కాపు మైమరచి పోతున్నాడు. మేడి వదలకయ్యా పూబోడిని చూచి.[144] ఇక కొన్ని నెలలకు వరిచేలు పండి తెల్లబారుతాయి. హారిదళం అంటే కొన్న ఆటవెలదివలె ఒనప చేను సొగసవుతుంది. పత్తికాయ నవ్వు విచ్చినది, ఆ కాపు దంపతులను చూచి నవ్వినట్టు లేదూ? [145]పత్తిచేనును ఎనుబోతు విరగబడి మేస్తున్నదంటే, చూస్తావేమిటి? తోలవయ్యా.

గ్రామసమీపంలోనా యవలువిత్తుతారు? పంగులు పాడు చేయవూ! అమ్మాయి, అమ్మాయి, కుంటమచేలలో ముండ్లుంటాయి. పూపులకోసం పోయి ముండ్లు తొక్కేవు? ఆ అమ్మాయి కలమధాన్యాన్ని బాగా కాస్తున్నదే. చెఱకు గానుగాడడం రెండునెలల్లోనే కదూ! నిలువెత్తు పెరిగిన నూల చేనులోను, వరిచేలలోను దాక్కున్నా కనిపించం సుమండీ!

---

140 మామి హిఅఅ మిసపిఅం తేణ జువాణేణ మజ్జమాణావ,
హ్లాణ హరిద్దాకడుఅం అణుసోత్తఅఇలం తేఅంతేణ. (8-46)

140 అనరహ్ణాగఅ జామాఉఅస్స విగుణేఇ మోహణోక్కంఠమ్,
వహు అఇ ఘరవలోహర మజ్జణ పిసుణో వలఅసద్దో. (7-88)

141 ఉప్పల్లి అఇ ఖేల్లఉ మాణం వారేహి వోఉ పరిఊథా,
మా జఘణ ఖార గరుఈ పురుసాఅంతీ కిలిమ్మిహిసి. (2-96)

142 కత్థకఅం రఇఖింబం కత్థపణట్టావో చంద తారాఓ,
గఅణే బలాఅపత్తిం కాలోహోరంవ కహేఇ. (5-85)

143 గహావఇణా ముఅమ్మి రిహే డుండుఅదామం చిరం వహేఊణ,
వగ్గసఅఇం ణేఉణ ణవరఇ అజ్జాఘరే బద్ధం. (2.72)

144 ణవ కమ్మిపణ హఅపామరేణ దట్టూరి పాఉహోరిఓ,
మోత్తవ్వే జోత్తఅపగ్గహమ్మి అవహాసిణీ ముక్కా. (7-92)

145 అజ్జం మోహణసుహఅం ముఅత్తి మొత్తూ పలాఇఏ హలిఏ,
దరఫుడిఅ వేంటభారోణఅఇ హసిఅం వ ఫలహీఏ. (4-60)

ఏమి పాడేస్తున్నాడయ్యా రైతు; పైరు కోర్కెలు దైవారగా పండగాను. చక్కగా దంచిన బియ్యంలావున్న వెన్నెల్లో హాయిగా గొంతువిప్పాడు. 146 ఈ పొలంచుట్టూ కంచె వేసుకోవయ్యా. బాగా మొరిగే కుక్కను బలే సంపాదించావులే. అదిలించవయ్యా వెళ్ళిపోతాం.

చేలు బాగా పండాయి. బాజాలు, భజంత్రీలు, నాట్యాలు, సరే. మురజానికి మరింత అన్నంపెట్టి వాయించండి. ఇదేమిటి ఈ మహిష బలి? శ్యామాకవ్రతం చేసుకోండి! వాయనాలు పంచిపెట్టండి. తినండి. బుద్ధుని ఒకవైపు పూజిస్తూ, ఇదేమిటి బలి? శ్మశానం బూడిద పూసుకొన్న కాపాలిక కూడా ఉన్నట్టుందే. మరొకవైపు విష్ణుపూజ కూడానా? కృష్ణుడంటే కూడ పడి చస్తారటగా!

చలి! చలి! ఎముకలు కొరికే చలి! ఎందుకు వచ్చాంరా బాబూ ఈ ఊరికి? పట్టి కుగ్రామం. శిథిల దేవాలయం ముందు ఎవరో చలి మంట వేస్తున్నారు. వెళ్ళదాం. గడ్డి మోడు ఆరి పోతున్నది. దానిని కర్రతో కదుపుతూ ఎలుగుబంటిని చీల్చుతున్నట్టు సాహసం చేస్తున్నాడు ఒకాయన. 147 ఏం దేవళం ఇది! గణపతి విగ్రహం ఇలా పడుందే? ఒక ప్రక్క అరిగి పోయుందేం? ఎవరైనా తలగడగా ఉపయోగించుకొనేవారా ఏమిటి?

పిడకల నిప్పు పొగ కంపుతో పోగులు సడలిన చిరుగుగుడ్డలు కప్పుకొని పేద వారెలా బాధపడుతున్నారో!148 ఒక కాపు పచ్చడం అమ్మి యెద్దును కొన్నాడట! చలి లేదా నీకు అని అడిగితే, రెండు కుమ్ముల జవరాలు వుందిలే, అన్నాడట. ఈ ఊరిలో నేనా? ఇదేమిటయ్యా ఆతిథ్యం కూడ సరిగా లేదు. ఉప్పు అన్నం చాలా? మునివ్రేళ్ళన్నా నేతిలో తడవ వద్దూ? ఊరంతా విపరీతంగా వుందే? నవపీయూషం (కొత్త జున్ను పాలు) తాగిన గేదె దూడలాగా మధ్యాహ్నం నిద్రపోవడం జబ్బుకాదూ చలికాలంలో. వింత కుక్కను పెంచిందయ్యా ఆవిడ. మగని చూస్తే మొరుగుతుంది; మిండని చూస్తే మెడవూపుతుంది. రాత్రి ఇంటి ముంగిట్లో పడుకుంటే, ఇక్కడ నేను, ఇక్కడ అత్తగారు, ఇక్కడే తక్కిన వారు, అంటుందేమిటి ఆవిడ? మారు రేచీకటా! 149

ఇక్కడ గోరు వంకలూ, చిలుకలూ గయ్యాళివే! రాత్రి పడకటింటి సంగతులు పగలు వీధిన పడేస్తాయి. ఇతడు మన శరణువేడాడు, కాపాడమంటూ మిండగాణ్ణి మగనికే అప్పగించిందట ఒక జాణ.

---

146 ణిప్పణ్ణ సస్సరిద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ,
దలిఅ ణవసాలి తండుల ధవల మిఅంకాసు రాఈసు. (7-89)

147 ఫాలేహి అచ్ఛభల్లంవ ఉఅహ కుగ్గామదే ఉలద్దారే,
హేమంతఆల పహిఓ విజ్ఝాఅంతం పలాలగ్గిం. (2-9)

148 సూఇజ్జఇమ్మి హేమంతమ్మి దుగ్గఓ పుప్ఫుఆసుఅంధేణ
ధూమకవిలేణ పరివిరల తంతునా జుణ్ణ వడపేణ. (4,29)

149 పత్తణిమజ్జిఅ అత్తా, ఏత్థ అహం ఏత్థపరిఅణో సఅలో.
పంథిఅ రత్తీ అంధఅ మా మహ సఅణే ణిమజ్జిహిసి. (7-67)

తొలికాన్పువేళ నొప్పులు పడలేక మగని మాట ఇక వద్దంటుందటగా ఒక ప్రసూతి విరాగిణి.[150] దయ్యాలు కూడా ఉన్నాయటగా ఈ ఊళ్ళో? మంచి కిట్టెలు దొరకవా? ఏమిటా పొగ? పొమ్మనలేక పొగబెట్టడమా ఇది?

గుండె తరుక్కుపోతుంది ఆ కమలవనాన్ని చూస్తే, ఊరికంతా ఒక్క సొమ్ముగా వున్న కమలవనం మంచుకు చెడి రాలిపోయి, కోసిన నూవు చేనిలా దంట్లతో మాత్రం మిగిలింది. గుడిగోడమీద గీతలేమిటి, ఏవో సంకేతాలులా? రెండక్షరాలు వ్రాయడానికి చేతకానివారే ఊరి వారిలో చాలా మంది. ముత్యాలు వద్దని గురువిందలకు మోజుపడతారేమిటి ఆడవారు? అడుసులో చిక్కుకున్న నాగలిని ఈడ్చి మగడు అలసి నిద్రపోగా, ఆ కాపు పడతి ఉపచారం చేయడంమాని, వియోగబాధ పడుతుందేమిటి? పేదల కోరికలు తీరే అవకాశమే లేదే ఇక్కడ?

మరదులతో వదినెల ఎకసక్కాలేమిటి? శెట్టివాని భార్య వాడకంతా వదిన అంటే ఇదేనా? అయ్యో!ఆయ్యో అదేమి పాపకర్మ! ఆడవాళ్లు బందీలా! వాళ్ళు బలవంతులై మిమ్మల్ని బందీలుగా తీసుకుంటే? వద్దుబాబూ, ఈ ఊరు! మరొకమంచి ఊరికి పోదాం.

మరొక ఊరికెందుకు? మన ఊరికే తిరిగి వెళ్ళుదాం. అయలుదేరి ఒక యి ఋచక్రం గిర్రున తిరిగి పోయింది. నవ వసంతరాజు రథ శిఖరం ధ్వజంలా మామిడి చివుళ్ళు కనిపిస్తున్నాయి. ఆ మోదుగు మొదలు చుట్టూ పడిన మోదుగుపూలు చూడండి. తథాగతుని పాదాలపై పడిన భిక్షుసంఘాలలాగ వినమ్రంగా ఉన్నవి. మనమూ సమంతభద్రుని స్మరిస్తూ మన ఊరికే వెళ్ళుదాం.[151]

---

150 హోసావిఅ జణో సామలీప పడమం పసూఅమాణాఏ,
వల్లహ వాహేణ అలం మమత్తి బహుసో భణంతీఏ. (2-26)

151 కిరముహ పచ్చఏహిం రేహఇ వసుహా పలాసకుసుమేహిం,
బుద్ధస్స చలణవందణ పడిఏహిం వ భిక్ఖుసంఘేహిం. (4-8)

# గాథా సప్తశతి కాళిదాసు అనుకరణ

ప్రతి కవీ తన పూర్వ కవి రచనలను చదువకపోడు. సామాన్య కవి పూర్వకవిరచనలను యథాతథంగానే వాడుకుంటాడు, క్షేమేంద్ర రాజశేఖరు లన్నట్లు పద పాద అర్థ సంపూర్ణ శ్లోకచోరుడని నిందలు పొందుతాడు. కాని, నిపుణుడైన కవి తాను గ్రహించిన దానిపై మెరుగులు పెడుతాడు; ఇతరుల నుంచి తీసుకొన్నది గాదు; స్వంతంది; అనే భ్రాంతి కలిగిస్తాడు. కాళిదాసు కూడ తన పూర్వులయిన వ్యాస వాల్మీకి భాసాశ్వఘోషులనుంచేకాక జానపద కవులనుంచీ కూడ ఎంతో తీసుకున్నవాడే. కుమారసంభవంలో కాళిదాసు పార్వతీదేవిని వర్ణిస్తూ,

"మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వళిత్రయం చారు బభార బాలా" (1–39)

అని ఆమె నడుమును యజ్ఞవేదితో పోల్చాడు. "ఎంత సొగసుగా వుంది ఉపమ!" అన్నారు సహృదయులు. "వైదిక సంప్రదాయాన్ని కాపాడాడు మమా"! అని మెచ్చుకున్నారు వైదికులు, యజ్ఞవేది స్వరూపం తెలిసినవారుగనక. "స్కందునివంటి దేవసేనాని అవతరణకు శివుడు హోమం చేయాలి గదా! పార్వతీదేవి నడుము యజ్ఞవేదికాక మరేమవుతుంది?" అని అతి సంప్రదాయవాదులు విశేషాలు లాగారు. వ్యాసుడు సభాపర్వంలో ద్రౌపదిని వర్ణిస్తూ ఆమె నడుమును యజ్ఞవేదితో పోల్చడం చూచిన పిదప వ్యాసునిపై గౌరవం హెచ్చింది. ఇలాగే ఎన్నో! తన కాలానికి ముందు కమనీయ కవితాలోకంగాను, తన సమకాలంలోనూ ప్రవరసేనునివంటి బహుకార్య వ్యాపృతుడైన వాకాట రాజు సేతుబంధం వంటి ప్రాకృత కావ్యాన్ని రచించ డానికి కారణమైన గాథాసప్తశతిని కాళిదాసు చూడకపోవడం సంభవించి వుండదు. కనుకనే దానిలోని భావాలు, భావాల ఛాయాంతరాలు, పదబంధాలు కాళిదాసు రచనలలో కానవస్తాయి. కాళిదాసు గాథాసప్తశతి నుంచి గ్రహించి వుండవచ్చుననే సంభావనతో యాదృచ్ఛికంగా తెలుసుకొన్న కొన్ని అంశాలను మాత్రమే యిక్కడ నివేదిస్తాను. కాళిదాసు, తన కాల దేశ వర్తమానాలను గురించి తన రచనల్లో ఎక్కడా చెప్పుకోలేదు. కాని, అతని రచనల అంతరంగ సాక్ష్యాన్నిబట్టి అతడు గుప్త వంశీయులైన చక్రవర్తులు చంద్రగుప్త స్కందగుప్త కుమారగుప్తుల సమకాలికుడనే నమ్మకం మీదే నా యీ వాదం ఆధారపడింది.

## 1. ఆశాబంధః :

కాళిదాసు 'ఆశాబంధః' అనే అపూర్వమైన పదబంధం వాడి సహృదయ లోకాన్ని పులకితం చేశాడు.

తాం చావశ్యం దివసగణనా తత్పరాం ఏకపత్నీం
అవ్యాపన్నాం అవిహితగతిః ద్రక్ష్యసి భ్రాతృజాయామ్,

ఆశాబంధః కుసుమ సదృశం ప్రాయశోహ్యంగనానాం
సద్యః పాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి.

(మేఘసందేశం, పూర్వభాగం—10)

యక్షుడు తన ప్రియురాలికి మేఘునితో సందేశం పంపుతున్నాడు:— ఓ మేఘుడా, నీ వదిన నా విరహపు దినాలు యింకా ఎన్ని వున్నాయో అని లెక్క పెడుతూ, నా కోసం యింకా జీవించి వుంటుంది. నీవు నిరాఘాటంగా వెళ్ళి ఆమెను చూస్తావు. మహిళల మనస్సు ప్రేమ పరిపూర్ణమూ, కుసుమ సుకుమారమూ అయింది. అలాటిది వియోగంలో రాలిపోకుండా ఆశాబంధం-ఆశ అనేపట్టు అడ్డగిస్తూ వుంటుంది. ఆశతో జీవితాన్ని ఉగ్గబట్టి వుంటుంది.

ఈ ఆశా బంధాన్ని కాళిదాసు మరికొన్నిచోట్ల కూడ ప్రయోగించాడు. విక్రమోర్వశీయంలో:—

"రాజా: (చంద్ర మవలోక్య విదూషకం ప్రతి) వయస్య, పరం ముహూర్తా దాగమనం దేవ్యాః. తద్వివిక్తే కథయిష్యామి స్వా మవస్థామ్."

"విదూషకః—నను దృశ్యత ఏవ సా. కింతు తాదృశ మనురాగం ప్రేక్ష్య, శక్యం ఖలు ఆశాబంధేన ఆత్మానం ధారయితుమ్."

[రాజు—(చంద్రుణ్ని చూచి విదూషకునితో) వయస్యా, దేవి రావడానికి గడియ వుంది. కనుక ఏకాంతంగా నేను నామానసికావస్థ తెలుపుతాను.

విదూషకుడు:—ఆ అవస్థ కనిపిస్తూనే వుంది. కాని ఊర్వశి నీపైన చూపిన అలాటి అనురాగాన్ని బట్టి ఆశాబంధంతో నిన్ను నీవు నిలబెట్టుకోవచ్చు.]

శాకుంతలంలోను ఆశాబంధం ప్రయోగించబడింది. చతుర్థాంకంలో శకుంతల దుష్యంతుని వద్దకు వెళుతున్నప్పుడు అనసూయ 'ఆశాబంధో సహోవేది.' అని అంటుంది. (4_16)

ఈ ఆశాబంధం గాథాసప్తశతిలోనిది. దానినుంచే దీనిని కాళిదాసాదులు తమ రచనలలో గ్రహించినట్టు నేను భావిస్తున్నాను.

విరహాణలో సహిజ్జఇ ఆసాబంధేణ వల్లహజణస్స,
ఏకగ్గామ పవాసో మాఏ మరణం విసేసేఇ. (1-48)

(విరహానలః సహ్యత ఆశాబంధేన వల్లభజనస్య,
ఏక గ్రామ ప్రవాసో మాత ర్మరణం విశేషయతి.)

"అమ్మా ప్రియుడు మరొకచోటికి ప్రవాసం వెళ్లితే, ఆ ప్రియవ్యక్తి విప్పులవంటి విరహాన్ని ఆశాబంధంతో-మళ్లీ తిరిగి వస్తాడుగదా అనే ఆశతో-సంహిచవచ్చు. కాని ఒకేఊళ్ళో విడిపోయి వుండడ మనేది చావును మించినట్టిది సుమా!" అంటుంది ఒక ప్రేమైక జీవిని.

ఈ ఆశాబంధాన్ని భాసుడూ ప్రవరసేనుడూ వాడినారు. సీతాన్వేషణకు వెళ్లిన హనుమంతుడు ఎంతకాలమయినా తిరిగి రాలేదు. హనుమంతుడే రాముని ఆశాబంధం. మొదలే చిక్కిపోయినది రాముని శరీరం హనుమంతుని రాక ఆలస్యమయ్యే వరకు అతని ముఖం, రోదించినట్టు కనిపించింది. రాముడు సీతను పొందాలనే ఆశకు ఆలంబనం హనుమంతుడే. అతడే రాకపోయినప్పుడు రాముడేమవుతాడు? కృశించక దుఃఖించక ఎలావుంటాడు!

భిజ్జఇ ఝణ్ణావి తణూ అట్టిఅవాహాం పుణో పరుణ్ణం వ ముఖమ్,
రామస్స ఆరుస్సంతే ఆసాబంధే వ్వ చిరణిగ్గఏ హణుమంతే.

(సేతుబంధం 1–30)

(క్షీయతే తనూ పి తనుః
అస్మిత బాష్పం పునః ప్రరుదితమివ ముఖమ్,
రామస్య అదృశ్య పరాణే
ఆశాబంధే ఇవ చిరనిర్గతే హనుమతి.)

## 2. భుజంగవలయం :

మనదేశంలో శైవమతం అతి ప్రాచీనమైనది. కనుక శైవ కథలుగాని శివలీలలుగాని ఒకరు మరొకరి నుంచి తీసుకొన్నారనడం అంత ఉచితం కాకపోయినా, ఒక నిర్దిష్ట క్రియా విశేషమో, పదబంధమో ముందువారు చెప్పినవి తర్వాతి వారి రచనలలో కనిపించినప్పుడు మనదృష్టి కొంచెం ఆగుతుంది. కాళిదాసు మేఘ సందేశంలో ఇలా వర్ణించాడు:

హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా
క్రీడాశైలే యది స విచరేత్ పాదచారేణ గౌరీ,
భంగీ భక్త్యా విరచితవపుః స్తంభితాంతర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ.

(మేఘ పూ–64)

యక్షుడు మేఘునికి చెబుతున్నాడు: ఓ మేఘుడా కైలాస పర్వతం మీద శివపార్వతులు క్రీడాపర్వతంమీద విహరిస్తున్నప్పుడు పార్వతి భయపడుతుందని తనచేతి భుజగవలయాన్ని తీసి కింద పెట్టి గౌరి చేయి పట్టుకుని క్రీడా పర్వతాన్ని అధిరోహించడానికి యత్నించదలిస్తే అవుడు నీవు ముందుగానే వెళ్లి నీలోని నీటినంతా లోపలే పెట్టుకొని గౌరీదేవి మణితటాలు ఎక్కడానికి అనువుగా నిన్ను మెట్లు మెట్లుగా వంపులు వంపులుగా మార్చుకో.

కాళిదాసు భుజగవలయం గాథాసప్తశతిలోని వాసుకి కంకణం తప్ప మరేమీకాదు. దానిలోని వర్ణన ఇది :

పాణిగ్రహణ సమయంలోనే శివుని చేతి వాసుకి కంకణం చూచి పార్వతి భయపడుతుంది. అది గ్రహించి శివుడు వాసుకి కంకణాన్ని దూరంగా విసిరిపారేశాడు. దానితో పార్వతి చెలికత్తెలు తెలుసుకొన్నారట ఆమెసౌభాగ్యం, పతిప్రేమ ఎలాటివని. పెళ్లినాడే ఇలావుంటే, తర్వాతి సంగతి చెప్పాలా !

పాణిగ్గహణే చ్చియ పవ్వఈఎ ణాఆం సహీహిఁ సోహగ్గమ్,
పసువఇణా వాసుఇ కంకణమ్మి ఓసారిఏ దూరమ్, (1–69)
(పాణి గ్రహణ ఏవ పార్వత్యా జ్ఞాతం సఖీభిః సౌభాగ్యమ్,
పశు పతినా వాసుకి కంక ణే అపసారితే దూరమ్.)

ఈ వాసుకి కంకణం పాణిగ్రహణం వంటి శృంగార సన్నివేశంలో ప్రయుక్తమైంది గనుక కాళిదాసుదీనిని పాణిగ్రహణానంతరం మరింత మధురంగా పదాలు మార్చి భుజంగవలయంగా గ్రహించి ప్రయోగించాడనవచ్చు.

## 3. అభినవ మధు :

శాకుంతలంలోని ఒక ఘట్టం : శకుంతలాసక్తుడైన దుష్యంతుణ్ని హంస పదిక ఎత్తి పాడుస్తుంది—"ఓ మధుకర, నీవు ఎప్పటికప్పుడు కొత్త కొత్త మధువును వెదుక్కుంటూ పోతుంటావు. మామిడి పూగుత్తిని అంతగా అనుభ వించి ఇప్పుడు కమలవసంలో వసించి సంతృప్తితో మమ్మల్ని మరచిపోయావు".- అని

అహిణవ మహులోలుఓ తుమం
తహ పరిచుంబిఅ చూఅమంజరిమ్,
కమల వసఇమెత్త ణివ్వుదో
మహుఅర విహ్మరిఓసి ణం కహం ?

(శాకుంతలం. 5–1)

(అభినవ మధు లోలుపస్త్వం
తథా పరిచుంబ్య చూతమంజరీమ్,
కమల వసతి మాత్ర నిర్వృతః
మధుకర, విస్మృతోసి అస్మాన్ కథమ్?)

ఇది ప్రాకృత గీతం, హంసపదికలాగే, ఆమ్రేడములాగే ఎంతో మధురంగా వుంది. కాని గాథా సప్తశతి అనుకరణ కావడం మాత్రం తప్పలేదు.

గాథా సప్తశతిలో ఒక ఖండిత నాయిక తన ప్రియుణ్ని ఇలాగే ఉపాలం భిస్తుంది.

"ఓ మధుకరమా, పూర్వం మాలతితో వుంటూ, కృతార్థుడివని భావించు కొంటూ తక్కిన పూవులంటే ఇష్టపడేవాడివి కావు. ఇప్పుడు మాలతి ఫలభార దుర్వి అయింది. కనుక వదలిపెట్టి వెళ్లావు."

తఇఆ అకగ్ఘ మహుఅర ణ రమసి అణ్ణాసు పుప్ఫజాఈసు
బద్ధ ఫలభారగురుఈం మాలఇం ఏణ్హింపరిచ్చఅసి, (1–92)
(తదా కృతార్థ మధుకర నీరమసే అన్యాసు పుష్ప జాతిషు,
బద్ధ ఫల భార గుర్వీం మాలతీ మిదానీం పరిత్యజసి)

పై గాథలోని భావం, కాళిదాసు హంసపదిక ఆవేదనా ఎంతమాత్రమూ అన్యంకావని సహృదయులకు తెలుసు.

### 4. ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః :

దుష్యంతుడు కణ్వాశ్రమంలో శకుంతలను చూచాడు. తనకు ఆమె పరిగ్రహింపదగినదో కాదో అని అనుమానం కలుగుతుంది. అప్పుడు తన అంతఃకరణమే ప్రమాణం అనుకొని సందేహం తొలగించుకుంటాడు.

అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా,
యదార్య మస్యా మభిలాషి మే మనః,
సతాం హి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః.

(శాకుంతలం. 1-21)

"ఆర్యమయిన నా మనస్సు ఈమెను అభిలషిస్తున్నది గనుక ఈమె క్షత్రియునకైన నాకు పరిగ్రహింపదగినదే. ఉత్తములకు ఏ విషయంలో నన్నా సందేహం వచ్చినప్పుడు, అంతఃకరణమే ప్రమాణం."

గొప్ప వారికి సందేహం కలిగినప్పుడు అంతఃకరణమే ప్రమాణమనే భావం గాథాసప్తశతిలోనిదే. గాథాసప్తశతిలో —

తనను తప్పించుకొని తిరుగుతున్న ప్రియుణ్ని ఒక ప్రేమిక ఇలా అంటుంది: "జనం ఎలా అనుకుంటే ఏం! జనం అధిక అలా వుండనీ నీవు నన్ను ఎంతమాత్రం ప్రేమిస్తున్నావో నీకు హృదయమే ప్రమాణం. నీకు నా మీద ఎంతగా స్నేహం తగ్గిపోయిందంటే, నిన్ను ఉపాలంభించడం-తూల నాడడం కూడ తగదు అన్నంతగా."

అచ్ఛఉ తా జణవాఓ హిఅఅం విఅ అత్తణో తుహ పమాణమ్,
తహ విం సి మందణేహో జహ ణ ఉపాలంభ జోగ్గోసి. (3-1)
(అస్తుతావ జనవాదః హృదయమే వాత్మనస్తవ ప్రమాణమ్,
తథా త్వమసి మందస్నేహః యథా నోపాలంభయోగ్యోసి.)

నీ హృదయమే నీకు ప్రమాణం - అనే సామాన్యమైన పలుకుబడిని, నీ మనసు నీకు తెలియదా ?— అన్న సామాన్యాల నానుడిని గాథా సప్తశతి సహజ మందరంగా చెబితే, కాళిదాసు రాజు స్వార్థాన్ని ఏవేవో పెద్ద మాటలతో "గొప్ప వారికి సందేహం ఏర్పడినప్పుడు, అంతఃకరణమే ప్రమాణం" అనే తర్కంతో మేళవించి చెప్పాడు.

### 5. ప్రేమ లేఖ:

శకుంతల దుష్యంతునికి ప్రేమ లేఖ వ్రాస్తుంది. ఈ ప్రేమ లేఖ కేవలం రామాయణ భారతాల నుంచి తీసుకున్నట్టు కనిపించదు — వాటిలో ప్రేమ లేఖ లున్నాయా? ఆదర్శ ప్రేమికుడైన రాముడు హనుమంతునితో ఒక చీటి వ్రాసి

పంపవచ్చు గదా లంకకు ! పంపలేదు. ప్రేమ మూర్తులయిన నలదమయంతులలో సావిత్రీసత్యవంతులలో, రురు ప్రమద్వరల ప్రేమ లేఖలు వ్రాసుకొన్నట్టు భారతంలో లేదు. రుక్మిణి కూడ అంతే, పల్లెటూరి పిల్లలాగ తన పురోహితునికి చెప్పిపంపుతుంది. లలిత విస్తరంలో తనకు ఇలాటి లక్షణాలుగల కన్య కావాలని గౌతమ సిద్ధార్థుడు పురోహితుని చేత ఒక లేఖ వ్రాసి పంపినట్టు దానికి యశోధర సమాధానం వ్రాసి పంపినట్టు వుంది. కనుక శకుంతల ప్రేమ లేఖ వ్రాయడమనే సన్నివేశానికి [1]గాథాసప్తశతిలోని గాథలే కారణమయివుంటాయి.

ఒక విరహిణి ప్రియుడికి జాబు వ్రాయ బూనుకుంటుంది. వ్రేళ్ళు చెమర్చి లేఖిని జారిపోతుంది. వ్రాతకూడ సరిగా కుదరదు. "స్వస్తి అనే వ్రాయలేక పోతున్నానే ప్రియసఖి, ఏమి వ్రాయను?" అని సఖిని అడుగుతుంది.

వేవిర సిణ్ణ కరంగులి పరిగ్గహా క్ఖలిఅ లేహణీ మగ్గే,
సొత్థి చ్చిఅ ణ సమప్పఇ పిఅసహి లేహమ్మి కిం లిహిమో ! (3-44)
(వేపనశీల స్విన్న కరాంగులీ పరిగ్రహస్ఖలిత లేఖనీ మార్గే,
స్వస్త్యేవ న సమాప్యతే ప్రియసఖి లేఖే కిం లిఖామః!)

ఈ గాథలోని వేవిర అనే పదానికి వేపశీల అని ఛాయ వ్రాశారు పూర్వులు. వేవిరమంటే స్వేదనశీలం అనడానికన్నా, స్వేదం అని నేను గ్రహిస్తాను. ఇది దేశి పదం. తెలుగులో బుట్టువులలో వేర్పం, వేప్పం, వెవరు, జెవరు అని స్వేద పర్యాయాలు. వేర్చిందు అని నన్నెచోడడు ప్రయోగించాడు. జెవరు వేవిరగా మారివుంటుంది.

కాళిదాసు ఈ లేఖ రచనా కల్పననేగాక ఈ గాథపదాలను కూడ ప్రకరణాంతరంలో ప్రయోగించడం చూడగా, గాథాసప్తశతిని చదివి వుంటాడనే అనిపిస్తుంది. దుష్యంతుడు శకుంతలా విరహ తాపోపశమనార్థం శకుంతల చిత్రం గీయదలచినప్పుడు చిత్రం అంచులలో చెమర్చిన తన వ్రేలి గుర్తులను ప్రస్తావిస్తాడు "స్విన్నాంగుళి వినివేశో రేఖాప్రాంతేషు దృశ్యతే" అని స్విన్నాంగుళిని ప్రయోగించాడు[2].

## 6, తిప్పుతున్న ముఖం :

దుష్యంతుడు శకుంతలను ముద్దుపెట్టుకోలేకపోతినే అని చింతిస్తాడు. "పెదవులపు ముద్దు పెట్టుకోవాలనుకున్నాను. వ్రేళ్ళు అడ్డు పెట్టింది. వద్దు వద్దు అంటూ గింజుకుంటూ మరింత అందంగా కనిపిస్తున్న ముఖం ఎలాగో పైకి ఎత్తాను. పెదవి అందకుండా ముఖం తిప్పసాగింది. దట్టమైన కనురెప్పలు-ముద్దు పెట్టుకోలేకపోయాను". అని వాపోతాడు.

ముహురంగుళి సంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లబాభిరామమ్,
ముఖ మంస వివర్తి పక్ష్మలాక్ష్యాః
కథ మప్యున్నమితం న చుంబితం తు .

---

1. శాకుంతలం 3-15
2. ,, 6-15
3. ,, 3-33

భావం గాథా సప్తశతిలోనిది. ఒక ప్రియుడు తన ప్రియురాలిని బలవంతంగా ముద్దు పెట్టుకుంటున్నప్పటి అనుభూతిని ఇలా స్మరిస్తాడు: నేను ప్రియురాలిని బలవంతంగా ముద్దు పెట్టుకొనే ప్రయత్నం చేశాను. ఆమె నాకు అవకాశం ఇవ్వకుండా ముఖం అటూ ఇటూ తిప్పింది. అలకలు అటూ ఇటూ కదలాడుతూ తుమ్మెదలు ముసిరిన కమలంలాగ వుంది ముఖం.

సరిమో సే గహిఅహార ధుఅ సీస పహోలిరాలఅఉలిఅమ్,
వయణం పరిమల తరలిఅ భమరాలి ప్రఇణ్ణ కమలం వ. (1-78)
(స్మరామః తయా గృహీతాధరధుత శీర్ష ప్రఘూర్ణనశీలాలకాకులితం,
వదనం పరిమల తరలిత భ్రమరాళి ప్రకీర్ణ కమల మివ.)

గాథాసప్తశతిలోనేమో నాయకుడు ప్రియురాలిని గట్టిగా ముద్దు పెట్టుకుంటాడు. విడిపించుకోడానికి తల అటూ ఇటూ ఊపింది నాయిక; ముంగురులు అందంగా వూగిసలాడాయి. కాళిదాసు ఈ గాథ పూర్వార్థం భావం పెంచి మధురాతి మధురం చేశాడు.

## 7. కండూయనం :

శివతపోభంగానికి మన్మథుడు అన్ని ఏర్పాట్లూ చేస్తాడు. చరాచర ప్రపంచమంతా శృంగార రాగరంజిత మవుతుంది. గండుతుమ్మెద వెంట తుమ్మెదను అనుసరిస్తూ, ఒకే పుష్పపాత్రలో మధువును బువ్వంబంతిగా త్రాగుతుంది. మగ జింక తన కొమ్ముతో ఆడ జింకను గోముగా కోరాడుతుంది. ఆ ఆడజింక దాని తాకిడికి చొక్కి కన్నులు మూసుకొంది.

"మధు ద్విరేఫః కుసుమైక పాత్రే
పపౌ ప్రియాం స్వాం అనువర్తమానః,
శృంగేణ చ స్పర్శ నిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః."

(కుమార సంభవం. 3-36)

ఈ శ్లోకం ఉత్తరార్థంలోని భావం గాథా సప్తశతిలోని ఒక గాథకు అనుకరణమే. ఒక భూస్వామి పశువుల కొట్టంలో ఎన్నో ఆవులు, ఎద్దు వున్నాయి. వాటిలో ఒక కొవ్వెక్కిన దుడుకు ఎద్దు ఉంది. దాని కొమ్మున ఒక ఆవు తన కంఠాన్ని రాచుకొంటున్నది. "దాని సౌభాగ్యం చూచావా? ఎంత నిర్భయంగా తన గొప్పదనం చాటుకొంటున్నదో!" అని ఒక నాయిక మరొకతెతో సాభిప్రాయంగా తెలుపుతుంది.

పాఅడిఅం సోహగ్గం తంబాఏ ఉఅహ గోట్ఠమజ్ఝమ్మి,
దుట్ఠ వసహస్స సింగే అచ్ఛిఉడం కండుఅంతీఏ. (5-60)
(ప్రకటితం సౌభాగ్యం గవా పశ్యత గోష్ఠమధ్యే.
దుష్టవృషభస్య శృంగే అక్షిపుటం కండూయంత్యా.)

ఇక్కడ అవు తనకంటిని ఎద్దుకొమ్మున రాచుకుంటే, కాళిదాసు శృంగార రసవ్యంజనకోసం జింకల జంటను గ్రహించాడు. ఈ గోముగా గోకడాన్ని కాళిదాసు గ్రహించాడనడం స్పష్టం.

ఈ భావాన్ని కాళిదాసు శాకుంతలంలోను గ్రహించాడు. విరహాతురుడైన దుష్యంతుడు తాను గీయదలచిన శకుంతల బొమ్మను విదూషకునికి వివరిస్తున్నప్పుడు వెంటిజింక తనఎడమ కన్నును పోతుజింకకొమ్మున గోకుకుంటున్నట్టు గీస్తానంటాడు.

> కార్యా సైకతలీన హంసమిధునా స్రోతోవహా మాలినీ
> పాదాస్తాః పరితో నిషణ్ణ హరిణాః గౌరీగురోః పావనాః,
> శాఖాలంబిత వల్కలస్య చ తరో నిర్మాతు మిచ్ఛామ్యధ
> శృంగే కృష్ణమృగస్య వామనయనం కండూయమానాం మృగీం[4].

"నెచ్చెలీ నేను మాలినీ నదిని, దాని ఇసుకదిబ్బలో వాల్కున్న హంసల జంటను వ్రాయదలచాను. నదికి వెనుక పావన హిమాలయపర్వతం అడివారం, అడివారంలో ఎటు చూచినా పడుకున్న జింకలు గీయదలచాను. నారచీరలు ఆరవేసిన ఒక చెట్టుకింద ఒక జింక దుప్పికొమ్ముకు తన ఎడమకంటిని గోకుతున్నట్టు కూడ బొమ్మ గీయదలచాను." అంటాడు.

కుమారసంభవంలో మృగమే చొరవతీసుకోగా, శాకుంతలంలో మృగే, గాథాసప్తశతిలోని ఆవులాగ చొరవతీసుకుంటుంది.

## 8. బాష్పం :

కన్నులలో కన్నీరు ఏ కారణంతో నిండినా, దృష్టి ప్రసరించదు. మేఘసందేశంలో యక్షుడు తన ప్రియురాలికి ఇలా సందేశం పంపుతాడు:-"ఓ ప్రియురాలా! నీవు ఒకనాడు కోపంచేసుకొన్నావు. ప్రణయకుపితురాలైన నీ బొమ్మను నేను అడవి మట్టిరంగులతో బండమీద గీచి, నీ కాళ్ళ మీద (బొమ్మ కాళ్ళమీద) పడుదామని, క్షమించమని కోరుదామని అనుకొని కాళ్ళమీద పడేలోగా కళ్ళ నీరు కుక్కుకొని వస్తాయి; దృష్టిని అడ్డగిస్తాయి. ఏమీ కనిపించదు. కనుక ఆ విధంగానూ నీ బొమ్మను తాకలేకపోతాను. చూచావా, కృతాంతుని లీల! అలాగూ, మన సమాగమం సహించడు."

> త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయాః
> ఆత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్,
> అస్రైస్తావ న్ముహురుపచితై ర్దృష్టిరాలుప్యతే మే
> క్రూర స్తస్మి న్నపి న సహతే సంగమం నౌ కృతాంతః.

(మేఘ-ఉత్తర-47)

---

4. శాకుంతలం—6—7

ఈ సుందరమైన బాష్పావరుద్ధ దృష్టికి మూలం గాథాసప్తశతిలో ఉంది. ఒక విరహిణి అవస్థను దూతి ప్రియునికి ఇలా వివరిస్తున్నది:—

"ఓ నాయకుడా, నీ విరహం నాయికకు నిద్రపట్టనివ్వడం లేదు. నిద్రలేక పోవడంవల్ల స్వప్నం రాదు. కనుక నిన్ను స్వప్నంలోనూ చూచే ఆశలేదు. నీవు హఠాత్తుగా ఎదురుపడితే, చూచి వినోదిద్దామూ అంటే, కన్నులు కన్నీటితో నిండిపోయి చూపు అడ్డగించడం వల్ల అదికూడ సంభవించడంలేదు".

తుహ విరహుజ్జాగరఓ సివిణే వి ణ దేఇ దంసణసుహాఇం,
వాహేణ జహాలోఅణ వినోఅణం సే హఅం తంపి. (5-87)
(తవ విరహోజ్జాగరకః స్వప్నేపి న దదాతి దర్శనసుఖాని,
బాష్పేణ యదాలోకన వినోదనం తస్యా హృతం తదపి.)

ఈ గాథలోని ఉత్తరార్ధ భావాన్ని కాళిదాసు స్వీకరించాడనడం స్పష్టం కదా!

## 9. అశిక్షిత పటుత్వం :

కాళిదాసు స్త్రీ పాత్రలను తన కాలపు రాజరికం దృష్టితో చూశాడు; అలాగే తీర్పాడు అనేది విషయాంతరం. స్త్రీలు సహజ కపటులని, జాణలని స్త్రీ జాతి మొత్తం మీద ఒక విసురు విసిరాడు, దుష్యంతుని ద్వారా. దుష్యంతుడు అంగుళీయకం కోల్పోవడం వల్ల నష్టస్మృతుడై శకుంతల ఎన్ని ఆనవాళ్ళు చెప్పినా నమ్మక నిరాకరిస్తూ, "ఇలాటి జాణతనం స్త్రీలకు వెన్నతోనె పెట్టిన విద్య. మానుషుల విషయంలోనే కాదు, పక్షులలోను పెంటి జాతికీ ఈ జాణతనం వుంది; కోకిలమ్మ తన గుడ్లను కాకి గూటిలో పెట్టి పొదిగించదూ?" అని ఎత్తి పొడుస్తాడు.

స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః,
ప్రాగంతరిక్ష గమనాత్ స్వ మపత్యజాతం
అన్యైః ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి.[5]

గాథా సప్తశతి ప్రసంగాంతరంలో మహిళల చాతుర్యాన్ని వర్ణిస్తూ, "సురత కేళిలో మహిళలకు ఎవరు ఉపాధ్యాయుడు? స్నేహానుబంధంతో అందరూ తెలినివి అన్నీ నేర్చుకుంటారు." అని ఒక విలాసిని చాతుర్యాన్ని ఒకరె తన సఖితో అనిపిస్తుంది.

బహువిహ విలాస రసిఏ సురఏ మహిలాణ కో ఉవజ్ఝాఓ,
సిక్ఖఇ అసిక్ఖిఆఇం వి సవ్వో ణేహాణుబంధేణ. (5-77)
(బహువిధ విలాసరసికే సురతే మహిళానాం క ఉపాధ్యాయః,
శిక్ష్యతే అశిక్షితాన్యపి సర్వః స్నేహానుబంధేన.)

---

5. శాకుంతలం 5-22

మహిళలు రహస్య విషయాలను గురువు లేకుండానే నేర్చుకొంటారని శృంగార సందర్భంగా చెప్పినదానిని కాళిదాసు సర్వసామాన్య సూత్రం చేశాడు.

## 10. అళిక నేత్రం :

కాళిదాసు పార్వతీపరమేశ్వరుల కేళీవిలాసాలు వర్ణించాడు. ఆ వర్ణనను బట్టే ఖజురాహో (ఖర్జూరవాటి) శిల్పాలు మలచబడ్డాయేమోననుకుంటాను. శివుడు రహస్యకేళిలో పార్వతి వంటిమీది వస్త్రాన్ని లాగి పారవేశాడు. ఆమె సిగ్గుతో ఏమి చేయడానికీ తోచక రెండు చేతులతోను ఆయన రెండు కన్నులనూ మూసివేస్తుంది. కాని శివునికి మూడోకన్ను వుంది. దానితో ఆయన చూచాడు. తన నగ్నత్వం కప్పిపుచ్చుకోడానికి తను చేసిన ప్రయత్నం వ్యర్థం కావడం వల్ల అవశురాలై ఉండిపోయింది పార్వతి.

"శూలినః కరతలద్వయేన సా
సన్నిరుద్ధ్య నయనే హృతాంశుకా,
తస్య పశ్యతి లలాటలోచనే
మోఘయత్న విధురా రహస్యభూత్."[6]

గాథా సప్తశతికవి ఈ సందర్భాన్ని మరీ చక్కగా వర్ణించాడు. రతికేళిలో శివుడు పార్వతి చీర ఒలిచివేశాడు. ఆమె సిగ్గుతో అతని రెండు కండ్లూ రెండు చేతులతో కప్పింది. మూడోకంటిని ముద్దుతో మూసింది.

రఇకేలి హిఅ ణిఅంసణ కరకిసలయ రుద్ధ ణఅణజుఅలస్స,
రుద్దస్స తఇఅ ణఅణం పవ్వఇ పరిఉంబిఅం జఅఇ. (5-55)
(రతికేళీ హృత నివసన కరకిసలయరుద్ధ నయన యుగలస్య,
రుద్రస్య తృతీయ నయనం పార్వతీ పరిచుంబితం జయతి.)

కాళిదాసు పార్వతీదేవిని దిస్సమొలగానే ఉంచదలచాడేమో గనుక ఈ గాథలోని అళిక వదన చుంబనాన్ని వదలి తక్కినది గ్రహించాడు యథాతథంగా.

## 11. బలాకా పంక్తి :

వర్షాకాలంలో కొంగలు బారులు కట్టి ఎగురుతుంటాయి. దానిని గాథా సప్తశతి జానపదకవి "కాలుడనే కార్తాంతికుడు మొయిలు గప్పిన గగనంలో గ్రహగతితెలియక లెక్కలు కట్టడానికి పలక మీద గీచిన హోర-గీతలాగ ఉంది" అన్నాడు.

---

6. కుమారసంభవం 8-7

కత్థ గఆం రఇ బింబం కత్థ పణట్ఠాఓ చంద్రతారాఓ,
గఅణే బలాకా పంతిం కాలో హోరం వ్వ కడ్ఢేఇ. (5–85)
(కుత్ర గతం రవి బింబం కుత్ర ప్రణష్టాః చంద్రతారకాః,
గగనే బలాకా పంక్తిం కాలో హోరా మివాకర్షతి.)

ఈ కొంగల బారును కాళిదాసు స్వీకరించాడు. యక్షుడు మేఘునికి అలకానగర మార్గం చెబుతూ ఇలా అంటాడు "ఓ మేఘుడా, నీ ప్రయాణానికి మంచి శకునాలవుతున్నాయి. అనుకూల వాయువులు నెమ్మదిగా వీస్తున్నాయి నీ సజాతి అయిన అందమైన చాతకం తియ్యగా కూస్తూంది. కొంగలు బారులుకట్టి ఎదయ్యేకాలమనే సంతోషంతో ఎగురుతూ, కనుల విందుగా నిన్ను చూస్తాయి."

మందం మందం నుదతి పవనశ్చానుకూలో యథా త్వాం
వామ శ్చాయం నదతి మధురం చాతక స్తే సగంధః,
గర్భాధానక్షణ పరిచయాన్నూన మాబద్ధ మాలాః
సేవిష్యంతే నయన సుభగం ఖే భవంతం బలాకాః

(మేఘసం-పూర్వ-9.)

కాళిదాసు గ్రామసీమల సహజ సౌక్కయిన జానపద కవితా పుంజం గాథా సప్తశతినుంచి బలాకాపంక్తిని గ్రహించి మరింత మధురంగా చిత్రించాడు.

## 12. త్రివళి సోపానం :

కాళిదాసు కుమారసంభవంలో పార్వతీదేవి నడుమును వర్ణిస్తూ, పొట్టమీది ముచ్చటయిన మూడు ముడుతలను నవయౌవనం దేహం మీదికి అధిరోహించడానికి మన్మథుడు పెట్టిన నిచ్చెనమెట్లవలె ఉన్నవని ఉత్ప్రేక్షించాడు :

మధ్యేన సా వేది విలగ్న మధ్యా
వళిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపాన మివ ప్రయుక్తమ్.

(కుమార సంభవం. 1-39)

ఈ సోపాన పంక్తి గాథాసప్తశతి నుంచి గ్రహించిందే. దానిలోని ఈ వర్ణన మరీ అందంగా వుంది :

బంగారు తీగ వంటి యువతి. ఏ కారణంగానో చెమర్చింది. ఆ చెమట పొట్ట మీది ముడుతలలో మరీ ముత్యాల కడ్డీలలాగ కన్పిస్తున్నది. దానిని కవి ఉత్ప్రేక్షించాడు అపూర్వంగా. లోపలి లావణ్యం సన్నని దేహంలో ఇముడక పొట్ట మీది ముచ్చటైన ముడుతలు-త్రివళి-అనే మెట్ల నుంచి వెలుపలికి దిగి వస్తున్నదా! - అన్నట్టుంది.

సేఅచ్ఛలేణ పేచ్ఛహ తణుఏ అంగమ్మి సే అమాఅంతమ్,
లావణ్ణం ఓసరఇ తివలీ సోవాణ వత్తీఏ. (3-78)
(స్వేదచ్ఛలేన పశ్యత తనుకేఽఙ్గే తస్యా అమాత్,
లావణ్య మపసరతీవ త్రివలీ సోపాన పంక్తిభ్యాం)

గాథాసప్తశతి త్రివళీ సోపాన పంక్తి లావణ్యం లోపలి నుంచి వెలుపలికి దిగి రావడానికి వేసింది. కాళిదాసు దీనిని నవయౌవనంపైకి ఎక్కడానికి వేశాడు.

## 13. దీపశిఖ :

రఘువంశంలో ఇందుమతీ స్వయంవర ఘట్టం. సూపర్ బజారులో వస్తువులను చక్కగా అమర్చినట్టు దేశంలోని రాజులందరూ స్వయంవర మండపంలో ప్రదర్శన వస్తువులుగా ఆశీనులై వున్నారు. ఇందుమతిని సునంద అనే పరిచారిక ప్రతి రాజు వద్దకూ పిలుచుకొని వెళ్తుతుంది. ఇందుమతి సంచారిణి ఐన దీపశిఖవలె_నడదీపంవలె ఏ రాజు దగ్గరకి వెళ్ళిందో అప్పుడు ఆ రాజు ఉత్సాహంతో వెలిగాడు; ఆమె అతనిని దాటిపోగానే నిరుత్సాహంతో నల్లబడిపోయాడు. రాత్రిపూట రాజమార్గంలో దీపం చేతబట్టుకొని ఎవరైనా నడుస్తున్నపుడు, ఆ దీపకాంతి పడిన మేడో, అంగడో క్షణం సేపు వెలుగుతుంది; దీపం దాటిపోగానే నల్లగా కనిపిస్తుంది, చీకట్లో. ఇలా రాజులవరుసను నరేంద్ర మార్గాట్టంతో పోల్చాడు కాళిదాసు. ఇందుమతిని నడదీపంతో పోల్చాడు. ఈ అపూర్వమైన పోలికతోను, ఇతరత్రా దీపాన్ని వర్ణించడంతోను కాళిదాసుకు "దీపశిఖా కాళిదాసః" అనే ఖ్యాతి వచ్చింది.

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం ప్రతీయాయ పతింవరా సా,
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణ భావం స స భూమిపాలః.

(రఘువంశం 6-67)

కాని, ఈ ఖ్యాతికి మూలాలు గాథాసప్తశతిలో ఉన్నాయి. దానిలో దీపవర్ణనలు విధవిధాలుగా ఉన్నాయి.

(1) వసఇ జహిం చేఅ ఖలో పోసిజ్జంతో సిణేహదాణేహిం,
తం చేఅ ఆలఅం దీఅఓ వ్వ అఇరేణ మఇలేఇ. (2-36)
(వసతి యత్రైవ ఖలః పోష్యమాణః స్నేహదానైః
తమేవాలయం దీపక ఇవాచిరేణ మలినయతి.)

కవి స్నేహ పదశ్లేషతో దుష్టుణ్ని దీపంతో పోల్చాడు. సాధారణంగా దీపాన్ని వెలుగుకూ, జ్ఞానానికీ, మంచికి పోల్చడం సంప్రదాయం. కాని, ఈ గాథా కవి కీర్తిరాజు (కిత్తిరాయో) సంప్రదాయవిరుద్ధంగా దీపాన్ని దుష్టునితో పోలుస్తాడు. దుష్టుణ్ని స్నేహంతోను, దానంతోను ఎంతగా ఇంట్లో పెట్టుకొని పోషించినా, స్నేహదానంతో (నూనెపోయడంతో) పెట్టుకున్న దీపం లాగ ఇంటిని మలినం చేస్తాడు-చెడ్డపేరు తెస్తాడు.

ఒక ఇల్లాలు సందెదీపం పెడుతున్నది. భర్త వ్యాపారంకోసం విదేశం వెళ్ళాడు. అప్పుడు ఇల్లాలికి జ్ఞాపకం వచ్చాడు. కళ్ళు కన్నీటితో నిండి ధార గట్టాయి. ఆ కన్నీటిధారతో దీపం ఆరిపోతుందేమోనని ఆమె తన ముఖం అటు తిప్పి దీపం పెడుతున్నది.

(2) పిఅ సంభరణ పలోట్టంత వాహంధారా నివాఅ భీఆఏ,
దిజ్జఇ వంకగ్గీవాఏ దీవఓ పహిఅ జాఆఏ. (3-22)

(ప్రియ సంస్మరణ ప్రలుఠద్బాష్ప ధారానిపాతభీతయా,
దీయతే వక్రగ్రీవయా దీపకః పథిక జాయయా.)

ఒక ప్రియుడు తన ప్రియురాలిని సమాధాన పెట్టడంకోసం ఆమె కాళ్ళ మీద పడ్డాడు ఏకాంతంలో. అక్కడ దీపం మిణుకుమిణుకు మంటూంది. ఆ ప్రియురాలి చెలికూడ వుంది అక్కడే. "అత్తా ఏమని చెప్పను! ఇప్పుడూ నా భర్త, నా చెలికత్తె నన్ను ఆట పట్టిస్తున్నారు. ఆనాటి సంగతిని చెబుతూ. భర్త నా కాళ్ళ మీద పడ్డాడు. నా చెలికత్తె ఇదే అదను కదా అని దీపపు వత్తిని పైకి ఎగసన దోసింది."

(3) అజ్జమ్మి హాసిఆ మామి తేణ పాఏసు తహ పడంతేణ,
తీఏవి జలంతిం దీవవత్తి మబ్భుణ్ణమంతీఏ. (8-64)

(అద్యాస్మి హాసితా మాతులాని తేన పాదయోః పతతా,
తయాపి జ్వలంతీం దీపవర్తి మభ్యుత్తేజయంత్యా.)

మంచి యౌవనంలో ఉన్నవారు రాత్రంతా వివిధ భంగిమలలో, వివిధ కరణాలతో క్రీడించారు. దీపం దాన్నంతా చూస్తూ, నూనె అయిపోవటంకూడ గుర్తించలేదట.

(4) దట్ఠూణ తరుణసురఅం వివిహవిలాసేహిం కరణసోహిల్లమ్,
దీఓ వి తగ్గఅమణో గఅం పి తేల్లం ణ లక్ఖేఇ. (6-47)

(దృష్ట్వా తరుణసురతం వివిధ విలాసైః కరణశోభితమ్,
దీపోపి తద్గతమనాః గత మపి తైలం న లక్షయతి.)

ఇక ముఖ్యమైన నడయాడే దీపశిఖ, అపూర్వం లేక దుడుకుతనంతో రాత్రిళ్ళు ధైర్యంగా తిరిగే ఒక సుందరిని ఒక అనుభవశాలిని మందలిస్తున్నది: "అమ్మాయీ నీకు చౌర్యరతమంటే ఇష్టం ఎక్కువ. దానికోసమని చీకట్లో

తిరుగకు. నీవు పచ్చగా అందంగా వున్నావు. దట్టమైన చీకట్లో దీపశిఖ కనిపించినట్టు-వెలుగుతున్న తిళ్లిక కనిపించినట్టు బాగా కనిపిస్తావు; గాఢాంధకారంలోను కొట్టవచ్చినట్టు అందరికండ్ల బడుతావు."

(5) చోరిఅ రఅ సద్ధాలుఅ మా పుత్తి బ్భమసు అంధఆరమ్మి।
అహిఅఅరం లక్ఖిజ్జసి తమఃరిఅ దీవసిహావ్వ. (5-15)
(చౌర్యరత శ్రద్ధాళికే మా పుత్రి భ్రమాంధకారే,
అధికతరం లక్ష్యసే తమోభృతే దీపశిఖేవ.)

చీకటిలో దీపశిఖవలె కనిపిస్తావు. వెళ్ళవద్దు. అన్న పైగాథలోని భావం పొడిగించే కాళిదాసు 'సంచారిణీ దీపశిఖ' అనడం అని సాహిత్యజ్ఞు లెవరైనా గ్రహించవచ్చు.

ఈ దీపశిఖను కాళిదాసు సమకాలికుడైన సేతుబంధకారుడైన ప్రవరసేనుడుకూడ ప్రయోగించాడు.

## 14. సత్పురుషులు :

శాకుంతలం పంచమాంకంలో దుష్యంతుని ప్రశంసించే ఘట్టంః చెట్లు పండ్ల బరువుతో వంగుతాయి. బాగా నీరు నిండిన మేఘాలు క్రిందికి వ్రేలాడుతుంటాయి. అలాగే ఐశ్వర్యం వచ్చినప్పుడు గొప్పవారు గర్వపడరు. ఇది పరోపకారుల స్వభావం అని ప్రశంస.

భవంతి నమ్రాః తరవః ఫలోద్గమైః
నవాంబుభిః దూరవిలంబినో ఘనాః,
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్.

ఈ శ్లోకంలోని భావంలో కొంత గాథాసప్తశతి నుంచి గ్రహించబడింది. గాథాసప్తశతిలో సత్పురుషుల ప్రశంసా సందర్భంలోనే ఇలాటి గాథ ఉంది.

ఫలసంపత్తీఅ సమోణఆఇఁ తుంగాఇఁ ఫలవివత్తీఅ,
హిఅఆఇ సుపురిసాణం మహాతరూణం వ సిహరాఇ. 3-82)
(ఫలసంపత్త్యా సమవనతాని తుంగాని ఫల విపత్త్యా,
హృదయాని సుపురుషాణాం మహాతరూణామివ శిఖరాణి.)

పెద్ద మానులు పళ్ళు నిండుగా వున్నప్పుడు వంగివుంటాయి. పళ్ళు లేనప్పుడు లేచి నిటారుగా వుంటాయి. గొప్పవారి మనసులు కూడ ఐశ్వర్యకాలంలో వినయంగా వుంటాయి. ఐశ్వర్యంలేక పోయినా నీచపు పనికి పాల్పడక ఉన్నతంగా ఉంటాయి.

ఈ భావం పై కాళిదాసు శ్లోకంలోని భావానికి మూలం కావచ్చు ననడంలో ఎవరికీ అనుమానం వుండదు.

ఇవే కాక విరహోత్కురాబద్ధ, విరహశయన, కంటకిత కపోల, గోత్రస్ఖలన, మంగళకలశ, కుడ్య లేఖన, గృహద్వారతోరణ, ఏకవేణి, నవమాలిక, అంగణ (మందార) వృక్ష, ముఖ విధ్మాపన మొదలయిన పద బంధాలను, భావాలను కాళిదాసు గాథా సప్తశతినుంచి గ్రహించాడు.

ఇక దోహద ప్రక్రియలు-అశోక దోహదం, కురవక దోహదం మొదలైనవి గాథాసప్తశతికి ముందున్న సాహిత్యంలో కనిపించవు. అథర్వవేద వృక్షాయుర్వేదాలలో దోహదాల ప్రశంస కొంత వుంది. కాని ప్రాకృత సాహిత్యంలో-ముఖ్యంగా గాథాసప్తశతిలో ఈ దోహద క్రియలు కోకొల్లలు. వీనిని కాళిదాసు మొదలయిన రాజరంజక కవులు గ్రహించి వుంటారు.

భావుకతకు, సహజసుందర భావప్రకటనకు ప్రతి దేశకవులూ నేడు జానపద ప్రజారంజక కవుల వైపు అర్రులు చాచుతున్నారు. ఆ కాలంలోనూ ఇది సంభవించి వుంటుంది. అజ్ఞాత జానపద కవులకు రాజరంజక కవులు ఎంతగా కృతజ్ఞులయి వుండాలో ఊహించలేను. కాళిదాసుం ఈ వాదానికి అపవాదం కాదు.

[వరంగల్ స్నాతకోత్తర విద్యాకేంద్రంలో (నేటి కాకతీయ విశ్వవిద్యాలయంలో) 1974 మార్చి 22, 23 తేదీలలో చదివిన ఎక్స్‌టెన్షన్ ఉపన్యాస వ్యాసాలలో రెండవది.]

# గాథాసప్తశతిలో సుభాషితాలు

"పెద్దల మాట–సద్దిమూట" అనేది అందరెరిగిన సామెత. పెద్దలు చెప్పిన హితోక్తి సద్దిమూటలాగ సమయానికి వినియోగపడుతుందని దీని తాత్పర్యం. ఈ పెద్దలు అనుభవం పండినవారు. కనుక వారి మాట అనుభవామృతం. అలాటి అనుభవామృత గుళికలు గాథాసప్తశతిలో కోకొల్లలు. వాటిలో కొన్నిటిని తెలుపుతాను. అవి నేటికీ నిత్యసత్యాలే. దేశకాల వర్తమానాలనుబట్టి సత్యాలుకూడ మారుతుంటాయని, నిత్యసత్యాలనేవే లేవని కొందరి వాదం. కాని, కర్తవ్యం, ప్రేమ, స్నేహం, దయ–మున్నగునవి నిత్యసత్యాలని, మానవతకు మూలధర్మాలైన ఇవి మారవని నేను భావిస్తున్నాను. ఇక అలాటి సుభాషితాలను పేర్కొంటాను.

## 1. కార్యశీలత :

> ఆరంభంతస్స ధువం లచ్ఛీ మరణం వి హోఇ పురిసస్స,
> తం మరణ మణారంభే వి హోఇ లచ్ఛీ ఉణ నహోఇ. (1–42)
> (ఆరభ్యమాణస్య ధ్రువం లక్ష్మీ ర్మరణం వారభవతి పురుషస్య,
> త న్మరణ మనారంభే పి భవతి లక్ష్మీః పునః న భవతి.)

పనిని ప్రారంభించడంలో మీనమేషాలు లెక్కిస్తున్న వ్యక్తిని ఒక మిత్రుడు ప్రోత్సహిస్తున్నాడు: "మిత్రుడా, ఏపనినైనా ప్రారంభించిన వాడినే విజయలక్ష్మి వరిస్తుంది. అల్లా జరుగకపోతే, మృత్యువయినా వరిస్తుంది. జయమో, పరాజయమో తప్పదు. కాని, పనికి పూనుకోని వాడికీ మరణం తప్పదు; విజయలక్ష్మి అయితే దక్కదు. మరణం ఎప్పటికైనా నిశ్చయం గనుక పని ప్రారంభించి చూడు. అదృష్టముంటే విజయం తప్పదు. లేకపోతే మరణం అందరికి సమానమే".

## 2. అతిపరిచయం :

> అణ్ణ మహిలా ప్రసంగం దే దేవ కరేసు అహ్మ దఇఅస్స,
> పురిసా ఎక్కంతరసా ణహు దోషగుణే విఆణంతి (1–48)
> (అన్యమహిలా ప్రసంగం హే దేవ కుర్వస్మాకం దయితస్య,
> పురుషా ఏ కాంత రసా న ఖలు దోషగుణౌ విజానంతి.)

రెండవది వుంటేనేగాని మొదటి వస్తువు గొప్పదనం మానవులకు తెలీదు. ఇది లోకసహజం. ఒక ఇల్లాలు భగవంతుణ్ణి ఇలా ప్రార్థిస్తుంది:. "ఓ దేవుడా, నా ప్రియుడికి ఇతర స్త్రీలతో పొత్తు కలిగించు. అప్పటికిగాని నా ప్రేమ సంగతి అతనికి తెలియదు. ఒకదాన్నే నమ్ముకున్న వారికి చిరపరిచయంవల్ల దాని గుణ దోషాలు తెలియవు".

### 3. ప్రేమ వైరస్యం :

ప్రేమస్స విరోహిఅ సంఘిఅస్స పచ్చక్ఖ దిట్ఠ విలిఅస్స,
ఉఅఅస్స వ తావిఅ సీఅఅస్స విరసో రసో హోఇ. (1–58)
(ప్రేమ్ణో విరోధిత సంధితస్య ప్రత్యక్షదృష్ట వ్యళీకస్య,
ఉదకస్యేవ తాపిత శీతలస్య విరసో రసో భవతి.)

"మనసు విరిగెనేని మరి యతుకగా రాదు" అన్నాడు వేమన్న. మనసంటే ప్రేమ. "ప్రేమ ఒకసారు విరిగిన పిదప అతకదు. అందులోను తప్పు ప్రత్యక్షంగా కనిపించినప్పుడు అసలే అతకదు. అతికించడానికి ప్రయత్నిస్తే, కాచిచల్లార్చిన నీరు తాగినట్టు ఉంటుంది చప్పగా." అంటుంది ఒక ప్రేమ తత్త్వజ్ఞురాలు.

### 4. ఇష్టోవా శిష్టోవా :

హిఅఅణ్ణఏహిం సమఅం అసమత్తాఇం పి జఇ సుహోవంతి,
కజ్జాఇ మణ్ణే ణ తహా ఇఅరేహిం సమావిఅఇంవి. (1–61)
(హృదయజ్ఞైః సమం అసమాప్తాన్యపి తథా సుఖయంతి,
కార్యాణి మన్యే న తథా ఇతరై స్సమాపితాన్యపి.)

ఇది ఒక మనస్తత్త్వజ్ఞుడు చెబుతున్నమాట. "మన మనసెరిగిన వారితో కలిసి పని చేసినప్పుడు, ఆపనులు పూర్తి కాకపోయినా సంతోషంగా వుంటుంది. మనసెరుగనివానితో పనులు పూర్తి అయినా సంతోషం ఉండదు".

### 5. ఈవిలేని సంతోషం :

పత్తో ఛణో ణ సోహఇ అఇప్పహాఅవ్వ పుణ్ణిమాఅందో,
అంత విరసోవ్వ కామో అసంపఆణోవ్వ పరిఓసో. (1–68)
(ప్రాప్తః క్షణః న శోభతే అతిప్రభాత ఇవ పూర్ణిమాచంద్రః,
అంత విరస ఇవ కామః అసంప్రదానశ్చ పరితోషః.)

గడచిన ఉత్సవాన్ని చివరకు విరసమైన కోరికతో పోల్చిచెబుతున్నాడు కవి. ఏ ఉత్సవమయినా ఎంతో సంబరంతో జరుగుతుంది. గడచిన తర్వాత జనం అలసి పోతారు. ఎక్కడి వస్తువులక్కడ పడివుంటాయి. జనమంతా వెళ్లి పోతారు. అంతా చప్పగా కనపడుతుంది. బాగా తెల్లవారిన పిదప పున్నమ చంద్రుడెలా వెల వెల బోతాడో అలా వెల వెల బోతుంది. చంద్రుడు–పున్నమ చంద్రుడైనా, రాత్రింతా ఎంతో ఆహ్లాదకరంగా వుంటాడు. కాని, తెల్లవారితే, చప్పబడి, తెల్లబారి, ఏదో తెల్లటి మేఘముక్కలాగ కనిపిస్తాడు. అలాగే చివరకు విరసమైన కామం కూడ ఇతరులను సంతోషపెట్టని పరితోషం

బాగ వుంటుంది. మనకు పరితోషమయితే ఇతరులను కూడ ఏ బహుమానంతోనో ఆనందపెట్టాలి. అప్పుడే దాని సార్థకత. అలాటి ఈవి లేనప్పుడు సంతోషం నిస్సార మవుతుంది.

## 6. రెండూ కుదరవు :

కత్తో మిట్ఠం వ బహుళం అ. (1-72)
(కుతో మృష్టం చ బహుకంచ.)

మంచి కావాలి, అది ఎక్కువగాను కావాలి అంటే ప్రపంచంలో లభించదు. తీపివస్తువూ కావాలి, అది ఎక్కువగాను కావాలి అంటే కుదురుతుందా ?

## 7. ఇష్టులు వెళ్లిపోతే :

ణ వి తహ విఏసవాసో దోగ్గచ్చం మహ జణేఇ సంతావమ్,
ఆసంసిఅత్థ విముహో జహ పణఇజణో ణిఅత్తంతో. (1-76)
(నాపి తథా విదేశవాసః దౌర్గత్యం మమ జనయతి సంతాపం,
ఆశంసితార్థ విముఖో యథా ప్రణయిజనో నివర్తమానః)

విదేశవాసం, దారిద్ర్యం అష్టకష్టాలలోనివి. మనస్వి అయిన వాడికి ఇవి రెండూ కూడ అంత చెడ్డవి అని అనిపించవు. ఈ పని ఇతని వల్ల జరుగుతుంది అని వచ్చిన ఇష్టులు తమ అభీప్సితం నెరవేరక తిరిగిపోతే కలిగే కష్టం మొదట చెప్పుకున్న రెండిటికన్నా ఘోరమయింది.

## 8. ప్రేమగతి :

అద్దంసణేణ పేమ్మం అవేఇ అఇదంసణేణ వి అవేఇ,
పిసుణ జణ జంపి ఏణ వి అవేఇ ఏమేఅ వి అవేఇ. (1-81)
(అదర్శనేన ప్రేమాపైతి అతిదర్శనేనాప్యపైతి,
పిశున జన జల్పితే నాప్యపైతి ఏవమేవా ప్యపైతి.)

ప్రేమ పెరగడం, తరగడం విచిత్రంగా వుంటాయని ఒక అనుభవజ్ఞుడు చెబుతున్నాడు. ప్రేమ తరచు చూడక పోతుంది. అంటే ప్రేమగలవారిని తరచు చూస్తూవుండాలి. కాని, తరచు చూస్తూన్నా పోతుంది. కొండెగాళ్లు ఓర్వలేక సమిధలు వేస్తారు. దానితోనూ ప్రేమ పోతుంది. ఇంకా ఆశ్చర్యకరమైన సంగతి ఏమిటంటే, ఏకారణమూ లేకనే పోతుంది.

9. ఎలాపోతుంది? ఈ విషయాన్ని మరొక గాథలోను వివరించాడు కవి :

అద్దంసణేణ మహిలాజణస్స, అఇదంసణేణ ణీఅస్స
ముక్ఖస్స పిసుణజణ జంపిఏణ, ఏమేఅ వి ఖలస్స. (1-82)
(అదర్శనేన మహిళాజనస్య అతిదర్శనేన నీచస్య,
మూర్ఖస్య పిశునజన జల్పితేన, ఏవమేవాపి ఖలస్య.)

తరచు చూడక యోగక్షేమాలు అరయకపోతే మహిళల ప్రేమ పోతుంది. తరచు చూస్తూవుంటే నీచుని ప్రేమ పోతుంది. తరచు చూడడంవల్ల నీచునికి ఈసడింపు కలుగుతుంది. స్వయంగా వివేచన లేని మూర్ఖుని ప్రేమ ఇతరుల చాడీలు వినడంవల్ల పోతుంది. దుష్టుల ప్రేమ ఏకారణమూ లేకుండానే పోతుంది. దుష్టుడు తన అవసరాలను బట్టి, తన తిక్కలను బట్టి అభిమానాలు మార్చుతుంటాడు.

10. ఎవడు ప్రియుడు?

ణూమేంతి జే పహుత్తం కువిఅం దాసా వ్వ జే పసాయంతి,
తేవ్విఅ మహిలాణ పిఆ సేసా సామివ్వి అ వరాకా. (1-91)
(గోపాయంతి యే ప్రభుత్వం కుపితాం దాసా ఇవ యే ప్రసాదయంతి,
తఏవ మహిళానాం ప్రియాః శేషాః స్వామిన ఏవ వరాకాః)

ఒక మహిళా మనస్తత్వజ్ఞుడు భర్తలకు స్త్రీల యెడల ఎలా ప్రవర్తించాలో తెలుపుతున్నాడు. నేను భర్తను, భార్య నాకు అణగి మణగి వుండాలి—అనే అధికారం చూపక, భార్యకు కోపం వచ్చినప్పుడు ఆమెను అనునయిస్తూ వుండే వారే ప్రియులు అనబడతారు. తక్కిన వారున్నారే వారంతా కేవలం భర్తలు పాపం!

11. ఆరని దప్పి :

అవిఅణ్హ పేక్ఖణిజ్జేణ తక్ఖణం మామి తేణ దిట్ఠేణ,
సివిణఅ పీఏణ వ పాణిఏణ తణ్హా వ్విఅ ణ ఫిట్టా. (1-93)
(అవితృష్ణ ప్రేక్షణీయేన తత్క్షణం మాతులాని తేన దృష్టేన,
స్వప్న పీతేనేవ పానీయేన తృష్ణేవ న భ్రష్టా.)

ఒక వనిత తన ప్రియుణ్ణి చూచింది అకస్మాత్తుగా. అప్పుడు తనకు కలిగిన భావాన్ని, స్థితిని తన మామ భార్యకు తెలుపుతున్నది. "మనకు ఇష్టమైనవాడు కనిపిస్తాడు, హఠాత్తుగా. చూస్తాము, తనివి తీరదు. స్వప్నంలో మంచినీళ్ళు తాగితే దప్పి అరదు కదా; అలాగే వుంటుంది పరిస్థితి." ఈ వనిత పరిస్థితి కూడ

అలాటిదే. అందుకే తమిళ ఆళ్వార్లు భగవంతుని 'ఆరాత అముదం' (ఆరని అమృతం) అని వర్ణించారు. ఎంత తాగినా తనవితీరని అమృతం వంటివాడు భగవంతుడు. దాని అనువాదమే అతృప్త్యమృత రూపుడు అని.

## 12. సుజనుడు వెళ్ళిపోతే... :

సుఅణో జం దేస మలంకరేఇ తం విఅ కరేఇ పవసంతో,
గామాసణ్ణుమ్మూలిఅ మహావడట్ఠాణ సారిచ్ఛమ్. (1–94)
(సుజనో యం దేశ మలంకరోతి తమేవ కరోతి ప్రవసన్,
గ్రామాసన్నోన్మూలిత మహావటస్థాన సదృశమ్.)

సజ్జనుడు ఎక్కడ వుంటాడో ఆ ప్రాంతానికి అలంకారంగా ఉంటాడు. అక్కడినుంచి వెళ్ళిపోయాడా పెద్ద వెలితి ఏర్పడుతుంది. దానిని పూరించడం కష్టం. గ్రామ సమీపంలో ఒక పెద్ద మర్రి చెట్టు వుంటుందనుకోండి. అది కూలిపోయిందనుకుందాం. దాని స్థానంలో ఎన్ని చెట్లు మొలిస్తే మొదటి అందం, గాంభీర్యం వస్తాయి? వెలితి ఎలా తీరుతుంది?

## 13 ఇష్టుడు కష్టం కలిగించినా... :

దుఃఖం దేంతో వి సుహం జణేఇ జో జస్స వల్లహో హోఇ. (1–100)
(దుఃఖం దద దపి సుఖం జనయతి యో యస్య వల్లభో భవతి.)

మనకు ఇష్టమైన వాళ్ళు కష్టం కలిగించినా సుఖంగానే వుంటుంది; కష్టంగా అనిపించదు.

## 14. తరతరాల స్నేహం :

తే విరలా సప్పురిసా జాణ సిణేహో అహిణ్ణ ముహరాఓ,
అణుదిఅహ వడ్ఢమాణో రిణం వ పుత్తేసు సంకమఇ. (2-13)
(తే విరలా స్సత్పురుషాః యేషాం స్నేహః అభిన్న ముఖరాగః,
అనుదివస వర్ధమానః ఋణమివ పుత్రేషు సంక్రామతి.)

సత్పురుషుల స్నేహం ఒకే విధంగా ఉంటుంది; రంగు మారదు; దినదినమూ పెరుగుతూ ఉంటుంది, అప్పులాగ. తండ్రి తీర్చలేని అప్పు కొడుకులు తీర్చవలసి నట్టుగా వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. అలాటి సత్పురుషులు అరుదుగా వుంటారు. అలాటి వారి స్నేహం వారితోనే సమసిపోకుండా కొడుకులకూ సంక్రమిస్తుంది. కొడుకులూ తండ్రిలాగే స్నేహాన్ని కాపాడుకుంటూంటారు. అలాటి వంశపారంపర్య స్నేహం అరుదు కాదూ! కొన్ని స్నేహాలు వ్యక్తితోనే సమసిపోతాయి; కొన్ని ఆ వ్యక్తి వుండగానే సమసిపోతాయి.

## 15. గుణాలు :

గుణేసు కో మచ్ఛరం వహఇ. (2-18)
(గుణేషు కో మత్సరం వహతి)

గుణాలను అందరూ ఆదరిస్తారు. వాటిపై నిష్కారణంగా మాత్సర్యం ఎవరికైనా ఎందుకుంటుంది ?

## 16. ఖలుడు దీపం లాంటివాడు :

వసఇ జహిం చేఅ ఖలో పోసిజ్జంతో సిణేహదాణేహిం,
తం చేఅ ఆలఅం దీఅఓవ్వ అఇరేణ మఇలేఇ. (2-35)
(వసతి యత్రైవ ఖలః పోష్యమాణః స్నేహదానైః,
తమేవాలయం దీపక ఇవాచిరేణ మలినయతి.)

దుష్టుని విషయంలో జాగ్రతగా వుండాలని ఒకడు తన మిత్రునికి హితవు చెబుతున్నాడు: దుష్టుణ్ని స్నేహంతో ఆశ్రయమిచ్చి పోషిస్తే మనకే త్వరలో మసిపూస్తాడు; మన ఇంటినంతా మసిచేస్తాడు-దీపంలాగ. దీపాన్ని నూనె పోసి వెలిగిస్తాము. కాని అది ఇంటినంతా పొగతో పాడుచేస్తుంది. దుష్టుడు మనకే కాక మన ఇంటికంతా తలవంపులు తెస్తాడు. కనుక అలాటి వాడిని చేరదీయ రాదు.

## 17. పిసినివాని డబ్బు :

హోంతి వి ణిప్ఫలచ్చిఅ ధణరిద్ధీ హోఇ కివిణ పురిసస్స,
గిహ్మాఅవ సంతత్తస్స ణిఅఅ ఛాయ వ్వ పహిఅస్స. (2-36)
(భవంత్యపి నిష్ఫలైవ ధనబుద్ధి ర్భవతి కృపణ పురుషస్య.
గ్రీష్మాతపసంతప్తస్య నిజకచ్ఛాయైన పథికస్య.)

పిసినిగొట్టుకు డబ్బు పరాశంగా పెరుగుతున్నా ప్రయోజనం లేదు; వ్యర్థం. మండుటెండలో వెళ్లేవాడికి తననీడ చలవనిస్తుందా ? అలాగే పిసినిగొట్టు డబ్బు అతడు ఖర్చు పెట్టక, ఇతరులకూ ఇవ్వక వ్యర్థమవుతుంది.

## 18. ఎవరు ముందు ?

సమ సోక్ఖ దుక్ఖ పరివడ్ఢిఆణ కాలేణ రూఢ పేమ్మాణమ్,
మిహుణాణం మరఇ జం తం ఖు జిఅఇ ఇఅరం ముఅం హోఇ. (2-42)
(సమసౌఖ్యదుఃఖ పరివర్ధితయోః కాలేన రూఢప్రేమ్ణోః,
మిథునయోః మ్రియతే యత్ తత్ఖలు జీవతి ఇతరన్మృతం భవతి)

"పరస్పర ప్రార్థ్య నిరాశయోర్వరం శరీరనాశోపి సమానురాగయోః"-సమమైన అనురాగంతో పరస్పరం కోరుకుంటూ, విపరీతవిధివల్ల కలుసుకొనే అవకాశం లేని ప్రేయసీ ప్రియులు మరణించినా మేలే – అంటాడు కాళిదాసు. ఈ గాథాకవి వర్ధరంకుడు కాళిదాసుకన్నా గొప్పగా, అంతకన్నా ముందుగా ఇలా అన్నాడు: సుఖదుఃఖాల్లో సమంగా పెరుగుతూ కాలం గడచిన కొద్దీ (అతిపరిచయంవల్ల సడలక) ప్రేమ దృఢపడుతూ వున్న దంపతులలో మొదట మరణించే వ్యక్తే నిజంగా జీవించినట్టు; మరణించని వ్యక్తి నిజంగా చచ్చినట్టే.

## 19. ఎలా వదిలుకుంటాము?

జేణ విణా ణ జీవిజ్జఇ అణుణిజ్జఇ సో కఆవరాహో వి.
పత్తే వి ణఅరదాహే భణ కస్స ణ వల్లహో అగ్గీ? (2-63)
(యేన వినా న జీవ్యతే నునీయతే స కృతాపరాధో౽పి,
ప్రాప్తేపి నగరదాహే భణ కస్య న వల్లభో౽గ్నిః?)

కొందరిని మనం వదలుకోలేము; వారులేక మనకు గడవదు. అలాంటప్పుడు వారు ఏపొరపాటు చేసినా సర్దుకు పోవాలి. ఊరిని కాల్చింది కదా అని నిప్పును వాడడం మానివేస్తామా? నిప్పు అందరికీ ఇష్టమైనదే కాక, అత్యవసరమైంది కూడ-అని అంటుంది ఎంతో లోకజ్ఞురాలయిన రోహా అనే కవయిత్రి.

## 20. పాపశంక:

ఖణమేత్తం పి ణ ఫిట్టఇ అణుదిఅహ విఇణ్ణ గురుఅసంతావా,
పచ్ఛణ్ణ పావసంకేవ్వ సామలీ మజ్ఝ హిఅఅఏ. (2-88)
(క్షణ మాత్రమపి నాపయాతి అనుదివస వితీర్ణ గురుకసంతాపా,
ప్రచ్ఛన్న పాపశంకేవ శ్యామలా మమ హృదయాత్.)

మనం ఏదైనా తప్పు చేస్తాము. దానిని చెప్పుకొని పశ్చాత్తాప పడే ధైర్యం వుండదు. అది ఎక్కడ బయటపడుతుందో అని ప్రతి దినం మనసు వ్యథ పడుతూనే వుంటుంది: శంక—భయం ఒక క్షణమయినా మనసు నుంచి తొలగదు. అలాగే ప్రియురాలుకూడా మనసు నుంచి తొలగి పోవడంలేదని, వెను బాధ కలిగిస్తుందని హాలుడు—శోకాన్ని వదలోసిన హాలుడు అంటాడు. ఎప్పుడూ మనసు విడిపోని, బాధకలిగించే ప్రియురాలిని పాపశంకతో పోల్చడం ఆలంకారిక సమయ విరుద్ధమయినా, దుష్టుడిని దీపంతో పోల్చినట్టు, హాలుడు ప్రియురాలిని పాపశంకతో పోల్చాడు. నిరంతరవాసం, బాధ ఈ రెండింటికే సమానధర్మాలు.

## 21. సజ్జనులకోపం :

సరఏ మహద్దహాణం అంతే సిసిరాఇఁ బాహిరుణ్హాఇం,
జాఆఇఁ కువిఅ సజ్జణ హిఅఅ సరిచ్ఛాఇఁ సలిలాఇం. (2-86)
(శరది మహాహ్రదానా మంతః శిశిరాణి బహిరుష్ణాని,
జాతాని కుపిత సజ్జన హృదయ సదృశాని సలిలాని.)

సజ్జనులకు కోపంరాదు, వచ్చినా తాటాకు మంటలాగా కొంచెం సేపు వుంటుంది. అంటే, పైకి వేడిగా వుంటుంది. హృదయం చల్లగా వుంటుంది. కోపం దీర్ఘంగా వుండదు. ఎలాగంటే శరత్కాలంలోని మడుగు నీటివలె. ఆ నీరు పైకి సూర్యుని తీక్ష్ణకిరణాలకు వేడెక్కుతుంది. కాని లోపల చల్లగా వుంటుంది.

## 22. అలసత్వం :

ఉప్పణ్ణత్థే కజ్జే అఇచింతంతో గుణాగుణే తమ్మి,
చిరఆల మంద పేచ్ఛిత్తణేణ పురిసో హరఇ కజ్జమ్. (8-14)
(ఉత్పన్నార్థే కార్యేఽతి చింతయన్ గుణాగుణా తస్మిన్,
చిరకాల మంద ప్రేక్షిత్వేన పురుషో హంతి కార్యమ్).

పని చేసే సమయంలోనూ దానిలోని గుణదోషాలు లెక్క పెడుతూ ఏ గుణానికి ఏమి వస్తుందో అని ఎప్పుడూ శంకించేవారుంటారు. పని పాడు కావడానికి వారే కారకులు. కనుక అలా నిరంతరం శంకించక పనులు తొందరగా, ధైర్యంతో నెరవేర్చుకోవాలి.

## 23. మైత్రి :

తం మిత్తం కాఅవ్వం జం కిర వసణమ్మి దేశఆలమ్మి,
ఆలిహిఅ భిత్తి వాఉల్లఅం వ ణ పరమ్ముహం ఠాఇ. (8-17)
(తన్మిత్రం కర్తవ్యం యత్కిల వ్యసనే దేశకాలేషు,
ఆలిఖిత భిత్తి పుత్తలక మివ న పరాఙ్ముఖం తిష్ఠతి.)

“సమాన శీలవ్యసనేషు సఖ్యం”-సమానమైన స్వభావం, అలవాట్లు వున్న వారికే స్నేహం కలుస్తుందని పెద్దలంటారు. ఈ గాథాకారుడైన పాలితుడు ఎలాటి వారితో మైత్రి చేయాలో చెబుతున్నాడు: కష్టాలలోను, కాలదేశాలు మారినను పెడమొగం పెట్టని వారితో స్నేహం చేయాలట. దానికి కవి ఒక అపూర్వమైన ఉదాహరణమిచ్చాడు. గోడమీద గీసిన బొమ్మలాగ ఎప్పుడూ పెడమొగం పెట్టనివాడుగా వుండాలి. గోడమీది బొమ్మ ఎప్పుడూ మనను చూస్తుంటుందేగాని ముఖం తిప్పదు.

## 24. మధ్యముడు :

తా మజ్ఝిమో చ్చిఅ వరం దుజ్జణ సుఅణేహిఁ దోహిఁవి ణ కజ్జం,
జహ దిట్ఠో తవఇ ఖలో తహేఅ సుఅణో అఈసంతో. (3-24)
(తన్మధ్యమ ఏవ వరం దుర్జన సుజనాభ్యాం ద్వాభ్యాం న కార్యమ్,
యథా దృష్టః తాపయతి ఖలస్తథైవ సుజనః అదృశ్యమానః.)

పైన పాలితుడు మైత్రిని గురించి చెప్పిన దానికి కొంత కొత్తగా చెప్పాడు హాలుడు. దుర్జనులతోను పనిలేదు; సజ్జనులతోను పనిలేదు. మధ్యముడే మేలు అంటాడు హాలుడు. దుర్జనుడిని చూస్తూ వుంటేనే ఒళ్ళు మండుతుంది. ఇక సజ్జనుడు కనిపించక పోయినా మండుతుంది ఒళ్ళు. కనుక మంచివాడూ వద్దు, చెడ్డవాడూ వద్దు. సాధారణుడయిన మధ్యమునితోనే చెలిమి చేద్దాం. మనకు ఎలాటి తాపమూ కలిగించడు—అంటాడు హాలుడు.

## 25. కష్టంలో వున్న పెద్దలు :

పాణఉడీఅ వి జలిఊణ హుతవహో జలఇ జణ్ణవాడమ్మి,
ణహు తే పరిహరిఅవ్వా విసమదసాసంఠిఆ పురిసా. (3-27)
(పాణ కుట్యామపి జ్వలిత్వా హుతవహో జ్వలతి యజ్ఞవాటేపి,
న ఖలు తే పరిహర్తవ్యా విషమదశా సంస్థితాః పురుషాః.)

కొందరిని ఏ పరిస్థితిలోను మనం వదలుకోరాదంటాడు హాలుడు. నిప్పు కల్లు అంగడిలోను మండుతుంది: యజ్ఞవాటికలోను మండుతుంది. మరి దానిని అపవిత్రమని వదలి పెడుతామా? అలాగే కొందరు ఉత్తములు తమకు తగని విషమ పరిస్థితులలో ఉండవలసివస్తుంది అంత మాత్రాన వారిని వదలుకొంటామా?

## 26. దారిద్ర్యం :

జాఏజ్జ వణుద్దేసే ఖుజ్జో వి హు ణీసహో ఝడిఅపత్తో,
మా మాణుసమ్మి లోఏ తాఈ రసిఓ దరిద్దో అ. (8-30)
(జాయతాం వనోద్దేశే కుబ్జోపి ఖలు నిశ్శాఖః శిథిలపత్రః,
మా మానుషేలోకే త్యాగీ రసికో దరిద్రశ్చ)

అడదై పుట్టడం కంటే అడవిలో మానై పుట్టడం మేలని ఆగువారు అక్కసు వెళ్ళబోసుకుంటుంటారు. ఇతడెవరో పాపం! "త్యాగశీలుడైన రసికుడు-సహృదయుడు, దరిద్రుడుగా పుట్టడం కన్నా అడవుల్లో కొమ్మలులేని, ఆకులు రాని మరుగుజ్జు మోడయి పుట్టడం మేలు'' అని అనుకుంటున్నాడు.

## 27. దోసిలిలోని నీరు :

అద్దంసణేణ పుత్తఅ సుట్టు వి ణేహాణుబంధ ఘటిఆఇం,
హత్థ ఉడ పాణిఆఇ వ కాలేన గలంతి పేమ్మాఇం. (3-36)
(ఆదర్శనేన పుత్రక సుష్ఠ్వపి స్నేహానుబంధ ఘటితాని,
హస్తపుట పానీయానీవ కాలేన గలంతి ప్రేమాణి )

ఇంతకు ముందు ఒక కవి "స్త్రీలను తరచు చూస్తూ పలకరిస్తూ వుండాలి. లేకపోతే ప్రేమలు కలకాలం వుండవు" అన్నాడు. స్త్రీల విషయంలోనే కాదు. ఎంత బలమైన ప్రేమలయినా, ఇతరుల విషయంలోను చూపులు లేకపోతే, రాక పోకలు లేకపోతే దోసిలిలోని నీటిలాగ క్రమంగా జారిపోతాయని ఈ గాథా రచయిత అన్నాడు

## 28. లోకజ్ఞత :

అక్ఖేవఆఇ పిఅ జంపిఆఇ వరహిఅఅణివ్వుది అరాఇం,
విరళో ఖు జాణఇ జణో ఉప్పణ్ణే జంపిఅవ్వాఇం. (3-42)
(వాక్షేపకాణి ప్రియజల్పితాని పరహృదయ నిర్వృతికరాణి,
విరళః ఖలు జానాతి జన ఉత్పన్నే జల్పితవ్యాని.)

కొందరు చాల చతురులు. తమమీద ఇతరులకు సందేహం కలిగితే, వారి ఆక్షేపాలన్నిటికీ సమాధాన మిస్తారు; తియ్యగా మాట్లాడి ఎదుటివారి హృదయాలను లోబరచుకొంటారు. పొరపాట్లు జరిగితే ఎదుటివారు కోపపడకుండా ఎలా మాట్లాడాలో కూడ తెలుసుకొని అలా ప్రవర్తిస్తారు. ఇలాటి చాతుర్యం గలవారు అరుదుగా వుంటారు.

## 29. ఏవి శోభిస్తాయి ?

ఛజ్జఇ పహుస్స లలిఅం పిఅఇ మాణో ఖమా సమత్థస్స,
జాణంతస్స అ భణిఅం మోణం చ అఆణమాణస్స. (3-43)
(శోభతే ప్రభోర్లలితం ప్రియాయా మానః క్షమా సమర్థస్య,
జానతశ్చ భణితం మౌనం చాజానతః.)

లోకంలో సొంపుగా వుండేవి కొన్నే వుంటాయి. అన్నీ అన్ని వేళల సొంపుగా వుండవు. ప్రభువు స్వేచ్ఛాచారం సొంపుగా వుంటుంది. ప్రియురాలి బింకం అందమిస్తుంది. సమర్థుడైనవాని ఓరిమి శోభిస్తుంది. జ్ఞానవంతుని మాట వినసొంపుగా వుంటుంది. అజ్ఞానికి మౌనం అలంకార మిస్తుంది. ఈ సంగతినే భర్తృహరి మరింత స్పష్టంగా "విభూషణం మౌన మపండితానాం"—పండితులు కాని వారికి మౌనమే భూషణం అన్నాడు.

### 30. ఇసుకగోడ :

దేవమ్మి పరావుత్తే పత్తిఅ ఘడిఅం పి విహడఇ నరాణం,
కజ్జం వాలుఆ వరణం వ్వ కహ వి బంధం విఅ ణ ఏఇ. (3–45)
(దైవే పరాఙ్ముఖే ప్రతీహి ఘటితమపి విఘటతే నరాణామ్,
కార్యం వాలుకా వరణ మివ కథ మపి బంధనమేవ న దధాతి.)

దైవం అనుకూలంగా లేనప్పుడు సమకూడే పనికూడ చెడిపోతుంది. ఇసుక గోడ ఎంతగా కట్టినా నిలువనట్టు పని సానుకూలం కాదు. మానవ యత్నానికి దైవం అనుకూలించాలి. కాని మానవుడు దైవం అనుకూలంగా లేదనే సాకుతో యత్నించడం మానరాదని భర్తృహరి అన్నాడు.

### 31. ఖలుల ధనం :

ఉప్పాఇఅ దవ్వాణఀ వి ఖలాణఀ కో భాఅణం ఖలో చ్చేవ,
పక్కాఇఀ వి ణింబ ఫలాఇఀ ణవరి కాఏహిఀ ఖజ్జంతి. (3–48)
(ఉత్పాదిత ద్రవ్యాణా మపి ఖలానాం కో భాజనం ఖల ఏవ,
పక్వాన్య పి నింబఫలాని కేవలం కాకైః ఖాద్యంతే.)

దుర్మార్గులు సంపాదించే ధనాన్ని అనుభవించేవారు ఎవరనుకున్నారు? దుర్మార్గులే. దుర్మార్గులు తమ సంపాదనను మంచి పనులకు వినియోగించరు. వేపచెట్లు విరగబడి పండుతాయి. వాటిని తినేది కాకులే సుమా! కనుక కష్టపడి ఆర్జించిన ధనాన్ని సత్కార్యాలకు వినియోగించాలి అని కవి భావం.

### 32. సజ్జనుని కోపం :

సుజణో ణ కుప్పఇ వ్విఅ, అహ కుప్పఇ విప్పిఅం ణ చింతేఇ,
అహ చింతేఇ ణ జంపఇ, అహ జంపఇ లజ్జిఓ హోఇ. (3–50)
(సుజనో న కుప్యత్యేవ అథ కుప్యతి విప్రియం న చింతయతి,
అథ చింతయతి న జల్పతి అథ జల్పతి లజ్జితో భవతి.)

అర్జునుడనే కవి సజ్జన స్వభావాన్ని ఈ గాథలో మాత్రప్రాయంగా తెలిపాడు. సజ్జనుడు సాధారణంగా కోపగించుకోడు. ఒకవేళ కోపగించుకొన్నాడా, కసి తీర్చుకొందామని అనుకోనే అనుకోడు. ఒకవేళ అనుకున్నాడా, అది మనసులోనే ఉంటుంది గాని పైకి దురుసుగా మాట్లాడడు. కోపం పట్టలేక ఒకవేళ పైకి దురుసుగా మాట్లాడాడా సిగ్గుపడిపోతాడు, ఛీ ఏమిటి ఇలా అనుకుంటున్నాను—అని.

## 33. ఏది రూపం ?

సో అత్థో జో హత్థే, తం మిత్తం జం నిరంతరం వసణే,
తం రూఅం జత్థ గుణా, తం విణ్ణాణం జహిం ధమ్మో. (3–51)
(సోఽర్థో యో హస్తే తన్మిత్రం యన్నిరంతరం వ్యసనే,
తద్రూపం, యత్ర గుణాః తద్విజ్ఞానం యత్ర ధర్మః.)

పుస్తకంలోని విద్య, పరుల చేతిలోవున్న ధనం సమయానికి ఉపయోగించేవి కావు అని ఒకరన్నారు. విద్య అంటే అంతా కంఠస్థంగా వుండాలి. డబ్బు అంటే పరాధీనంగా వుండక స్వతంత్రంగా వుండాలి; వినియోగించుకోదగినదిగా. ఈ సంగతినే ప్రపంచాను; వం విస్తారంగాగల హాలుడు వివరిస్తున్నాడు ఇలా: చేతిలో సిద్ధంగా వుండేదే ధనం. ఆపద వచ్చినప్పుడు శారీరకంగాను, మానసికంగాను అంటిపెట్టుకొని వుండేవాడే నెచ్చెలి. గుణాలున్నదే రూపం. అంటే, గుణం కూడ వున్నప్పుడే రూపమూ రాణిస్తుంది. కేవలం బాహ్య సౌందర్యం ప్రయోజన కరం కాదు ; మానసిక సౌందర్యం కూడ అవసరం. ధర్మ చింత ఉన్నదే విజ్ఞానం. విజ్ఞానమంటే లోక శాస్త్రాదులలో బహుళజ్ఞత. ఇంతటి బహుళజ్ఞత ధర్మబుద్ధి, ధర్మదృష్టి, ధర్మచింత లేనిదే నిరుపయోగం.

## 34. దుర్మార్గుడు-మద్దెల :

అకులీణో దుమముహో తా మహురో భోఅణం ముహే జావ,
మురఓ వ్వ ఖలో జిణ్ణమ్మి భోఅణే విరస మారసఇ. (3–68)
(అకులీనో ద్విముఖ స్తావ న్మధురో భోజనం ముఖే యావత్,
మురజ ఇవ ఖలో జీర్ణే భోజనే విరస మారసతే.)

దుర్మార్గుడు మద్దెలవంటివాడని కవి చక్కగా పోల్చాడు. మద్దెలకు రెండు ముఖాలు. దుర్మార్గునికి కూడ రెండు ముఖాలు ; స్వార్థం చేకూరినప్పుడు ఒక విధంగాను, చేకూరనప్పుడు మరో విధంగాను మాట్లాడుతాడు. దుర్మార్గుని పుట్టుక మంచివంశంలో కాదు. మంచి వంశంవాడు దుర్మార్గుడు కాడుకదా ! మద్దెలకూడ అకులీనం. (ఇక్కడ శ్లేష సహాయ పడవలసివచ్చింది కవికి.) మద్దెలను వాయించేటప్పుడు గుడ్డ కుదురుగా చుట్టి దాని మీద పెట్టి వాయిస్తారు కనుక భూమికి సంబంధంలేనిది (కు—భూమి దానిలో లీనం కానిది, అననిది). మద్దెల బాగా పలకడానికి అన్నంగాని, ఉడికించిన పిండి గాని మెత్తుతారు, మెత్తగానే మంచి నాదమిస్తుంది; పలుకుతుంది. దుర్మార్గుడు కూడ తిండి తింటున్నంతవరకు—స్వార్థం నెరవేరుతున్నంతవరకు తియ్యగా మన పాటే పాడుతాడు. స్వార్థం నెరవేరగానే పిండిమెత్తని మద్దెలవలె విరసంగా పలకడం ప్రారంభిస్తాడు.

## 35. చులకన చేసే పనులు :

లహుఅంతి లహుం పురిసం పవ్వఅ మేత్తం పి బోవి కజ్జాఇం,
ణివ్వరణ మణివ్వూఢే, ణివ్వూఢే జంఅ ణివ్వరణం. (3-55)
(లఘయతో లఘు పురుషం పర్వతమాత్రమపి ద్వే అపికార్యే
నిర్వరణ మనిర్వ్యూఢే నిర్వ్యూఢే యచ్చ నిర్వరణమ్.)

రెండు పనులు చేయరాదంటాడు గోవిందసామి అనే కవి. అవి రెండు ఏమిటి ? చేయని పనిని ఇట్లా చేస్తాను, అట్లా చేస్తాను అని తన గుణగణ ప్రకాశనార్థం చెప్పుకోవడం; చేసిన పనిని ఇట్లా చేశాను, అట్లా చేశాను అని ఆత్మ ప్రశంసగా చెప్పుకోడం—ఇవి రెండూ కొండంత పెద్దవాడిని కూడ త్వరలో కొండికగా (చిన్నగా) చేస్తాయి. చేయని పనిని గురించి చెప్పుకోడం వ్యర్థం, చేసిన పిదప చెప్పుకోడం ఆత్మశ్లాఘ అవుతుంది. కనుక ఉత్తముడు ఈ రెండు పనులు చేయరాదు. చేసిన పనులే పనిచేసిన వాని శక్తి యుక్తులను తెలుపుతాయి. అవే నిదర్శనాలు.

## 36. పెద్దలతో వైరం :

విణ్ణాణగుణ మహగ్ఘే పురిసే వేసత్తణం పి రమణిజ్జమ్,
జణ ణిందిఏ ఉణ జణే పిఅత్తణేణావి లజ్జామో. (5-67)
(విజ్ఞాన గుణమహార్ఘే పురుషే ద్వేష్యత్వమపి రమణీయం,
జననిందితే పునర్జనే ప్రియత్వేనాపి లజ్జామహే.)

లోకుల మనస్తత్వాన్ని సవరసత్తి (శబరశక్తి) అనే జానపద కవి ఈ గాథలో చక్కగా తెలిపాడు. ఒకడు తన మిత్రునితో సామాన్యుల మనఃప్రవృత్తిని ఇలా తెలిపాడు: విజ్ఞానం, గుణం మున్నగు వాటితో సంఘంలో గౌరవాదరాలున్న వారితో ద్వేషమయినా అందంగా వుంటుంది. అది గొప్పగా వుంటుంది వారికి; అలాటివారితో తమకు వైరమంటే సంఘంలో సాహసక్రియ కదా ! సంఘంలో వారు ఆడిపోసుకునే వారితో, జన నిందితునితో అభిమానంతో, ప్రేమతో వున్నామని అనుకోడానికి అందరూ సిగ్గుపడతారు. అలాటి వారితో పొత్తు తమకూ అవమానకరం గదా ! ఫలానా దొంగ, దుర్మార్గుడు నాకు మిత్రుడని ఎవరూ చెప్పుకోరు. ఎందుకంటే తనను గూడ జనం దొంగకింద జమకడుతుంది గనుక. పెద్దవారితో ద్వేషం చూపితే, అబ్బో పెద్దవారిని ఢీకొడుతున్నాడు, వీడికి ఏం బలముందో, ఏ పుట్టలో ఏ పాముందో—అని జన దృష్టిలో పైకి ఎగిసిపోతాడు. ఇది లోకం పోకడ. దీనిని భారవి "వరం విరోధోపి సమం మహాత్మభిః" అన్నాడు.

## 37. పెద్దల ప్రవర్తన :

అణువత్తణం కుణంతో వేసే వి జణే అహిణ్ణ ముహరాఓ,
అప్పవసో వి హు సుఅణో పరవ్వసో ఆహిజాఈఏ. (3-65)
(అనువర్తనం కుర్వన్ ద్వేష్యేపి జనే౽భిన్నముఖరాగః,
ఆత్మవశో౽పి ఖలు సుజనః పరవశః ఆభిజాత్యస్య.)

సజ్జనుని ప్రవర్తన అపూర్వం. శత్రువు ఇంటికి వచ్చినా, ద్వేషాసహ్యాలు ముఖంలో ఏ మాత్రమూ కనబడనీక ఆదరిస్తాడు. నిజానికి ఆ శత్రువుకు అతడు భయపడవలసిన పని లేదు ; అతనికి ఇతడేమీ పరతంత్రుడు కాడు. కాని, అభిజాత్యానికి – వంశ గౌరవానికి, ఇంటితనానికి – పరతంత్రుడు. అందువల్లనే శత్రువును కూడ ఎలాటి వికారాలు ముఖంలో చూపక ఆదరిస్తాడు.

## 38. ఖలజనమైత్రి :

కీరంతి చ్చిఅ ణాసఇ ఉదఏ రేహవ్వ ఖలఅణే మేత్తీ,
సా ఉణ సుఅణమ్మి కఆ అణహా పాహాణరేహవ్వ. (3–72)
(క్రియమాణైవ నశ్యత్యుదకే రేఖేవ ఖలజనే మైత్రీ,
సా పునః సుజనే కృతా అనఘా పాషాణరేఖేవ.)

సుజనదుర్జన మైత్రి ఎలాటిదో సరళంగా నిర్వచించాడు సరళుడనే కవి : దుష్టులతో మైత్రి చేస్తున్నప్పుడే నీటిపై గీతలాగ నశిస్తుంది. సజ్జనులతో చేసే మైత్రి నిరపాయంగా రాతిపై గీతలాగ స్థిరంగా ఉంటుంది.

## 39. విశిష్టత :

గంధేణ అప్పణో మాలిఆణం ణోమాలిఆ ణ ఫుట్టిహిఇ,
అణ్ణో కోవి హు ఆసాఇ మంసలో పరిమలుగ్గారో. (3–31)
(గంధేనాత్మనో మాలికానాం నవమాలికా న చ్యుతా భవిష్యతి,
అన్యః కోపి హంతాశాయాః మాంసలః పరిమలోద్గారః.)

సంఘంలో కొందరి విశిష్టత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఎలాగంటే, పూలలో జాజిమల్లెలాగ. దాని వాసన ఏ పూవు వాసనకూ తీసిపోదు. దాని గుబాళింపే వేరు. తక్కిన పూవుల వాసనను తీసుకొని మొత్తంగా వ్యాపించడం దాని స్వభావం. విశిష్ట వ్యక్తుల సంగతీ ఇలాటిదే. వారు తక్కిన వారికన్నా అన్నింటా ముందు ఉంటారు, వారి గుణగణాలను వెనక్కు నెట్టివేస్తూ. పాపం! ఆదరించేవారు ఒకప్పుడు లేకపోయినా సరే.

## 40. సంపదలో పెద్దలు :

ఫలసంపత్తీఅ సమోణఆఇ తుంగాఇం ఫలవిపత్తీఏ,
హిఅఆఇ సుపురిసాణం మహాతరూణం వ సిహరాఇ. (8–82)
(ఫలసంపత్త్యా సమవనతాని తుంగాని ఫలవిపత్త్యా,
హృదయాని సుపురుషాణాం మహాతరూణామివ శిఖరాణి.)

గొప్పవారి మనస్సు ఉదాత్తమైనది. వారు ఐశ్వర్యంతో తులదూగి నప్పుడు వినయంతో ప్రవర్తిస్తారు, విరగ్గాచిన పండ్ల చెట్ల కొమ్మలలాగ. ఐశ్వర్యం కోలుపోయినప్పుడు దైన్యం అవంతైనా లేక పండ్లులేని ఆ చెట్ల కొమ్మలలాగే తల ఎత్తుకొని వుంటారు. సుఖంలో ఒళ్లు తెలియక విర్రవీగడం, కష్టాలలో దీనంగా ముఖం వేలవేసుకోడం సామాన్యుల స్వభావం.

## 41. అస్తమయ సూర్యుడు :

తుంగోచ్చిఅ హోఇ మణో మణంసిణో అంతిమాసు వి దసాసు,
అత్థమణమ్మి వి రఇణో కిరణా ఉద్ధం చిఅ ఫురంతి. (8–84)
(తుంగమేవ భవతి మనః మనస్వినోఽంతిమాస్వపి దశాసు,
అస్తమనేపి రవేః కిరణాః ఊర్ధ్వమేవ స్ఫురంతి.)

మరొక కవి గొప్ప మనసు వారి స్వభావాన్ని మరొక విధంగా వివరించాడు: గొప్ప మనసువారి మనస్సు తుది దశలో కూడ తన గొప్పదనాన్ని కోల్పోదు ; ఉన్నతంగానే ఉంటుంది. సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు కూడ అతని కిరణాలు వంగిపోవు ; పైకే ప్రసరిస్తుంటాయి.

## 42. పొట్టపోసుకోడం గొప్పా :

పోట్టం భరంతి సఉణా వి మాఉఅ అప్పణో అణువ్విగ్గా,
విహలుద్ధరణ సహావా హువంతి జఇ కేవి సప్పురిసా. (8–85)
(ఉదరం బిభ్రతి శకునా అపి హే మాతరః ఆత్మనః అనుద్విగ్నాః,
విహ్వలోద్ధరణ స్వభావాః భవంతి యది కేపి సత్పురుషాః.)

కష్టాల్లో ఉన్నవారిని ఆదుకొనేవారే గొప్పవారు అంటాడు ఈ గాథాకవి, ఒక పల్లెటూరి పడుచు మాటలలో: పశులుకూడా పొట్టపోసుకుంటాయి హాయిగా. దానిలో ఏముంది గొప్ప? ఆపదల్లో చిక్కుకున్నవారిని ఆదుకొనే వారే సత్పురుషులు. అలాంటివారు అరుదుగా ఉంటారు. పశులే తమపొట్ట తాము పోసుకుంటున్నప్పుడు మనుష్యులసంగతి చెప్పనక్కరలేదు. తమ స్వార్థం తాము చూచుకోవడం మానవ సహజం. తమ సుఖం కాదని ఇతరులకు తోడ్పడేవారు

కదా సత్పురుషులు! వారికి తమ పొట్టచింత అంతగా ఉండదు. వారు తిండికోసం పుట్టినవారు కారు. వారికి పొట్ట ప్రధాన సమస్య కాదు.

## 43. పిల్లికి గంజి పెడితే :

ణ విణా సబ్భావేణ ఘేప్పఇ పరమత్థజాణుఓ లోఓ,
కో జుణ్ణమఞ్జరం కంజిఏణ వేఆరిఉం తరఇ?. (8–88)
(న వినా సద్భావేన గృహ్యతే పరమార్థజ్ఞో లోకః,
కో జీర్ణ మార్జారం కాంజికయా ప్రతారయితుం శక్నోతి.)

ప్రపంచాన్ని మోసంచేయలేమంటున్నాడు భోజడనే కవి. లోకం వెర్రిది కాదు. పరమార్థం తెలిసినట్టిది. కనుక మోసంచేసి, వశపరచుకోలేను; ఏవేవో అల్లిబిల్లి కబుర్లు చెప్పి లోబరచుకోలేము. ఎంతో ప్రపంచం చూచి అనుభవం పొందిన ముసలిపిల్లిని గంజిపెట్టి మోసం చేయడం సాధ్యమా? ముసలిపిల్లి గంజిని చూచి, పాలు అని మోసపోతుందా? ప్రపంచంకూడా అంతే. మంచితనంతో జనానికి దగ్గర కాగలంగాని మోసంతో కాదు.

## 44. నిస్వార్థ ప్రేమ :

రణ్ణాఉ తణం రణ్ణాఉ పాణిఅం సవ్వఅం సఅంగాహమ్,
తహవి మయాణ మఈణ అ ఆమరణంతాఇ పేమ్మాఇ. (8–87)
(అరణ్యాత్తృణ మరణ్యాత్పానీయం సర్వతః స్వయం గ్రాహం,
తథాపి మృగానాం మృగీణాం ఆమరణాంతాని ప్రేమాణి.)

అవ్యాజంగాను నిస్వార్థంగాను ఉండే ప్రేమ అమరణాంతం తరగదు అంటాడొక అజ్ఞాత కవి. అడవుల్లో జింకలున్నాయి. అవి జీవికకై ఒకదానిపై మరొకటి ఆధారపడి వుండవు; అడవుల్లో గడ్డి, అడవుల్లో నీరు స్వయంగా సంపాదించుకొని తాగి, పరస్పరం భారంలేకుండా స్వేచ్ఛగా మనుగడ సాగిస్తాయి. కాని, అవి—లేళ్ళు దుప్పులు మరణించేవరకు ప్రేమతో వుంటాయి. కనుక నిస్వార్థమూ, అవ్యాజమూ, నిరపేక్షమూ అయిన ప్రేమే శాశ్వతమైనది.

## 45. కులపాలిక :

జహ జహ జరాపరిణఓ హోఇ పఈ దుగ్గఓ విరూఓవి,
కులవాలిఆణ తహ తహ అహిఅఅరం వల్లహో హోఇ. (8–98)
(యథా యథా జరాపరిణతో భవతి పతిః దుర్గతో విరూపోఽపి,
కులపాలికానాం తథా తథా అధికతరం వల్లభో భవతి.)

ఉత్తమవంశసంజాతలయిన కులస్త్రీల స్వభావాన్ని పోట్టిసుడనే కవి ఈ గాథలో వర్ణించాడు. సామాన్య స్త్రీలయితే రూపం ధనం యౌవనం చూచి భర్తలను ఆదరిస్తారు; రూపహీనుడైనా, దరిద్రుడైనా, వయస్సు మళ్లినా, ఆదరణ తగ్గుతుంది. కులస్త్రీల స్వభావం దీనికి ప్రతికూలం. పతి ముసలివాడయినకొద్దీ, బీదవాడయినకొద్దీ, రూపహీనుడయినకొద్దీ, కులస్త్రీల ప్రేమ వారియెడల ఎక్కువవుతుంది. వారిది సహజప్రేమ, బాహ్య విషయాలకు అతీతమైనది.

## 46. జిహ్వాకొక రుచి :

ణ గుణేణ హీరఇ జణో హీరఇ జో జేణ భావిఓ జేణ,
మోత్తూణ పులిందా మోత్తిఆఇం గుంజాఓ గేణ్హంతి. (4-10)
(న గుణేన హ్రియతే జనో హ్రియతే యో యేన భావిత స్తేన,
ముక్త్వా పులిందా మౌక్తికాని గుంజా గృహ్ణంతి.)

జిహ్వాకొక రుచి, పుర్రెకొక బుద్ధి—అన్నారు అనుభవజ్ఞులు. కనుక ఎవరికి ఏది ఇష్టమో వారు దానిని ఆదరిస్తారు; గుణాలు చూడరు; విలువలూ చూడరు. బోయలు అడవులలో ఏనుగులను చంపి ముత్యాలు సంపాదిస్తారు. కాని వారు వాటి విలువనుగాని, గుణాలను గాని చూడక గురువిందలను దండలుగా గుచ్చుకొని వేసుకుంటారు. మరి పుర్రెకొక బుద్ధి అనక ఏమిచేస్తాము!

## 47. లావణ్యం-స్నేహం :

భుంజసు జం సాహీణం కుత్తో లోణం కుగ్గామ రిద్ధమ్మి,
సుహఅ సలోణేణ వి కిం తేణ సిణేహో జహిం ణత్థి? (4-16)
(భుంక్ష్వ యత్స్వాధీనం కుతో లవణం కుగ్రామరిద్ధే,
సుభగ సలవణేనాపి కిం తేన స్నేహో యత్ర నాస్తి?)

కేవలం బాహ్యలావణ్యానికి మోసపోరాదు, స్నేహం మానవునికి ముఖ్యమని త్రిలోచనుడనే కవి ఒక కుగ్రామ దృశ్యాన్ని వివరిస్తున్నాడు: ఒక నాగరకుడు కుగ్రామానికి పనిపడి వెళ్లాడు. ఒక గృహస్థు ఇంటిలో భోజనం ఏర్పాటయింది. ఉప్పులేనికూర వడ్డించింది ఇల్లాలు. అతిథి బిత్తరపోయి ఆమెవైపు చూచాడు. "కుగ్రామంవంటలో లవణం ఎక్కడిది? మేము వడ్డించింది, నీకు లభించింది తిను సుభగుడా? ఇంతకూ వట్టి లవణమున్నా ఏమిటి ప్రయోజనం స్నేహం లేనప్పుడు!" అన్నది ఇల్లాలు. లవణమంటే లావణ్యం, ఉప్పు. స్నేహమంటే నూనె నేయివంటి జిడ్డు పదార్థం, ప్రేమాదరాలు. కవి శ్లేషతో, కేవలం లావణ్యం చూచి ఆకర్షితుడు కారాదని, ప్రేమాదరాలు సంపాదించడం కష్టమని చెప్పాడు. ఉప్పు, సౌందర్యం సులభ వ్యయంతో, అల్పవ్యయంతో విలుచుకోవదగినవి. స్నేహం— చమురు, ప్రేమా బహుమూల్యమయినవి; పల్లెటూరి అమాయకురాలు ప్రేమాదరాలతో వడ్డించింది ఆరగించు మంటుంది ఇల్లాలు.

## 48. సజ్జనుని బాధ :

అవమాణిఓ వి ణ తహా దుమ్మిజ్జఇ సజ్జణో విహవహీణో,
పడికాఉం అసమత్థో మాణిజ్జంతో తహా పరేణ. (4-20)
(అవమానితోఽపి న తథా దూయతే సజ్జనః విభవహీనః,
ప్రతికర్తు మసమర్థో మాన్యమానో యథా పరేణ.)

అభిమానధనుడైన సజ్జనుని మనః ప్రవృత్తే వేరు — ముఖ్యంగా ధనహీనుడయినప్పుడు. విభవహీనుడైన తనను ఎవరైనా అవమానించినా కష్టపడడు. కాని ఇతడులు తనకు సమ్మానం చేసినప్పుడు వారికి ప్రత్యుపకారం ఏమీ చేయలేక పోయానే, వారికేమీ ఇవ్వలేకపోయానే అని కష్టపడుతాడు. అతనికి ఇతరులకు ఈయడమే తప్ప ఇతరులనుంచి తీసుకోడం తెలీదు. ఇప్పుడు ఆ పరిస్థితికి వచ్చి ఇతరుల ఉపకారానికి ప్రత్యుపకారం చేయలేకపోయామే అని బాధ.

## 49. దాగిన రహస్యం :

కలహాంతరే వి అవిణిగ్గఆఇ హిఅఅమ్మి జరా మువగఆఇం,
సుఅణకఆఇం రహస్సాఇం డహఇ ఆయు క్ఖఏ అగ్గీ. (4-21)
(కలహాంతరే ప్యవినిర్గతాని హృదయే జరాముపగతాని,
సుజనశ్రుతాని రహస్యాని దహ త్యాయుఃక్షయేఽగ్నిః.)

ఇది హాలునిగాథ. హాలుడు రాజనీతి చతురుడైన చక్రవర్తి. కనుక అతనికి రహస్య గోపనమంటే ఏమిటో తెలుసు; అది పెదవి దాటితే పృథ్వీ దాటుతుందని కూడ తెలుసు. అందుకనే సజ్జనుల రహస్యగోపనయోగాన్ని వర్ణిస్తున్నాడు: సజ్జనులు ఎవరిదైనా ఏదైనా రహస్యం వింటే, దానిని వారితో పోట్లాటలు వచ్చినప్పుడూ గూడ బయటపెట్టరు. అది వారి హృదయంలోనే ముసలిదై పోయి, వారితోపాటే చితిలో కాలవలసిందే. అది వారి హృదయంలోనే, వారు బతికివున్నప్పుడు ఎన్నటికీ, ఎప్పటికీ వెలుపడదు.

## 50. దుస్సహ వియోగం :

వాహి వ్వ వేజ్జరహిఓ, ధనరహిఓ సుజణమజ్ఝవాసో వ్వ,
రిఉరిద్ధి దంసణ మ్మివ, దుసహణిఓ తుహ విఓఓ. (4-68)
(వ్యాధిరివ వైద్యరహితః ధనరహితః స్వజనమధ్యవాస ఇవ,
రిపుఋద్ధి దర్శనమివ దుస్సహనీయ స్తవ వియోగః.)

వామదేవుడనేకవి విరహాన్ని సహింపరాని కొన్నిటితో పోల్చాడు, ఒక విరహిణి మాటలలో. విరహిణి విరహం దుస్సహమంటూ ఒక మాలోపమను చూపింది. వైద్యుడులేని వ్యాధివలె, డబ్బులు లేక తనవారి మధ్య నివసించడంవలె, శత్రువు సంపదను, అభ్యుదయాన్ని చూడడంవలె విరహం సహింపరానిది-అంటుంది.

## 51. సత్పురుషుల పద్ధతి :

వసణమ్మి అణువ్విగ్గా, విహానమ్మి అగవ్విఅ, భవ ధీరా,
హోంతి అహిణ్ణ సహావా, సమేసు విసమేసు సప్పురిసా. (4-80)
(వ్యసనే నుద్విగ్నా, విభవే గర్వితా, భయే ధీరాః,
భవంత్యభిన్నస్వభావాః సమేషు, విషమేషు సత్పురుషాః.)

సత్పురుషుల స్వభావాన్ని మరొకకవి ఇలా చెబుతున్నాడు: సత్పురుషులు కష్టాలలో కలతపడరు; ఐశ్వర్యం వచ్చినప్పుడు గర్వపడరు. భయంకరమైన పరిస్థితి వచ్చినప్పుడు ధైర్యంతో ఎదుర్కొంటారు. అనుకూల ప్రతికూలనన్ని వేళాలలో ఒకే విధంగా నిబ్బరంతో ప్రవర్తిస్తారు.

## 52. కుండల కపిల-నీచులు :

ఉఅఅం లహిఊణ ఉత్తాణిఅణణా హోంతి కేవి సవిసేసం,
రిత్తా ణమంతి సుఇరం రహట్ట ఘడిఅవ్వ కాపురిసా. (5-90)
(ఉదకం లబ్ధ్వా ఉత్తానితాననా భవంతి కేపి సవిశేషమ్,
రిక్తా నమంతి సుచిరం రహట్ట ఘటికా ఇవ కాపురుషాః.)

గ్రామాలలోని సహజ దృశ్యాలతో నిత్య సత్యాలు తెలుపడం మహాకవుల లక్షణం. దేనినైనా పరిశీలించడం, ఆ పరిశీలనను జీవితానికి అన్వయించడం సాధారణ విషయం కాదు. గ్రామాలలో పొలాలకు నీరుపెట్టడానికి కుండలకపిల వాడుతారు. దీనిని రహట్టం, అరఘట్టం అంటారు. ఈకవి కొంచెపు సంపదకే మిడిసిపడే అల్పులను కుండలకపిలతో పోల్చాడు. కుండల కపిలలోని కుండలు బావిలోనో, మరే జలాశయంలోనో నీరు ముంచుకున్న తర్వాత విర్రవీగుతూ పైకి లేస్తాయి. నీరు కాలువతూములో కుమ్మరించిన పిదప వట్టివయిపోయి ముఖం కిందికి దించుకొని మళ్లీ నీటివైపు వస్తాయి. అలాగే అల్పులు కొద్దిపాటి ధనం చేరగానే మోర ఎత్తుకొని విర్రవీగుతూ ఇక ఈ ప్రపంచంతో మాకేమిటి?—అన్నట్టు ప్రవర్తిస్తారు. ఆ డబ్బు కాస్త వ్యయమయి పోగానే ముఖం వేలవేసుకొని అడుగులు వేస్తారు, ఎక్కడలేని వినయ విధేయతలు చూపుతూ. కనుక ఉత్తముడు కాదలచినవాడు కుండల కపిల లాగ ప్రవర్తించరాదు.

## 53. ఎవరు గృహిణి :

సంత మసంతం దుక్ఖం సుహం చ జాఓ ఘరస్స జాణంతి,
తా పుత్తఅ మహిళాఓ సేసాఓ జరా మనుస్సాణమ్. (6-12)
(సదసత్ దుఃఖం సుఖం చ యా గృహస్య జానంతి,
తాః పుత్రక మహిళాః శేషా జరా మనుష్యాణామ్.)

ఒక ఇల్లాలు తన కోడలికి ప్రపంచంలోను, ఇంట్లోను నడచుకోవలసిన తీరును బోధించే ఉద్దేశంతో తన కుమారునితో ఇలా అంటున్నది: నాయనా, ఇంట్లో ఉన్నదీ లేనిదీ, మంచీ చెడ్డా, సుఖం దుఃఖం తెలుసుకొని ఇంటి మేలుకోసం ప్రవర్తించేవాళ్లే మహిళలు అనిపించుకుంటారు - ఇల్లాండ్లు అనిపించుకుంటారు. తక్కిన వారంతా పురుషులకు ముదిమి వంటివారు. ముదిమి ఒంటిమీదికి తప్పని సరిగా వచ్చి క్రమంగా దేహాన్ని క్రుంగదీసి మరణాసన్నం చేస్తుంది. అలాగే తక్కిన స్త్రీలూ పైన బడి పీక్కుతింటారేగాని ఇంటితనాన్ని నిలబెట్టరు.

## 54. కులస్త్రీల తీరు :

హసిఏహిఁ ఉవాలంభా, అచ్చువచారేహిఁ ఖిజ్జిఅవ్వాఇం,
అంసూహిఁ భండణాఇం, ఏసో మగ్గో సుమహిలాణం. (6-13)
(హసితై రుపాలంభాః అత్యుపచారైః ఖేదితవ్యాని,
అశ్రుభిః కలహాః ఏష మార్గః సుమహిళానామ్.)

కులస్త్రీలు తమకోపాన్ని ఎంత ఉదాత్తంగాను సున్నితంగాను తెలుపుతారో ఒక అజ్ఞాతకవి మకుమారంగా చెప్పాడు: ఉత్తమా ఇల్లాండ్రు తమ కోపాన్ని, కష్టాన్ని, కలహాన్ని తెలిపే తీరే వేరు. ఎదుటివారి నిమర్శం దూరిపారనాడడానికి ఒక నవ్వు నవ్వుతారు. దానితో ఎదుటివానికి లోలోపల రంపపుకోత అవుతుంది. అవసరానికి మించిన ఉపచారాలతోనే తమ ఖేదం తెలియజేస్తారు. ఒక్క కన్నీటి చుక్కతోనే ప్రణయ కలహం సూచిస్తారు. ఏడుపులు, పెడబొబ్బలు ఉండవు. ఇదే ఉత్తమ మహిళల మార్గం. ఎదుటివాడంటే ఎవరో కాదు; భర్తే.

## 55. తలఎత్తని చూపు :

హసిఅం అదిట్ఠదంతం, భమిఅ మణిక్కంత దేహలీ దేసం,
దిట్ఠ మణుక్ఖిత్తముహం ఏసో మగ్గో కులవహూణం. (6-25)
(హసిత మదృష్టదంతం, భ్రమిత మనిష్క్రాంతదేహళీ దేశం,
దృష్ట మనిక్షిప్త ముఖం ఏష మార్గః కులవధూనామ్.)

మరొక అజ్ఞాతకవి కులస్త్రీల ప్రవర్తనను తాను మంచిదనుకొన్న రీతిలో తెలిపాడు: కులస్త్రీలు పలువరుస కనిపించకుండా నవ్వుతారు. మందహాసమే తప్ప ఇకిలించడం, సకిలించడం ఉండదు. ఎంత తిరిగినా ఇంటి తలవాకిలిలోపలే. తలవాకిలి దాటి వెలుపలికి రారు. తల ఎత్తి దేన్నీ చూడరు. ఇదే కులవధువుల మార్గం. (ఇప్పటి మహిళలకు ఈలాటి సూక్తులు నచ్చకపోవచ్చు; దానికి రెండు వేల ఏళ్ల నాటి కవి బాధ్యుడు కాడు. ఇప్పుడు ఆచారాలు వేరు. ఉద్యోగాలు చేసే మహిళలు ఇల్లు కదలక, తలయెత్తిచూడక, గట్టిగా నవ్వక ఎలా ఉండగలరు!)

## 56. వియోగార్త వదనం :

ఇది వరకు వాసుదేవు డనే కవి విరహాన్ని వర్ణించాడు. మరొక అజ్ఞాత కవి ఒక ప్రేమార్తవియోగినీ ముఖాన్ని తాను నిరంతరం చూస్తున్న దృశ్యాలతో పోల్చి సహజ సుందరత్వం కలిగిస్తాడు; ఆ పోలికలతో ఒక చెలికత్తె ద్వారా ఇలా చెబుతున్నాడు:

గేహం వ విత్తరహిఅం ణిజ్ఝరకుహరం వ సలిలసుణ్ణవిఅం,
దోహణరహిఅం గోట్ఠం వ తీఅ వఅణం తుహ వియోగే. (7-9)
(గృహమివ విత్తరహితం నిర్ఝరకుహరమివ సలిలశూన్యం,
గోధనరహితం గోష్ఠమివ తస్యా వదనం తవవియోగే.)

"ఓ ప్రేమికుడా, నీవు లేనందున, నీ వియోగంతో నీ ప్రియురాలు వాడి వత్తలయింది. ఆమె ముఖం చూడలేము. అది ధనరహితమైన ఇంటిలాగ, నీరు లేని సెలయేటి నల్లటి గాటిలాగ, పశువులు లేని కొట్టంలాగ శూన్యంగా ఉంది." ఇంటికి దీపం ఇల్లాలే అయినా, డబ్బు లేకపోతే ఇల్లు కళా విహీన మవుతుంది. దారిద్ర్యంతో ఇంటిలోని వారి సౌందర్య సుషమలు మెరుగారి పోతాయి. అలాగే సెలయేటిలో నీరు దూకుతూ వుంటేనే అందం. నీరు వట్టిపోతే నల్లటి చారలతో అరిగిపోయిన బండరాళ్లపై పడిన గాట్లతో సెలయేరు చూడ ఘోరంగా వుంటుంది. పశువులు కొట్టానికి ప్రాణం. అవి లేకపోతే కొట్టం ప్రాణంలేని బొందెలా వుంటుంది; వెల వెలబోతూ.

## 57. నిత్యరమణీయుడు :

దీసంతో దిట్ఠిసుఅ చిన్తిజ్జంతో మణ వల హో అత్తా,
ఉల్లావంతో సుఇసుహో పిఅ జణో ణిచ్చరమణిజ్జో. (7-51)
(దృశ్యమానో దృష్టిసుఖః చింత్యమానో మనోవల్లభః శ్వశ్రు,
ఉల్లప్యమానః శ్రుతిసుఖః ప్రియోజనో దృష్టిరమణీయః)

ఇష్ట మయినవారు ఏమిచేసినా మనకు హాయిగా వుంటుంది. ఇది ఇష్ట ఎకల జనానికి ఉన్న మనస్తత్వం. ఈ విషయాన్నే ఒక అజ్ఞాత కవి మనోహరంగా ఒక వనిత ద్వారా చెబుతున్నాడు. ఆ వనిత తన అత్తతో ఇలా అంటున్నది: "అత్తా, చూచావా! ఏమిటీ ఆశ్చర్యం! ఇష్టమైన వ్యక్తి కనిపిస్తే కళ్ళు చల్ల బడతాయి. అతడు మనసులో మెదలాడాడో మనసంతా హాయిగా వుంటుంది. ఇక మాట్లాడాడా వీనుల విందుగా వుంటుంది. ఇలా ఇష్టమయిన వ్యక్తి నిత్య రమణీయుడు సుమా! ఏమిటో ఈ రహస్యం!" ఇది వారి వారి మనస్సులోని భావనకు సంబంధించింది మనకు ఇష్టమైన వ్యక్తి నిత్య రమణీయుడుగా కనిపించి నట్టే, మహా సమర్థుడుగాను కనిపిస్తాడు. మనకు ఇష్టం వున్నప్పుడు ఏవేవో శక్తులు వానిలో కనిపిస్తాయి.

## 58. విధి విలాసం :

జం జం ఆలిహఇ మణో ఆసావట్టిహిం హిఅఅఫలఅమ్మి,
తం తం బాలో వ్వ విహీ ణిహుఅం హసిఊణ పంహుసఇ. (7-58)
(యద్యదాలిఖతి మనః ఆశావర్తికాభిః హృదయఫలకే,
తత్తద్బాల ఇవ విధిః నిభృతం హసిత్వా ప్రోంఛతి.)

ఏమేమో ఆలోచనలు చేసి, ఏవేవో కోరుకుని అవేవీ నెరవేరక నిరాశపడిన వ్యక్తి చెబుతున్న మాటలివి: ఈ గాథ చెప్పిన కవి ఎవరో గాని విధి లీలలను బాలక్రీడలతో పోల్చాడు. మనస్సు ఆశ అనే బలపంతో హృదయ మనే పలకమీద ఏమిటేమిటో వ్రాసుకుంటుంది. పెద్దలు పలకల మీద ఏదో ముఖ్యమని వ్రాసి పెట్టుకొన్న దానిని పిల్లలు తమ చాపల్యం కొద్దీ తుడిచివేసినట్టుగా ఊరికే కాదు, తనలో తాను గుంభనగా నవ్వుతూ తుడిచి వేసినట్టుగా విధికూడా నవ్వుకుంటూ తుడిచి వేస్తుంటాడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుందనేది ఇదే.

## 59. అనురాగం :

జే జే గుణినో జే జే అ చాఇణో జే విఅడ్ఢ విణ్ణాణా,
దారిద్ద రే విఅక్ఖణ తాణం తుమం సాణురాఓసి. (7-71)
(యే యే గుణినో యే యే చ త్యాగినో యే విదగ్ధ విజ్ఞానాః,
దారిద్ర్య రే విచక్షణ తేషాం త్వం సానురాగోసి.)

ఎందుకో ఏమో గుణాలకు ధనానికి పొత్తు కలవడం లేదు అనాదిగా. దారిద్ర్యం వాటిని వెదుక్కుంటూ వస్తుంది. ఈ విషయాన్ని ఎవరో అజ్ఞాతకవి భంగ్యంతరంగా చెప్పాడు దారిద్ర్యాన్ని సంబోధిస్తూ: ఓ దారిద్ర్యమా, ఎవరు గుణవంతులో, ఎవరు త్యాగులో, ఎవరు చతురులో, ఎవరు విశిష్ట జ్ఞాన వంతులో వారిని నీవెంతో అనురాగంతో చూస్తావు. నీ విచక్షణతను ఏమని చెప్పను? లోకంలో గుణవంతులను, త్యాగశీలురను, చతురులను, విజ్ఞాన నిధు లను దారిద్ర్యం అంటిపెట్టుకొని వుంటుంది. దీనికి కారణం ఉంది. గుణవంతులు, త్యాగశీలురు, చతురులు, విజ్ఞాన వంతులూ తమ ఆత్మ గుణాలకు ప్రాధాన్య మిచ్చినట్లుగా ధన సంపాదనకు ప్రాధాన్య మివ్వరు. తనను శ్రద్ధగా చూచే వారినే సిరి చల్లని చూపుతో చూస్తుంది. అశ్రద్ధ చేసేవారిని అనుగ్రహించదు.

## 60. స్నేహ మార్గం :

అతక్కి రూసణం, ఖణపసిజ్జణం, అలిఅ వఅణ ణిబ్బంధో,
ఉమ్మచ్ఛర సంతావో పుత్తఅ పఅవీ సిణేహస్స. (7-75)
(అకస్మిక రోషకరణం క్షణ ప్రసాదో హ్యాలీక వచన నిర్బంధః,
ఉన్మత్సర సంతాపః పుత్రక పదవీ స్నేహస్య.)

ప్రేమగాని, స్నేహంకాని తెలియాలంటే మార్గాలు విచిత్రమైనవి. అవి సూటిగా వుండవు; వంకరగా వుంటాయి. ఈ విషయంలో పండితుడొకడు ఒక నవయువకునికి ఇలా చెబుతున్నాడు: అబ్బాయి! స్నేహ మార్గం విచిత్రం. అకస్మాత్తుగా కోపగించుకోడం, క్షణంలో సంతోషం ప్రకటించడం, మచ్చరంలో బాధ పడడం:—ఇవన్నీ స్నేహసూచకాలు."

స్నేహంగాని, ప్రేమగాని ఎక్కువయితే ప్రేమపాత్రమయిన వ్యక్తిపై ఎక్కడలేని స్వాతంత్ర్యం వస్తుంది, ప్రేమించే వ్యక్తి. కనుక వూంకేనే రుసరుసలాడడం, అంతలోనే చల్లబడడం, మరికొంత సేపటికే బాధపడడం వంటి చిత్రవిచిత్ర చేష్టలు పుట్టుకు వస్తాయి. స్నేహాతిశయం అలా చేస్తుంది. అందు వల్లనే ప్రేమ పట్టిన వాడికి, దయ్యం పట్టిన వాడికి భేదం లేదన్నాడొక కవి. ఇద్దరూ ఎన్నెన్ని వెర్రి చేష్టలు చేయాలో అన్నీ చేస్తారు. స్నేహ ప్రేమలకు ప్రభుత్వానికి లేని అధికారాలు అబ్బుతాయి.

## 61. ఎవరు ధన్యులు?

ధణ్ణా బహిరా అంధా తేచ్చిఅ జీఅంతి మాణుసే లోఏ,
ణ సుణంతి పిసుణ వఅణం ఖలాణం ఇుద్ధిం ణ పేక్ఖంతి. (7-95)
(ధన్యా బధిరా అంధా స్త ఏవ జీవంతి మానుషే లోకే,
న శృణ్వంతి పిశున వచనం ఖలానాం ఋద్ధిం న ప్రేక్షంతే.)

ఈ గాథ చెప్పిన అజ్ఞాతకవి ఈ ప్రపంచంలోని గుడ్డివారిని, చెవిటి వారిని, "మీరే ధన్యులయ్యా" అని అభినందిస్తున్నాడు. "ఈ మానవ లోకంలో నివసించే చెవిటివారు, గుడ్డి వారూ ధన్యులు. వారే సుఖంగా మనగలుగు తున్నారు. ఎందుకంటే, చెవిటి వారికేమో కొండెగాళ్ల కొండేలు వినే దురవస్థ లేదు; గుడ్డివాళ్లకేమో దుర్మార్గుల అభ్యుదయాన్ని చూచే దుర్భాగ్యం లేదు." అని అంటాడు కవి.

ఈ ప్రపంచంలో దుష్టులే ఐశ్వర్యవంతు లవుతున్నారు. అలాంటి వారిని చూడవలసివస్తుంది. దుర్మార్గులు మంచివారి పైన ఏవేవో లేనిపోనివి చెప్పి అందరికి దురభిప్రాయం కలిగిస్తారు; తమ పబ్బం గడపుకొని పోతున్నారు. అలాటి వారి మాటలు వినవలసి వస్తున్నది. ఎందుకంటే, అలాటి వారే అధికారంలో ఉన్నారు; అలాటి వారే సంఘంలో పలుకుబడితో ఉంటున్నారు. ఏ చేస్తాం? వినక తప్పదు.

గాథా సప్తశతి లోకవృత్తం ఎంతో ఎరిగిన హాలసాతవాహనుడు గుది గుచ్చిన అపూర్వ పుష్పమాల, మణిమాల, ముక్తామాల. ప్రపంచానుభవం వడపోసి తేర్చిన గాథలు ఎన్నో ఉన్నాయి దీనిలో అని అనడం చర్వితచర్వణం, వాటిలో కొన్నిటిని దిఙ్మాత్రంగా ఇక్కడ ఉదాహరించాను.

# గాథాసప్తశతిలో మనస్తత్త్వాల మాధుర్యం

గాథా సప్తశతిలో వివిధ మనస్తత్త్వాలు మనకు దర్శనమిస్తూ ముచ్చట గొలుపుతాయి. జానపదకవులు నిరంతరం గ్రామీణులను, వారి జీవితాలను పరిశీలించడం వల్ల వారి మనస్తత్త్వాన్ని కూడ బాగా చిత్రించగలిగారు. కర్షకుల మనస్తత్త్వం, జారిణుల మనస్తత్త్వం, విటుల మనస్తత్త్వం, కులస్త్రీల మనస్తత్త్వం-వీర్కు, వారు ఏమిటి అందరి మనస్తత్త్వమూ చిత్రించారు గాథా సప్తశతి కవులు, కవయిత్రులూ. మచ్చుకు కొన్ని:

## 1. సుఖవేదాంతం:

సుఖమే ప్రధాన మన్నవారి మనస్తత్త్వం చెప్పనక్కరలేదు. ప్రియురాలు అలిగింది. ప్రియుడు అనునయిస్తున్నాడు. రాత్రి నిరర్థకంగా గడిచిపోతుందని అతని భయం. కనుక ఋణం కృత్వా ఘృతం పిబేత్ తత్త్వం బోధించడం ప్రారంభించాడు:

జీవిఅం అసాసఅం విఅ ణ ణివత్తఇ జోవ్వణం అఇక్కంతమ్,
దిఅహా దిఅహేహి సమా ణహోంతి కిం ణిట్టురో లోఓ?. (3-47)
(జీవిత మశాశ్వతమేవ న నివర్తతే యౌవన మతిక్రాంతమ్,
దివసా దివసైస్సమా న భవంతి కిం నిష్ఠురో లోకః?).

ప్రియురాలా, ఈ జీవితం శాశ్వతమయింది కాదు. గడిచిపోయిన యౌవనం తిరిగిరాదు. ఒకదినం మరునటి రోజుతో సమానంగా ఉండదు. అలాంటప్పుడు జనం సుఖం అనుభవించడానికి ఎందుకు జంకుతుందో!- అని ప్రియుడు భార్యను అభిముఖిని చేసుకోడానికి ప్రయత్నిస్తాడు.

## 2. శ్రమకు ఫలం:

ఎంతో కష్టపడి సంపాదించిన వస్తువు అనుకూలంగా లేక పోతేనే ఎంతో కష్టం కలుగుతుంది. అలాంటప్పుడు కష్టంతో సంపాదించుకొన్న ప్రియుడు అనుకూలంగా లేనప్పుడు, తన మనసెరిగి ప్రవర్తించనప్పుడు ఎలా వుంటుంది మహిళల మనస్సు?

దుఃఖేహిం లంభఇ పిఓ అద్ధో దుక్ఖేహి హోఇ సాహీణో,
లద్ధో హి అలద్ధో వ్వి అ జఇ జహా హిఅఅం తహా ణ హోఇ. (4-5)
( దుఃఖై ర్లభ్యతే ప్రియో లబ్ధో దుఃఖై ర్భవతి స్వాధీనః,
లబ్ధో ప్యలబ్ధ ఏవ యది యథా హృదయం తథాన భవతి.)

ఒక ఖండిత నాయిక తనగోడును తన నెచ్చెలితో చెప్పుకుంటుంది: ఎంతో కష్టంతో ప్రియుణ్ని సంపాదిస్తాము. అతడు ఎంతో కష్టంమీద స్వాధీనుడవుతాడు. కాని మనసు ఎరిగి ప్రవర్తించకపోతే ఆ ప్రియుడు లభించినా లంభించనట్టే- అని.

భర్తగాని, యజమానుడు గాని సులభంగా లభిస్తాడు. దయితుడు-ప్రియుడు ఎంతో శ్రమతోగాని లభించడు అంతగా ఎంతో శ్రమతో సంపాదించుకొని ఆత్మీయుణ్ణి చేసుకొన్న ప్రియుడు కాలవశాన మనసెరిగి మెలగకపోతే ఎలా ?

## 3. మంచి మిత్రుడు:

ఒకవ్యక్తి తన మిత్రుని విషయంలోనే పొరపాటు చేశాడు. అందువల్ల మిత్రుని చూడడానికే భయపడుతున్నాడు. అలాంటివాడి భయం పోగొట్టడానికి ఉత్తముని చరిత్రను ఉదాహరిస్తుంది ఒక దూతి:

> దృఢ రోసకలుసిఅస్స వి సుఅణస్స ముహాహిం విప్పిఅం కంతో?
> రాహుముహమ్మి వి ససిణో కిరణా అమఅం విఅ ముఅంతి. (4-19)
> (దృఢ రోషకలుషితస్యాపి సుజనస్య ముఖాదప్రియం కుతః,
> రాహుముఖే పి శశినః కిరణాః అమృతమేవ ముంచంతి.)

సజ్జనుని మనస్సు ఎంత రోషకలుషితమైనా అతని ముఖం నుంచి చెడు మాట వెలువడదు. రాహువు మింగుతున్నా చంద్రుడు అమృతమే కురిపిస్తాడు సుమా! కనుక నీవేమి భయపడవద్దు. నీ మిత్రుడు ఉత్తముడు- అని భయం పోగొడుతుంది దూతి. చంద్రుడు శత్రువును మింగుతున్నా అమృతం కురిపిస్తున్నట్లు నీ మిత్రుడు కూడ నీ అపరాధాన్ని సరకు చేయడని దూతి సమాశ్వాసంలోని భావం. దూతీ దూతలు కడుచతురులు. పనిని కర్తుం అకర్తుం అన్యథాకర్తుం సమర్థులు.

## 4. ఇల్లాలి కోపం:

> దిఅహం ఖుడుక్కిఆఏ తీఏ కాఊణ గేహవావారమ్,
> గురుఏ వి మణ్ణుదుక్ఖే భరిమో పాఅంతసుత్తస్స. (3-25)
> (దివసం రోషమూకాయా స్తస్యాః కృత్వా గేహవ్యాపారమ్,
> గురుక్వేపి మన్యుదుఃఖే స్మరామః పాదాంతసుప్తస్య.)

భర్త ప్రవాసంలో వున్నాడు. ఊరిలో వున్న ప్రియురాలయిన భార్య చెయిదాలు జ్ఞాపకం వస్తున్నవి ఒక్కటొక్కటే. ఒకనాటి సంగతి ఇది:

తనేదో అపరాధం చేశాడు. భార్యకు చాల కోపం వచ్చింది, కాని ఒక్క పలుకు కూడ పలుకలేదు పగలెల్లా ఇంటి పనులు చేసింది నోరువిప్పకుండా. అయినా కోపం చల్లారలేదు. చీకటి పడింది. పనులన్నీ ముగించుకొని పడక గదిలోకి వచ్చింది. ఇంకా కోపం అణగారలేదు, తనపాదాలకడ ముడుచుకొని పడుకుంది. అబ్బ! ఎంత మధురగంభీర సన్నివేశం!

ఒక్క మాటా పలుకూలేక కోపం ప్రకటించడం, చివరకు భర్త పాదాలవద్ద పడుకోడంతో కోప పరాకాష్ఠను ప్రదర్శించడం మానిని అయిన ఇల్లాలి మనస్తత్త్వానికి నిదర్శనాలు.

## 5. పాపడివంటి పంట :

పంకమఇలేణ ఛీరేక్కపాఇణా దిణ్ణజాణు వద షేణ,
ఆనందిజ్జఇ హాలిఓ పుత్తేణ వ సాలిచ్ఛేత్తేణ (6–67)
(పంకమలినేన క్షీరైకపాయినా దత్తజాను పతనేన,
ఆనంద్యతే హాలికః పుత్రేణేవ శాలి క్షేత్రేణ.)

కర్షకులు పంటలను పుత్రులతో సమానంగా చూచుకొంటారు. వారి నిరంతరపరిశ్రమ ఫలితం కదా అది మరి? కొడుకులను పెంచినట్టే శ్రద్ధగా చూచుకుంటారు పొలాలను వారు. చేను ఎదుగుతున్నకొద్దీ పిల్లవాడు ఎదిగి వస్తున్నంతగా పంతోషిస్తారు. ఈ గాథలో కవి శ్లేషతో వరి చేనును దోగాడుతున్న పసి పాపడితో పోల్చాడు.

వరి చేనికి పాలు పట్టింది. కాడలు బరువెక్కాయి. కింద బురద. పాలు పట్టగానే కంకులు కిందికి వంగడం మొదలవుతుంది. ఆ స్థితిలో ఆ చేను ఎలా వుందంటే బురదలో దోగాడే, పాలు తాగే పసి పాపలాగ వుందట. దానిని ఆనందిస్తున్నాడు హాలికుడు. దీనిలో హాలికుని అమాయక ప్రేమమన స్తత్త్వం మధుర మనోహరం.

## 6. ఆనంద గీతం :

సంగీతం ఆనందానికి అవిర్భావమన్నారు మన స్తత్త్వ విశ్లేషకారులు. మరొక రైతు గొంతెత్తి ఝామ్మని పాడేస్తున్నాడు. ఆ ఆనందానికి కారణమేమిటి ? పండిన వరిచేలు.

శరత్కాలం. కొత్త బియ్యం పిండి ఆరబోసినట్టుగా వెన్నెల. వరి చేను పూటుగా పండింది. కర్షకుడు ఆనందం పట్టలేకపోయాడు. గొంతెత్తి పాట ప్రారంభించాడు.

ణిప్పణ్ణ సస్సరిద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ,
దలిఅ ణవసాలి తండుల ధవల మిఅంకాసు రాఈసు (7-89)
(నిష్పన్న సస్య ఋద్ధిః స్వచ్ఛందం గాయతి పామరః శరది,
(దళిత నవశాలి తండుల ధవల మృగాంకాసు రాత్రిషు.)

## 7. ఖలులు - కుక్కలు :

దుర్మార్గులు రకరకాలవారు. వారిని నమ్మలేము. వారికీ, కుక్కలకూ భేదంలేదు-అంటాడు ఒక అజ్ఞాత కవి.

మా వచ్చహ వీసంభం ఇమాణం బహు చాటు కమ్మణిఉణాణం,
ణివ్వత్తిఆకజ్జ పరమ్ముహాణం సుణఆణ వం ఖలాణమ్. (7-32)
(మా వ్రజత విస్రంభ మేషాం బహు చాటు కర్మ నిపుణానామ్,
నిర్వర్తిత కార్యపరాఙ్ముఖానాం శునకానా మివ ఖలానామ్.)

దుర్మార్గులు ఏవేవో తియ్యని అల్లి బొల్లి మాటలు చెప్పడంలో నిపుణులు. అలా చెప్పి తమ పనులు చేసుకొని వెళ్లిపోతారు; మళ్లీ కనిపించరు. కుక్కలు తోక ఆడిస్తు చుట్టూ తిరుగుతాయి. ఏదో తిండి ముక్క దొరకగానే మనకు వెన్ను చూపుతూ వెళ్లిపోతాయి. మళ్లీ పని బడితేగాని కనిపించవు.

గాథా ప్రశస్తిలో దాదాపు ప్రతి గాథా ఏదో మనోవిశ్లేషణకు సంబంధించిందే గనుక జానపద కవుల పరిశీలన పాండితికి గాథాన ప్రశస్తి ప్రబల ప్రమాణంగా వెలుగొందుతుంది.

# వాడని పీడని మూడుకోణాలు

గాథా సప్తశతి కొంతకు కొంత తెలుగుగడ్డపై వెలసిన కవితా కదంబం. తెలుగుజాతిని వెలయించిన ముక్తకనికరుంబం. దీనిలో తెలుగువాడు ఆటవికుల జీవితాలను స్పృశించే ముక్తకాలు ఉన్నాయి. అలాటి గాథా ముక్తకాల భావంతో అల్లిన ఒక శబరుని కుటుంబ జీవితం ఇది.

కుమారుడు, తల్లి, కోడలు—వీరు ముగ్గురూ ఎడతెగని మూడు కోణాలు. ప్రేమకూ, అధికారానికీ అనాదిగా జరుగుతున్న సంఘర్షణ ఈ ముగ్గురిది. ఈ శబరుని కుటుంబంలో ముగ్గురూ ప్రేమ నిండిన మనం కలవారే. కాని, ఏదో అడ్డు తగులుతూ, అహంకారానికి దెబ్బ తగిలిస్తూ, ఉంటుంది.

## సవరి :

దుఃఖపడకుండా ఎలా మందగలనో చెప్పండి. అంతటి పరాక్రమవంతుడు నా కుమారుడు కదా! ఇత్తై వగ్యాన తన వికటకోదండాన్ని చెక్కుతుంటే—అందులోనా ఎలాటి అవసరమూ లేకుండ చెక్కుతుంటే—ఏమి చేయగలను దుఃఖ పడకుండా. పల్లె పెద్ద మా ఇంటి మగవాడు మడిసిన నాటి కంటే హెచ్చు దుఃఖం కలిగింది. నాకు.

ఆనాడు మా ఇంటి మగవాడు కన్ను మూస్తూ మూస్తూ ఏమని చెప్పాడు? "నాయనా, నా పేరుతో నీవు సిగ్గు పడకుండా చూచుకో" అనలేదూ! ఆయన ఎలాటి వాడనుకున్నారూ? ఒకసారి దొంగల భయంతో అందరూ పల్లె వదలి వింధ్య పర్వతం ఎక్కుదా మనుకున్నారు. తన బొందిలో ప్రాణం వుండగా అలాటి మాటలు తన చెవిని పడరాదన్నాడు మా ఇంటి మగవాడు.

అతనికి ఏనుగుల వేటంటే ఎంతో ఇష్టం. అతనిని చూచి ఏనుగులు ఘీంకరిస్తూ పారిపోయేవి; మదించిన ఏనుగులయినా సరే. కనుకనే, అతనిని మత్తగ ఇందుడు, గయదేవుడు అనేవారు. మా యింటి మగవాడి పరాక్రమం సంగతి భారవేల్ల మహారాజుల వారికి తెలిసింది. ఎంత ఆదరించారో! పండి అన్నయ్యా, ముద్దయ్య మావా, రామయ్య బావా ఎంత సంతోషంతో నాకు భారవేల్లులవారి అనుగ్రహం తెలిపారో!

అలాటివాడు ఒకనాడు ఏనుగుల వేటకు వెళ్లాడు. వేట కొన్నాళ్ల పాటు సాగుతుంది గదా అని, త్వరలో తిరిగి రాకపోతానా అని పుట్టింటికి వెళ్ళాను. మూన్నాళ్లుండి తిరిగి వస్తున్నాను. దారిలోనే నా మతి మతిలో లేదు. ఏనుగుల మదజల వాసనలు గుప్పుమన్నాయి. వెంటనే మదగజాలు గండస్థలాలు రాచుకొన్న కానుగ మానులూ కనిపించాయి. ఏనుగులకు యింత ధైర్యమా?

ఏదో అనాహుతం జరిగిందనుకున్నాను. నా అనుకోడం నిజమే అయింది. పల్లె చేరేవేళకు చావుబ్రతుకుల్లో ఉన్నాడు, మా ఇంటి మగవాడు. ఏ ఏమరుపాటున ఉన్నాడో! యూథనాథ గజాలన్నీ ఒక్కుమ్మడిగా కుమ్మినట్టున్నాయి.

ఇప్పుడేమో ఆ మత్తగజేంద్రుని కుమారుడు సవరసత్తి స్థితి ఇది. కోడలు సోకుంభ సౌభాగ్యానికి నాకు అసూయ అనుకుంటారేమో! ఎంతమాత్రమూ కాదు. దానిది అదృష్టమే. కనుసన్నల్లో మెలిగే మొగుడు. రూపయౌవనంతో మదించిందా యేమ. నా కొడుకు మొదటి విల్లు ఎత్తి ఎక్కుపెట్టలేనప్పుడు ఏమి చేస్తుంది చెప్పండి? చెక్కక? చెక్కి చెక్కి తన సౌభాగ్యాన్ని వీధిని విరజిమ్మినట్లు విరజిమ్ముతున్నది ధూళిని. అది సుడిగాలికి ఆమె సౌభాగ్యాన్ని ప్రకటించే ధ్వజపతాకలాగ మింటికి ఎగిరింది. కోడలు మొదట కాపురానికి వచ్చినప్పుడు చూడాలి. మా వాడు మరీ చిక్కిపోయి దురాకర్షమైనప్పటికీ వింటిని మోపుకొని వేటకు వెళ్లేవాడు ఒక్క అమ్ముతో పిడి ఏనుగులకు వైధవ్యం కలిగించేవాడల్లా కోడలి ఒక్క కడగంటి చూపుతో కరగిపోయి—ఒక్క బాణం మాత్రం తీసుకొని వెళ్లేవాడల్లా—బాణ కరండమే మోసుకుపోతున్నాడు. ఇంత ఎందుకు? ఇంకా దాని చనుకట్టు కుదురు కట్టి పెరిగీ పెరగకముందే వీడు వెర్రెత్తి పోవడం చూచి అమ్మలక్కలు చెక్కులు నొక్కుకొనేవారట. దాని చనుకట్టు పెరిగినకొద్దీ దాని నడుమూ సన్నబడింది. మా వాడూ సన్నబడ్డాడు. ఏం చేయను తల్లీ, ఏం చేయను? మా వాడు తన తండ్రి పేరు ఎలా నిలబెడుతాడో!

* * *

## సోకుంభం:

అబ్బబ్బ! ఎప్పుడూ వేట? వేట! ఏం వేటో!! ఏమి ఈ ఎడబాటో!! ఆయనను తలచుకొని కళ్ళుమూసుకుంటే ఒళ్లు పులకరించి కడిమిచెట్టే అవుతుంది. ఈ ఎడబాటు! ఇది సహింపరానిది; ఇది వైద్యుడు లేని వ్యాధి; దరిద్రం వచ్చి అయినవారి మధ్యన ఉండటం వంటిది; కాని వారి కలిమి చూడడం వంటిది. ఏ దిక్కు చూచినా, దిక్పాలకులు నిలబడ్డట్టు ఆతని రూపే కనబడుతుంది.

ఆ నాటి ముచ్చట ఇంకా మరచిపోలేను. నన్ను పట్టుకొని దొంగలు లాక్కుపోతున్నారు. ఇంతలో పిడుగుపాటులా అల్లె త్రాటి ఝుంకారం వినిపించింది. ఎవరో మహావీరుడు వస్తున్నాడు, భయంలేదు అని తోటి బందీలకు కూడ ధైర్యం చెప్పాను. కాని, ఆ ధ్వని అకాల జలదగర్జితమని నన్ను ఆ బందీలు వెక్కిరించారు. ఇంతలో ఎలా వచ్చాడో, వచ్చాడు—అప్పుడే గిల్లిన మామిడిపూగుత్తి వెంటబడే కొదమతుమ్మెదలాగ వచ్చాడు. ఆయన వచ్చాడో లేదో దొంగలు కాలికి బుద్ధి చెప్పారు.

"ఇక వెళ్ళండి. ఎందుకు ఆలస్యం? ఎందుకీ మందగమనం" అన్నాడు. చంద్రలేఖలాగ నా పెదవులపై తీగనవ్వు సాగింది. పల్లె వైపు కదిలాము. పైన ధవళవర్ణ పర్వతాలలాగ, దూదిపింజల పుంజాల లాగ శరత్కాల మేఘాలు ఆకాశంలో పరుగెత్తుతున్నాయి. దారి, పైకి కొంచెం ఆరి, లోపల కొంచెం మెత్తగా వుంటూ, అడుగువేస్తుంటే పాములాగ ఊపిరి విడుస్తున్నట్టుంది.

రేగుమ్మ అందించాడు. చెవిలో చెక్కుకున్నాను, ఎంతో మురిసిపోయాను. ఇంతలో ఇల్లు సమీపించింది. ఇంట్లో సేఫాలికా పుష్పాల గంధం ఊరికే వుండనిచ్చిందా? నా ప్రియుడు నిత్య రమణీయుడు; చూస్తే కనులు చల్లబడుతాయి; తలచుకుంటే మనస్సు చల్లబడుతుంది; మాటలు వింటే చెవులు హాయిపడుతాయి.

నా మనోరథం నెరవేరింది. ఆయన పల్లెకు కాపురం వచ్చాను. కొండమీది పల్లె ఎంత అందంగా వుందో! చుట్టూ దట్టమైన నీలపు చెట్లూ, గాలికి వంగి రాసుకొని కీచుమనే వెదురు వనాలూ, ఒళ్లంతా పూచిన కడిమి చెట్లూ, కడిగి తుడిచినట్లున్న కొండమీది బండలూ, హోరుమని పారే సెలయేళ్లూ, వాటి సరసన నాట్యమాడే నెమళ్లూ– ఆ ఊరి వారు ఎంత ధన్యులు!

అత్తయ్యగారు ఎంత మంచివారో! కన్నతల్లి మనసు "గోదావరి గట్టుకు వెళ్లకమ్మా. పాడుగట్లు శీలం [illegible]." అని హెచ్చరించారు కాపురానికి వచ్చిన కొత్తల్లో. "మంచి చెడు, సుఖం దుఃఖం తెలుసుకొని ప్రవర్తించేవారే ఆడవారు, తక్కిన వారు పురుషునికి ముదిమి వంటి వారు" అని హితవు చెప్పారు. తక్కిన పనులన్నీ మాని నన్ను తన కొడుకు సంజీవనౌషధిలాగ కాపాడుతున్నారు.

"అమ్మాయీ, మనం ముత్యాలు వదలి గురువిందలు గొప్పవనుకుంటామనే ప్రథే వుంది. అలాగ చేయకు. ముత్యాల హారాలు వేసుకో. యమునా నది తరగలపై నురుగలు కదలాడినట్టు వుంటుంది" అన్నారు. తలవంచుకొన్నాను. ఒకమారు మొక్కలు నాటడం కోసం ఎర్రమట్టి తోడి చేతులు కడుక్కుంటున్నాను. "ఎందుకమ్మా అంతగా కడుగుతావు? పగడాల తీగల వంటి వేళ్ల రంగు గదమ్మా అది!" అన్నారు. నవ్వుకొన్నాను. మరొకమారు హేమంత మారుతానికి పెదిమలు పగిలాయి. "నీ లేత వేళ్లతో తేనె మైనం పట్టించమ్మా" అన్నారు. ఇంకొకమారు మరీ ఇదయింది. గాలికి స్తనాంశుకం పైకి ఎగిరింది. పొంద మీది వంటి నొక్కులు కనిపించాయేమో! మదన నిధానాల ముద్రల వంటి పంటి నొక్కులు మరి! నవ్వుతూ "ఇలాటివి దాచుకోవాలమ్మా!" అన్నారు. సిగ్గుతో పరుగెత్తాను లోపలికి.

ఆయనంతా మరువం మొలక–సర్వాంగ సురభి. ఒక వసంత కాలారంభం మాట. మామిడి రెమ్మ మోసు తొడగగానే, రాజద్రోహం సంగతి చెప్పుకుంటున్నట్టుగా, అందరూ గుసగుసలు పోతున్నారు. మామిడి చిగుళ్లు కామదేవుని రక్తసిక్త హస్త భల్లాల లాగ కనిపించాయి. మరికొన్నాళ్లకు మామిడి పూతను చిలుకలు ముక్కులతో చిదిమి తింటున్నాయి. చిందిన మామిడి పూత రసంతో వాటి దేహాలు తడిశాయి. ఆ వాసనలకు తుమ్మెదలు ఝుమ్మని మూగాయి. ఒకచోట ఏకాంతంగా ఒక మధుకరం మాలతీ కలికపై వ్రాలి, కాళ్లతో రేకులు నొక్కిపట్టి, మకరంద పానం చేస్తున్నది; రెక్కలల్లార్చుతున్నది. ఇంతలో పెదవిపై కాటుతో ఆయన కనిపించాడు. తేనె తెట్టు పిండుతుంటే తేనె టీగ కుట్టిందట, పాపం! మరొక చెట్టునీడకు వెళ్లాను. "భ్రమరమా, కమలం వదలి వాసనలకు మోసపోయి వెలగపండు కోసం పరుగెత్తావా? బొమ్మలోని లడ్డుకు ఆశ పడడమా?" అని చెప్పి పొడిచాను. ఎంత భ్రమను పడ్డాను!

## సవర స్త్రీ :

అమ్మకు ఎంత అభిమానం? ఎవరో చుక్కల ఇర్రి చర్మం కోసం వచ్చారట. "మా వాడు జింకలపై విల్లు వంచి చేయి చేసుకోడు. పక్కింటి పొరిగింటి సవర యువకులను అడగండయ్యా!'' అని పంపివేసిందట. ఆమెకేమో నేను మరగయిూద నాయకుని వీరపుత్రు డనిపించుకోవాలనే తమకం. నేను ఏమి చేయను? ప్రేమ విషంలాగ విషమ మవుతుందంటారు. ఏనుగు తల లోని ఆణిముత్యాల దండలవంటి వేవీలేక సిగలో నెమలి కన్ను తురుముకొని గర్వంగా తలయెత్తి నిలుచున్న ఆ బందీని చూచినప్పటి నుంచి ఈ విషం ఒళ్ళంతా వ్యాపించింది: దిగడమే లేదు. ఇప్పుడు ఎవరు ఏమంటే ఏమి లాభం?

మదనాగ్ని ధూమంలాగ, మనసుడనే ఇంద్రజాలికునిచేతి మోహాన పింఛం లాగ, యౌవన విజయపతాకలాగ ఉంటూ, వాసనలు వెదజల్లే ఆమె తలకట్టు, మధూక కుసుమమాల వంటి కపోలాలు, ఆ కపోలాలలావణ్యాన్ని వంగి తాగుతున్నట్టున్న కర్ణావతంసాలు, మన్మథుని నిదురపట్టి పాలిండ్లు, సోగ కన్నులు—

కన్నులంటే జ్ఞాపకం వచ్చింది: ఆనాడు జింకల జంటపై విల్లెక్కు పెట్టాను. వెంటి లేడి పోతు లేడిని ఆశతో చూచింది. చేతిలోని విల్లు జారిపడింది. మరొక మారు: అడవికి నిప్పంటుకుంది. అడవంతా ప్రబారింది మంటల వెలుగుకు, అక్కడి జింకలు మోదుగలు పూచా యనుకున్నాయేమో! అక్కడి నుంచి కదలలేను! ఎంత అమాయకత్వం! ఇంకొక మారు: నా బాణం వెంటి జింకకు తగిలింది. తన సైదోడు ఎక్కడ కనుమరుగవుతాడో అని మోర తిప్పితిప్పి చూచింది; కటికవాడు లాక్కుపోయే బర్రె చూపులు జ్ఞాపకం వచ్చాయి. నా మనసు నీరయింది. పేరొకసారేమో, ఒక జింకల జంట పరస్పరం రక్షించుకొనడానికి ఒకదాని ముందు మరొకటి నిలబడసాగింది. నా కళ్ళు చెమర్చాయి. విల్లు దించివేశాను.

వర్షాకాలం వచ్చింది. కారుమబ్బులు ఏనుగు గున్నల్లాగ వింధ్య గిరి చరియలను ఎక్కుతున్నాయి సూర్యబింబం మరుగైంది. కొంగల బారు కాల పురుషుడు కాల నిర్ణయం కోసం ఆకాశాన గీసిన సుద్ద గీతలాగ కనిపిస్తున్నది. జలధారలనే పగ్గాలు కట్టి భూమిని ఎత్తదలచిన మేఘ కార్మికుడు ఎత్తలేక మూలిగినట్టు ఉరుములు వినిపించసాగాయి. గిరి పతనం చేసినవారి జీవాల లాగ కొండల పైని మేఘాలలోని మెరుపులు ధుకధుకలాడుతున్నవి. ఇంద్ర ధనుస్సు దెబ్బతిన్న మేఘమనే మహిషం కడుపులోంచి వ్రేలాడుతున్న పేగుల్లాగ వున్నాయి. మెరుపులు. మద గజాలు గోదావరి గట్టును తొండంతో కొట్టి కొమ్ములతో కోరాడుతున్నాయి. ఒక చోట ఒక మగ ఏనుగు బురదలో చిక్కుకున్నది. పిడి ఏనుగు దానిని పైకి తీయడానికి తొండం అందిస్తున్నది; చుట్టూ తిరుగాడుతున్నది. మరొక చోట ఒక ఏనుగు ఎంతో ఆకలిగొన్నా తన వల్లభను తలచుకుంటూ, మింగబోయిన తామర తూండ్లను తొండంలోనే పెట్టుకొన్నది. ఇదంతా చూచి నిర్విణ్ణుడినై ఇంటి ముఖం పట్టాను. ఇంటి కంచెపై కాకులు

వానకు ముద్దయిపోయి, రెక్కలు వ్రేలాడుతూ, మెడలు కుంచించుకొని శూల మెక్కించిన వాటిల్లా కనిపించాయి. వర్షాకాలం నన్ను చూచి పూచిన కొండ మల్లెలతో వికటాట్టహాసం చేసింది.

సోశుంభ వాకిట్లో పీడిన కొప్పుతో నిలబడి నిండు చూలాలులావున్న నింగిని చూస్తున్నది. మేఘాల వైపు చూచాను; ఆమె వైపు చూచాను - ఏమిటి నీ కోరిక అన్నట్టు. నావైపు కళ్ళు తేలవేస్తూ చూచింది. కంచె ఆవల వరాహి గుర్రుమన్నది. ఏమిటి దీని ధైర్యం! కొడుకు పుట్టగానే ఎంత ధైర్యం వస్తుంది ఈ ఆడ జాతికి— అన్నాను. నిట్టూరుస్తూ నవ్వింది సోశుంభ.

మా ఇద్దరినీ చూస్తూ దీపం కూడ నిశ్చలంగా ఉండిపోయింది. ఒకరి నొకరు క్రీగంట చూచుకున్నాము. చూపులు కలిశాయి. ఒకే మారు నవ్వు మొలకెత్తింది.

# ప్రాకృత సాహిత్యంలో సామాన్య మానవుడు

"సంస్కృతం ప్రకృతి; దానినుంచి పుట్టింది ప్రాకృతం, ప్రాకృత భాషక సంస్కృతశబ్దం ప్రకృతి.[1] అని వాచస్పత్యకారుడు చెప్పే వ్యుత్పత్తికాని, "సకల జగజ్జంతువులకు వ్యాకరణాది సంస్కారంలేని సహజ వాగ్వ్యాపారం ప్రకృతి; దానివల్ల కలిగినదిగాని, అదిగాని ప్రాకృతం. ప్రాకృతం బాలురకు, మహిళలకు సుబోధమయినది. సకల భాషా నిబంధన భూతమయిన వచనం. అది మేఘాలనుంచి పడిన నీరు వంటిది. అది దేశ విశేషాన్నిబట్టి సంస్కారాదులనుబట్టి విశిష్టతను పొంది, సంస్కృతాదులుగా తర్వాత విభేదాలు పొందుతుంది.'[2] అని రుద్రట రచిత కావ్యాలంకారాన్ని వ్యాఖ్యానించిన నమి సాధువు చెప్పిన వ్యుత్పత్తిగాని నాకు అంతగా నచ్చడంలేదు. సంస్కృత ప్రాకృతాలలో ఏదీ ఒకదానినుంచి మరొకటి పుట్టలేదు ఇవి రెండూ ఒక పూవుకింది రేకు, పై రేకని; కాదు కాదు; ఒక రేకు కింది భాగం పై భాగమని, ఒక నాణెం రెండు వైపులని ఒక కత్తి రెండు ప్రక్కలని నమ్మేవారిలో నేనొకణ్ని. సంస్కృతం ప్రాకృత భవమని, సామాన్యజనుల భాష అయిన ప్రాకృతం సంస్కరింపబడి సంస్కృతమయిందని అనేవారు మానవ జాతి తొట్ట తొలి ఛందోరూపమయిన-ఛందోరూపమని అనేకులు విశ్వసించే-ఋగ్వేదం తొలి మండలం తొలి ఋక్కు.

"అగ్నిమీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతమం"

వంటి దానిని ఒక్క ప్రాకృత గాథనయినా చూపవలసి వుంటుంది. అప్పటివారు, ఋగ్వేదకాలంనాటి వారుమాట్లాడిన, సామాన్యవ్యవహారంచేసిన భాష ఏదోమనకు స్పష్టంగా తెలియకపోయినా, ఛందోబద్ధమైన ఋగ్వేద రచిత మేధావుల భాష అయి సామాన్య ప్రజల భాష అంతకన్నా భిన్నంగా దానికి చాల సన్నిహితమయి వుంటుందని భావించడానికి అవకాశం వుంది పిషెల్ అన్నట్టు ప్రాకృతానికి, వైదిక సాహిత్యానికి పోలికలు చాల వున్నాయి; త్తణ-త్వన, అవి అయ్యై, విహి-పథి:, హోహి-బోధి, విఊ-విదు:, ఘింస-ఘ్రింస, రుక్ఖ-రుక్ష మొదలయిన పదాలను ఆయన ఉదాహరించారు.:[3] పైన పేర్కొన్న వాటిలో మొదటిది ప్రాకృతరూపం, రెండవది వైదిక రూపం. అందువల్లనే ప్రాచీన ఋగ్వేద కాలంనాటి సంస్కృతం, ప్రాకృతం ఒకే పూవురేకు రెండువైపులని అన్నాను.

---

1. ప్రకృతేః సంస్కృత శబ్దా దాగతః, అచ్-ప్రాకృతః ప్రాకృతభాషాయః సంస్కృత శబ్ద ప్రకృతికత్వాత్—వాచస్పత్యమ్.
2. సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభిః అనాహిత సంస్కారః
సహజో వచన వ్యాపారః ప్రకృతి: తత్రభవం, సైవవా ప్రాకృతం
బాల మహిళాది సుబోధం సకల భాషా నిబంధన భూతం
వచన ముచ్యతే. మేఘ నిర్ముక్తజల మివైక స్వరూపం
తదేవ దేశవిశేషా త్సంస్కార కరణాచ్చ సమాసాదిత విశేషం సత్
సంస్కృతాద్యుత్తర విభేదా నాప్నోతి— కావ్యాలంకార వ్యాఖ్య
ప్రాకృతి సాహిత్య కా ఇతిహాస్-డాక్టర్ జగదీశ్ చంద్రజైన్.

కాని, భాష-ఏ భాష అయినా ప్రవాహిని. కనుక ఋగ్వేద సంస్కృతం కూడ జనం ముఖ యంత్రంలో పడి మారక తప్పలేదు. ప్రాచీన భాషను పొల్లు పోకుండా కాపాడుకోవాలని నేనున్నట్టే అనాదూ వైయాకరణులు శాస్త్రయ పడడంవల్ల వైదిక సాహిత్యంలోని ఋక్కులకు, పనసలకు, పదపాఠాలు, ఉచ్చారణ రక్షణకు ప్రాతిశాఖ్యలు పుట్టాయి. కాలక్రమాన వైదికభాష కేవలం కర్మకాండ భాష కావడంవల్ల నిరుక్తాది నిఘంటువులు పుట్టాయి ; అర్థ రక్షణకు శిక్షాదులు పుట్టాయి. "వ్యాకరణం వేదాల రక్షణకు చదవాలి. రూపాగమ వర్ణ వికారజ్ఞుడే వేదాలను చక్కగా రక్షించగలడు" అని పతంజలి హితవు. [4]పాణిని కూడ "వేదే లోకే" అని విడదీయడం వల్ల సాహిత్య భాష, లౌకిక భాష వేరువేరయినట్టు స్పష్టపడు తుంది. మేధావుల మేల్మి భాషకు పోక తథాగతుడు తన ప్రాంతపు పాళీ భాషలో ధర్మోపన్యాసాలు చేసినట్టు పరిశోధకులు చెబుతున్నారు. ఆ పాళీ భాష ఋగ్వేద బ్రాహ్మణాదుల సంస్కృతాన్ని కొంచెం పసతో, కొంచెం ముఖ యంత్ర సౌలభ్యంతో వ్యవహరించినప్పటి రూపమని ధమ్మపదంలోని మూడు పంక్తులు చూస్తే స్పష్టమవుతుంది :

"యో చ వస్ససతం జంతు అగ్గిం పరచరే వనే,
ఏకంచ భావితత్తానం ముహుత్తం అపి పూజయ,
సా యేవ పూజనా సేయ్యో యంచే వస్ససతం హుతం."[5]

అందువల్ల ప్రాకృత సంస్కృతాలు రెండూ ఒక నాణెం రెండు వైపులని మరొకమారు మనవి చేస్తున్నాను.

భాష ప్రవాహిని గనుక ఈ ప్రాకృతం కూడ మారకతప్పలేదు. దీనిలోను సాహిత్య సంస్కారం గలది పై సాహిత్యమై, తక్కినది అపభ్రంశమైంది. ప్రాకృతమే అపభ్రంశమని కావ్యాలంకార వ్యాఖ్యాత నమి సాధువు దశాయించి చెప్పినా,[6] ఆ అపభ్రంశ ప్రాకృతమూ దేశ భాషలుగా వేయి చీలికలయింది. ప్రాకృత భాషల చర్చ నా ఇప్పటి వివక్ష కాదు, బౌద్ధ ధర్మ గ్రంథాల జోలికి గాని, జైనాగమ ప్రాకృతం జోలికి గాని నేనిప్పుడు పోను. వాటిలో సామాన్య ప్రజల విషయాలు చాల వుండవచ్చు, కాని, నా ఇప్పటి వివక్ష సాహిత్య ప్రాకృత మయిన గాథా సప్తశతి, వజ్జాలగ్గం, సేతుబంధం, గౌడవహో అనే నాలుగు కావ్యాలలో నగర ప్రసక్తి చాల తక్కువగా వున్న గ్రామీణ సామాన్య మానవుని స్థితిగతులు, జీవిత విధానం ఎలా చిత్రింపబడినవో మనవి చేయడమే.

---

4. రక్షార్థం వేదానా మధ్యేయం వ్యాకరణం, లోపాగమవర్ణ వికారజ్ఞో హి సమ్యగ్వేదాన్ పరిపాలయతి–పతంజలి మహాభాష్యం.

5. ధమ్మపదం పుట-35

6. ప్రాకృత మేనాపభ్రంశః-కావ్యాలంకార వ్యాఖ్య

సాహిత్య ప్రాకృతం సాహిత్య సంస్కృతానికి నిజంగా భిన్నం కావడానికి ప్రధాన కారణం సామాన్య మానవుడే ననుకుంటాను. సామాన్య మానవుణ్ని ప్రాకృత సాహిత్యం ఆదరించినట్టు, అభిమానించినట్టు సంస్కృత సాహిత్యం ఆదరించలేదు. మన ఆది కావ్యమైన రామాయణం కూడా రాజ రంజకమయినదే - అంటే కోర్టు పొయట్రీ. కనుక ప్రాకృత సాహిత్యం ప్రజారంజకం, ప్రజా విషయం కావడం పొరపాటు కాదు. ఈ దృష్టితో చూచినప్పుడు గాథా సప్తశతి ప్రజారంజక సాహిత్యంలో అగ్రస్థానం వహిస్తుంది. ఈ గాథా సప్తశతిలో కొంతయినా తెలుగ గడ్డపై వెలసినదని ఇదివరకే చెప్పాను. గాథ అంటే ఆర్యా వృత్త భేదం. ప్రజారంజక కవులు రచించిన ఈ అమర గాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు కూర్చినవాడు హాలశాతవాహనుడు. హాలుని కాలం క్రీస్తు శకం మొదటి శతాబ్దమని, 68 ప్రాంతంలో వున్నవాడని పండితుల నిర్ణయం. ఇతడు తాను రాజైనా, గ్రామ జీవన సౌందర్యం వెల్లివిరిసే గాథలను సేకరించి ప్రపంచానికే ముక్తక ప్రథనంలో మార్గదర్శకు డయ్యాడు; తెలుగువారి కల్పనా కమనీయతను దిగంతాలకు చాటాడు.

## గా థా స ప్త శ తి :

ప్రాచీనుల దృష్టి రసరాజమయిన శృంగారానికి పట్టం గట్టినట్టిదే గనుక, ఈ గాథలలో శృంగార రస ఛాయా లేనివి తక్కువేమయినా, ఆ శృంగార రస ధుని నుంచి తొంగి చూచే సామాన్య మానవుని జీవితం, నేడూ - సామాన్య మానవునికి పట్టాభిషేకం చేస్తున్నామని, అతని బాగోగులు తప్ప తమకు అన్యం లేదని, ప్రగతి కాములమని, అభ్యుదయ పథగాములమని చెప్పుకుంటున్న నేడు - ఆశ్చర్యం కలిగిస్తుంది, ఇంత సామాన్య విషయాలు ఇలాటి ఇంటి ముచ్చట్లు ఎలా కవితా స్థాయికి ఎక్కగలిగాయా అని. సామాన్య మానవునికి నా నిర్వచనం ప్రతి వృత్తిలోని సామాన్య గృహస్థులు - రాజకీయ సేవకుడు మొదలు నాపితుని వరకు. ఈ సామాన్య ప్రజల దైనందిన జీవితం, దారిద్ర్యం, కరువు కాటకాలు, వాగులు, వరదలు - వానకాలపు బురద వీధులు, ఎండ కాలపు మృగతృష్ణలు, దప్పి గొన్న బాటసారులు, చలి వెందలి చపలాతులు, చలి కాలపు నెగళ్లు, గొంగళ్లు అక్కరలేని నెరజాణల మొగుళ్లు వసంతోత్సవాలు, మొయిళ్లను చూచి మూడు నిట్టూర్పులు విడిచే ముదితలు, ఫాల్గునోత్సవాలు, పెండిండ్లు - పేరంటాలు, సతులు అసతులు, విధవలు వేశ్యలు, జారులు, పూజారులు, వంటలు వటులు, శిథిల దేవలయాలు, ప్రశిథిలపలయాలు, నగలూ నాణేలు - ఒక్కటేమిటి? గ్రామాలలోని ప్రతిదీ కావ్యవస్తు వయింది. ధర్మశాస్త్రం నిషేధించిన ఋతుమతీ సంస్పర్శన సంగమాలను కూడ ఈ కవులు వదల లేదు. ఈ రమణీయ జీవితానికి దిఙ్మాత్రంగా కొన్ని గాథలను ఉదాహరిస్తాను.

## 1. దారిద్ర్యం

దారిద్ర్యాన్ని చిత్రించడంలో ప్రాకృతకవి నేటి అభ్యుదయ రచయితను కల్పనలో ఎలామించి పోయాడో ఈ గాథలే సాక్షులు:

దుగ్గఅ కుటుంబఅట్టి కహంఁను మసధోఇఊణ సోఢవ్వా.
దసి ఓసరంత సలిలేణ ఉఅహ రుణ్ణ వ పడపణ,

(సిరిధమ్మఅస్స 1-18)

(దుర్గత కుటుంబాకృష్టిః కథన్ను మయాధాతేన సోఢవ్యా,
దశావసరత్సలిలేవ పశ్యత రుదితమివ పటకేన.)

కటిక దరిద్రం. ఉన్న ఒక్క గుడ్డనూ దినమూ గంజి, పులిమి ఆరవేస్తున్నారు. గుడ్డ చీకిపోయి ఇక ఉండలేనట్టుంది. ఆరవేసిన గుడ్డ అంచుల నుంచి నీటిబొట్లు కారుతున్నాయి, దానిని ప్రాకృత కవి సిరిధమ్మఅ చూచాడు. అతని హృదయం కూడ నీరు కారింది. ఆ దరిద్రపు సంసారం ఇంతవరకు లాగి లాగి ఉదికి ఉదికి, బాది బాది బాధపెడుతున్నది. ఇక ఉండలేను, ఈలాగుల్లు, బాదుల్లు సహించలేను-అని ఆ గుడ్డ ఏడుస్తున్నట్లు ఉంది అని ఉత్ప్రేక్షించాడు సిరిధమ్మఅ.

మరొక దరిద్ర దృశ్యం. దరిద్రుని ఇల్లాలు, నెళ్లు వచ్చాయి. నెళ్లలో ఏవేవో ఆశలు మొలకెత్తుతాయి మహిళలకు, కాని ఈ ఇల్లాలి భర్త దరిద్రుడు. ఏమి తెచ్చి పెట్టగలడు? కనుక "ఏమి కావాలి?"-అని అడిగినప్పుడెల్లా "మంచి నీళ్లు కావాలి!" అని అడిగేనట పాపం ఆ బీదరాలయిన మాలింత.

దుగ్గఅ ఘరమ్మి ఘరిణీ రక్ఖంతీ ఆఉలత్తణం వఇణో,
పుచ్ఛిఅ దోహల సద్ధా పణోవి ఉఅఅం విఅ కహేఇ.

(5-72)

(దుర్గత గృహే గృహిణీ రక్షంతీ ఆకులత్వం పత్యుః
పృష్టదోహద శ్రద్ధా పునరపి ఉదకమితి కథయతి.)

తానుఏమి అడిగినా భర్త తేలేడు. అతని ఆకులత్వం పోగొట్టడానికి ఎన్నిసార్లడిగినా పాపం 'మంచి నీళ్ల మంచి నీళ్లు' అని వొకటే సమాధానం. లేనివి అడగడ మెందుకు? బంగపడి భర్త మనస్సు కష్ట పెట్టడ మెందుకు?

చలి కాలం. దరిద్రుడు పిడకలకుమ్ము ముందు చలి కాచుకొంటున్నాడు. అతడు కట్టుకొన్న గుడ్డ పిడకల కపు కొడుతూంది; పొగమారి కావిరంగెక్కి చేతకూడ నడలిపోయింది. ఎంత దైన్యం! హేమంత ఋతువు ఇలా దరిద్రుణ్ని పట్టి చూపు తున్నది-అంటాడు కవి అణ్ణఅ.

సూచిజ్జఇ హేమంతమ్మి దుగ్గఅ పుప్పు అ పఅంధేణ,
ధూమకవిలేణ పరివిరలతంతుణా జుణ్ణ పడేణ.

(అస్స 4-29)

(సూచ్యతే హేమంతే దుర్గతః కరీషాగ్ని సుగంధేన
ధూమకపిలేన పరివిగల తంతునా జీర్ణ పటకేన.)

## 2. గ్రామీణ దృశ్యాలు :

ప్రాకృత కవులు చిత్రించిన గ్రామీణ దృశ్యాలు రాజ రంజక కవుల కల్పనలకు అతీతమైనవి. ప్రాకృత ప్రజారంజక కవి తన పరిసర సామాన్య

విషయాలను మనోహరంగా అతి సహజమైన ఉపమోత్ప్రేక్షలతో ప్రయత్న పూర్వకంగా గ్రహించ దగినట్లుగాక సులభగ్రాహ్యంగా చిత్రిస్తాడు.

పాలేహ అచ్ఛభల్లం వ ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంతఆల పహిఓ విజ్ఝాఅంతం పలాలగ్గిమ్.

(కాలసీహాస్స. 2-9)

(పాటయత్యచ్ఛభల్లం ఇవ పశ్యత కుగ్రామ దేవకుల ద్వారే,
హేమంతకాలపథికో విధ్మాయమానం పలాలాగ్నిం.)

ఈ గాథలోని చిత్రం, దాని వర్ణన అపురూపాలు చలికాలం, పల్లెటూరి దేవాలయంముందు ఒక బాటసారి గడ్డి నెగడు వేసుకొన్నాడు. చలికి గడ్డినెగడు ఎంతసేపుంటుంది? త్వరలో ఆరిపోతుంది. పైకి ఆరిపోయినట్లు కనిపించినా, లోపల నిప్పు ఉంటుంది. కమక నెగడును కర్రతో కెలుకుతున్నాడు. అది ఎలుగుబంటిని చీల్చుతున్నట్లు ఉందట. కాలిన గడ్డిమంట ఆరిపోగానే, నల్లగా పెద్దరాశివలె కనిపిస్తుంది. కర్రతో కెలికితే లోపల నిప్పు కణకణ మంటుంది. కవి కాలసింహుడు ఈ దృశ్యాన్ని పొట్ట చీలుస్తున్న ఎలుగుబంటితో పోల్చాడు.

పల్లెటూరి మడికయ్యలలో జరిగే శృంగార నాటకాలను హాలుడు ఎన్నింటినో ఏరాడు. వాటిలో విశిష్టమయినది ఒక్కటి. పాలేరుకు గృహస్వామినికి మనసు కలిసింది. డన్లప్ పక్కలను, హంసతూలికా తల్పాలను తలదన్నే మడికయ్యలలోనే వారు మన్మథుని ఆరాధించారు. ఆమె ఆనంద పారవశ్యంతో కనులు మూసుకుంది. ఎంతసేపయినా తెరవలేదు. పాలేరు వెర్రిబాగులవాడు. యజమానురాలు చచ్చిపోయినదేమోనని భయపడుతాడు; కాలికి బుద్ధిచెప్పాడు. వాడి వెర్రికి గట్టుమీద అరవిచ్చి వంగిన పత్తికాయ నవ్విందట, ఆనందంతో చొక్కిన ప్రియురాలిని వదలిపోతున్నాడే అని.

అజ్జం మోహాణ సుహిఅం ముఅత్తి మోత్తూణ పలాఅప హాలిఏ,
దరఫుడిఅ వేంటభారోణఅఇ హసిఅం వ ఫలహీ ఏ. (4-60)

(ఆర్యాం మోహన సుఖితాం మృతేతి ముక్త్వా పలాయితే హాలికే,
ఈషత్స్ఫుటిత వేంటభారా వనతయా హసితమి వకార్పాస్యా.)

పత్తికాయ కొంచెంగా పగిలినప్పుడు పగిలిన డిప్పల అంచులు ఎర్రగాను, తడి పత్తి వెన్నెల రంగుతోను ఉంటాయి. అరవిచ్చిన పత్తికాయను నవ్వుతో పోల్చినందుకు ప్రాకృత జనరంజక కవికి ఏమి ఇచ్చినా తీరదు. రాజరంజక కవికి ఇలాంటివి ఎందుకు తోచవో!

ఏవస్తువునన్నా పగ్గంకట్టి పైకి లాగుతున్నప్పుడు, అది బరువుతో లేవనప్పుడు అప్రయత్నంగా మన నోటినుంచి కేకలు, అర్భాటాలు బయలుదేరుతాయి. వర్షాకాలం. పైనుంచి పగ్గాలు విసిరినట్టు సంతతధారగా వర్షం కురుస్తున్నది, ఉరుములు వినిపిస్తున్నాయి. ప్రజారంజకకవి సహజంగా బరువులెత్తేవారిని చూచినదృష్టితోనే చూశాడు ఈ దృశ్యాన్ని. ''మేఘమనే కార్మికుడు సందులేకుండా భూమిని

వగ్గాలుకట్టి పైకి లాగుదామనుకున్నాడు. ఎంతో ప్రయత్నించాడు. లాగలేక పోతున్నాడు. మూల్గుతున్నాడు. ఆ మూల్గులే ఉరుములు!'' అని వర్ణించాడు కవి,

అవిరల పడంత ణవజలధారా రజ్జు ఘడిఅం పఅత్తేణ,
అపహుత్తో ఉక్ఖేత్తుం రసఇవ మేహో మహిం ఉఅహ. (5-88)

(అవిరల పతన్నవ జల ధారా రజ్జు ఘటితాం ప్రయత్నేన,
అప్రభవన్నుత్క్షేప్తుం రసతీవ మేఘో మహీం పశ్యత.)

వర్షాకాలంలో గ్రామంలోని దారులన్నీ బురదయిపోతాయి. అప్పుడు నడువలేము. కాని శరత్కాలం రాగానే బురద ఎండడం ప్రారంభిస్తుంది. దారులు పైన ఆరుతాయి. కాని, తొక్కితే, పైన నడిస్తే, మెత్తగా అణగిపోతూ, ఒత్తిడికి బుస్సుబుస్సుమనే ధ్వని కలుగుతుంది. దానిని చూస్తే ఎలా వుందంటే, జనం నడయాడుతుంటే దారులు ఊపిరి వదలుతున్నట్లున్నదట.

అబ్భంతర సరసాఓ ఉవరి పవాఅబద్ధ వంకాఓ,
చంకమ్మత్తమ్మి జణే సమూససంతి వ్వ రచ్ఛాఓ. (7-13)

(అభ్యంతర సరసాః ఉపరిప్రవాతబద్ధ పంకాః,
చంక్రమమాణే జనే సముచ్ఛ్వసంతీవ రథ్యాః.)

వీధుల్లోని ఆటలు, కుస్తీలు ప్రాకృతకవి దృష్టిలో పడడం సహజం; అవి సామాన్య మానవుని వినోదాలు గనుక. ఒక ముసలి మల్లుడు ఎన్నో మల్ల యుద్ధాలు చేశాడు. వాటిలో ఎదిరి మల్లులు కొట్టిన దెబ్బలకు అతని చెవులు చిట్లి చితికి బండబారిపోయాయి. అలాటివాడు కాసె బిగించి కుస్తీకి సిద్ధమయ్యాడు. అతని కాసె బిగింపు చూడగానే ఎదిరి పిరికిమల్లుని గుండె గుభేలు మన్నది; గుండె పెల్లగించుకొని వచ్చింది భయంతో.

జుజ్ఝచవేడా మోడిఅ జజ్జరకణ్ణస్స జుణ్ణ మల్లస్స.
కచ్ఛా బంధో చ్చిఅ భీరుమల్ల హిఅఅం సముక్ఖణఇ. (7-84)

(యుద్ధచపేటా మోటిత జర్జరకర్ణస్య జీర్ణమల్లస్య.
కచ్ఛాబంధ ఏవ భీరుమల్ల హృదయం సముత్ఖనతి.)

మరొక వీధిలో మల్లుడు తప్పెట కొడుతున్నాడు. మల్లుని భార్య తప్పెట దరువుకు అనుగుణంగా నాట్యం చేస్తున్నది. ఒకతె ఆ మల్లిని-మల్లుని భార్యను ఎత్తి పొడుస్తుంది: ''ఓ మల్లీ నీకు సిగ్గు లేదూ! ఎంత దురదృష్టమే నీది! భర్త డప్పుకొడితే ఆడుతావే?''

అణత్తం కేణ తుమం పఇణో పహపణ పడహసద్దేణ,
మల్లి, ణ లజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జంతే. (7-85)

(ఆజ్ఞప్తం కేన పత్యాం పత్యా ప్రహతేన పటహశబ్దేన,
మల్లి న లజ్జసే నృత్యసి దౌర్భాగ్యే ప్రకటీక్రియమాణే.)

## 3. గార్హస్థ్య సౌందర్యం:

ఆ కాలపు ప్రేమకురాలు పద్మినీజాతి స్త్రీయే కానక్కరలేదు. అనుక్షణం మన కళ్ళెదుట మసలుతూ ఇంటిపనులలో నిమగ్నురాలైన ఇల్లాలు కూడా ప్రేమకురాలు కాగలదని ప్రాకృతకవి సిద్ధాంతమయి వుంటుంది. లేకపోతే ప్రాకృతకవి భీమసామి

రంధణకమ్మ ణిఉణిఏ మా జూరసు రత్తపాడల సుఅంధం,
ముహమారుఅం పిఅంతో ధూమాఇ సిహీ ణ పజ్జలఇ.

(భీమసామినో. 2-24)

(రంధన కర్మ నిపుణికే మాకృధ్యస్వ రక్తపాటల సుగంధమ్,
ముఖమారుతం పిబన్ ధూమాయతే శిఖీ న ప్రజ్వలతి.)

అని అనివుండడు. ఇల్లాలు వంటచేయాలి. పొయ్యి రాజవేసింది. కాని, పొయ్యి రాజడంలేదు. నిప్పు మండడంలేదు. భర్త చలోక్తి విసురుతాడు. "వంటల్లో ఆరితేరిన గడసరిదానా, పొయ్యి ఊదడం మాను. కోపగించుకోకు పొయ్యిమీద. నీ ఊర్పుల కమ్మతావిని మరికొంతసేపు ఆస్వాదించాలని కోరుకుని అగ్నిదేవుడు మండడం లేదు సుమా!" అని, ఈ గాథాకవి భీమస్వామి వంచి హాస్యకుశలుడయి వుంటాడు. ఇంతచిన్న విషయంపై సరసంగా ఊహించడమంటే మాటలా!

ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశానవైరాగ్యం అని మూడు విధాలుగా కుహనావిరాగులను ఎత్తిపొడుస్తుంటారు పెద్దలు పురాణం విన్నంతసేపూ అపక్వమనస్కులు మంచి పనులు చేయాలని, ఈ సంసారం రోత అని భావిస్తారు. అలాగే శ్మశానంలో ఎవరికన్నా దహన సంస్కారం జరుగుతుండడం చూచినప్పుడు "ఏమిటి ఈ మొండికట్టె! అనిత్యం. ఎప్పటికయినా మనమంతా కాలిపోవలసినవాళ్ళమే" అని అనుకుంటాడు. కాని తర్వాత ముందులాగే సంసారంలో కూరుకుపోతాడు. అలాగే ప్రసూతి వైరాగ్యమూను. అధీరలయిన స్త్రీలు కొందరు ప్రసవ వేదన భరించలేక "ఇక మగడు వద్దు! వాడి ముఖం చూడను" అని ఏడుస్తారు. మళ్లీ ఎప్పటిలాగే కాపురం కొనసాగిస్తారు. అణురాఅదనే కవి తను గ్రామంలో చూచిన ఇలాంటి ఘటనను కడుముచ్చటగా వర్ణించాడు:

తొలి కాన్పు, ఎంత నాగరకురాలూ, ధైర్యశాలినీ అయినా, భయంగా వుంటుంది ఏమవుతుందోనని. మొదటి కాన్పు గనుక ప్రసవ వేదన భరింప రానిదయింది. "అమ్మో! ఇక మొగుడు వద్దు. మొగుడి ఊసే వద్దు. చాలు" అని పదే పదే అనడం ప్రారంభించింది ఒక ముద్దుల గుమ్మ. దానిని విని అక్కడ గుమిగుడిన వారందరూ నవ్వారట. (నవ్వరూ మరి!)

హాసావిఅ జణో సామలీఅ పఢమం పసూఅమాణాఏ,
వల్లహవాఏణ అలం మమత్తి బహుసో భణంతీఏ.

(అణురాస్స. 2-28)

(హాసితో జనః శ్యామయా ప్రథమం ప్రసూయమానయా,
వల్లభవాదేనాలం మమేతి బహుశో భణంత్యా.)

ఇటీవల 45 సంవత్సరాల వయస్సు తర్వాత పెళ్లాడి కాన్పు వచ్చిన ఒక అధికారిణి, భయపడుతూ, ప్రతి తల్లినీ అడిగింటట కాన్పుకు ముందు "ఏమవుతుంది? ఎలా వుంటుంది?" అని. అయినప్పుడు, ఏమాత్రం వైద్యసౌకర్యాలు లేని రెండు వేల ఏళ్లనాటి గ్రామాల అర్భకురాలు భయపడడంలో ఆశ్చర్య మేముంది?

ఒకతె భర్తను మరొక జాణ వలచింది. ఈమె నిలదీసింది. ఆమె కాదన్నది. కాని, ఈమె ఒప్పుకోలేదు. "నాకు తెలుసు నీ ప్రవర్తన. నీవు రాత్రల్లా నావానితో కలం కపోతే ఎందుకలా ముర్రుపాలు తాగిన కొత్త గేదె చూడవలె పగలల్లా పడి నిద్రపోతావు?" అని ప్రశ్నించింది. ఆమె ఏమి సమాధానం చెప్పగలదు?

జఇ హోసి ణ తస్సపియా అణుదిఅహం ణీసహేహిం అంగేహిం,
ణవసూఅ పీఅపే ఊసమత్త పాడివ్వ కిం సువసి?

(ముహారాఅస్స 1-65)

(యది భవసి న తస్య ప్రియా అనుదివసం నిస్సహై రంగైః,
నవసూత పీత పీయూషమత్త మహిషీవత్సేవ కిం స్వపిషి?)

అప్పుడు పుట్టిన పసిపాపలు 23 గంటలు నిద్రపోయినట్లే పశువుల దూడలు కూడ జున్నుపాలు తాగి మత్తుగా నిద్రపోతాయి. రాత్రల్లా రతివిలాసంతో అలసి సొలసి పగలల్లా నిద్రమత్తులో వున్నవడతిని ప్రాకృతకవి ముఖరాగుడు సహజసుందరంగా తను నిత్యం గ్రామాలలో చూచే కొత్త గేదె దూడతో పోల్చడం రాజరంజకకవి ఊహకు దూరమని నా విశ్వాసం.

ఏ తల్లికయినా తన పిల్లడు చేసిన చేష్టలు గొప్పగా కనిపిస్తాయి. ఒక తల్లి పిల్లడికి అప్పుడే పాలపండ్లు వచ్చాయి. ఆ పాలపండ్లతో వాడు రేగుపండు కొరికాడు. రెండు గాట్లు పడ్డాయి. రేగుపండుమీద ఆ రెండు గాట్లూ ఆమెకు ఏమనిపిస్తాయో! ఏమని పించాయో! "ఇదిగో! మిమ్మల్నే, తీసుకోండి. చూడండి దీనిని" అంటూ నవ్వుతూ పిల్లడు పాలపండ్లతో కొరికిన రేగుపండును భర్తకు చూపిందట.

గేణ్హాహ పలోఅహ ఇమం పహసిఅవఅణా పఇస్స అప్పేఇ,
జాఆ సుఅ పఢముబ్భిణ్ణ దంతజుఅలంకిఅం బోరమ్.

(హారితఉస్స. 2-100)

(గృహ్ణీత ప్రలోకయత ఏనం ప్రహసిత వదనా పత్యురర్పయతి
జాయా సుతప్రథమోద్భిన్న దంతయుగళాంకితం బదరం.)

దీనిలో ఒక వైద్యక శాస్త్ర రహస్యమూ ఉంది. పిల్లలకు పళ్ళు వచ్చేవరకు భార్యాభర్తలు తప్పనిసరిగా శయ్యావధ్యం చేయాలి. తర్వాత అక్కరలేదని కాదు. అంతలోగా కక్కుర్తి పడరాదని. అందుకనే భార్య భర్తతో "మహాతొందరపడేవారు. ఇక పరవాలేదు." అని నవ్వుతూ రేగుపండును చూపడం.

మైనం పలకపై బలపంతో వ్రాసినది పిల్లలు తుడిచి వేస్తుంటారు. దీనిని ప్రాకృత కవి ఒక జీవిత సత్యానికి అన్వయించాడు. మనసు ఏవేవో పిచ్చి కోరికలనే గీతలు గీస్తుంటుంది. మనసుకు వ్రాతసాధనం ఆశ. దానితో హృదయమనే పలకమీద వ్రాస్తుంది ఏవేవో పిచ్చి పిచ్చి గీతలు. వాటిని విధి పిల్లవాడివలె నవ్వుతూ తుడిచివేస్తుంటాడు-అని. పిల్లవాడికి ఇతరుల లాభా లాభాలతో పనిలేదు. ఎవరేమి వ్రాసినా పిల్లలు తుడిచివేస్తుంటారు చిలిపి చేష్టలతో.

జం జం ఆలిహఇ మణో ఆసావట్టిహిం హిఅఅ ఫలఅమ్మి,
తం తం బాలో వ్వ విహీ ణిహుఅం హసిఊణ పుంఛఇ. (7-58)
(యద్యదాలిఖతి మనః ఆశావర్తికాభిః హృదయ ఫలకే,
తత్తద్బాలక ఇవ విధిః నిభృతం హసిత్వా ప్రోంఛతి.)

పిల్లల చేష్టలు, వినోదాలు మనం ప్రతిక్షణం చూస్తుంటాము. ప్రాకృత కవి దానితో ఒక నిత్యసత్యాన్ని అనుసంధించాడు.

మామిడిపండు అచ్చగా మనదేశంది. బుద్ధుని కాలంలోనే ఆమ్రవనం, ఆమ్రపాలీ ఉన్నప్పుడు గాథాసప్తశతిలో మామిళ్ల ప్రసక్తికి ఏమి కొదువ? ఊళ్ళలో శత్రుపక్షాలుంటాయి. విజితులయిన రాజుల రాణులు తక్కినవారు కూడ ఏవో గ్రామాలలో తలదాచుకోడం కలదు. కాని, గ్రామాలలో ఒక శత్రుపక్షంవారి కోరికను మరొక పక్షంవారు మన్నింపరు. తటస్థులు తమకేమీ పట్టనట్టు వూరుకుంటారు. ఇలాటి శత్రుపక్షానికి చెందిన ఒక మహిళ పుత్రునితో పాటు ఒకచోట వుంది. అక్కడ ఒక మామిడిచెట్టు. దానిలో ఒక పండు మాగి వ్రేలాడుతూంది. పిల్లవాడు ఆ పండు కావాలని తల్లిని కోరాడు ఏడుస్తాడు. తల్లి దారిని పోయే ప్రతి దానయ్యను అడుక్కుంది "పండు ఎత్తున వుంది. అందు కోలేను. పిల్లాడు ఏడుస్తున్నాడు తెంపి ఇవ్వండి బాబూ!" అని. కాని పథికు లెవరూ ఆ దీనురాలయిన తల్లి మాటను చెవిన వేసుకోలేదు. "ఈమె శత్రుపక్షానికి చెందింది. మనం పండు తెంపి ఇస్తే మనపక్షంవారు ఏమనుకుంటారో!" అని రెండవ పక్షంవారు వినకుండాపోయారు. తటస్థులేమో "మనకెందుకు? ఎవరి వాళ్ళు తమ వాళ్ళకు సహాయం చేసుకుంటారు." అని ఊరుకున్నారు.

విసమట్ఠిఅ పక్కేక్కంబ దంసణే తుజ్ఝ సత్తు ఘరిణీఏ
కో కో ణ పత్థిఓ వహిఆణం డింభే రుఅంతమ్మి. (6.95)
(విషమస్థిత పక్వైకామ్ర దర్శనే తవ శత్రు గృహిణ్యా.
కః కో న ప్రార్థితః పథికానాం డింభే రుదతి?)

ఈ శత్రుగృహిణి ఎక్కడిదో? ఏరాజుభార్యో? ఏసామంతుని భార్యో?

## 4. రాజరహస్య:

ఎంత కాదనుకున్నా చెదురుగా రెండు మూడు చోట్ల పట్టణచ్ఛాయలు కూడా గాథాసప్తశతిలో లేకపోలేదు నందుల కాలపు రాజవిప్లవాలు, మరికొన్ని

అరాచకాలు కొన్ని గాథలలో ధ్వనిస్తున్నట్టు కనిపిస్తుంది. గాథాసప్తశతి ఐదవశతకం 17 వ గాథ నందవంశ మూలపురుషుని కథను ధ్వనింపజేస్తున్నదని శ్రీ నే. నూతల శ్రీకృష్ణమూర్తిగారు భావిస్తున్నారు. ఆ గాథ ఇది:

అమ, అసత్థొ, ఓసర, పఇవ్వప ణతుహ మ.లిఅం గోత్తం,
కిం ఉణ జణస్స జాఅవ్వ చందిలం తా ణ కామేమో. (5-17)
( అమ, అసత్యో వయం అపసర పతివ్రతే న తవ మలినితం గోత్రం,
కింపున ర్జనస్య జాయేవ నాపితం తావ న్న కామయామహే.)

"ఔను, మేము లంజలం, దగ్గరకు రాకు. నీ వంశం మైలపడి పోయేని? కాని, మేము సామాన్య సంసారి భార్యలాగవుండి నాపితుని కామించ లేదే?' అని ఈ గాథ అర్థం. నందులకు పూర్వం భారతదేశ పరిపాలకులు శిశునాగులు. శిశునాగులలో చివరివాడు కాలాశోకుడు. కాలాశోకుని భార్యకు అస్సాసి నాపితునికి సంబంధం కలిగింది. ఆ నాపితుడు ఆమె సహాయంతో కాలా శోకు చంపి, రాజ్యం ఆక్రమించుకొని, నందవంశానికి మూలపురుషుడౌతాడు[7]. వీడిని నాపిత దాసుడని కూడ కొందరన్నారు. నందులు అధార్మికులని, ఉన్నత కులుల కారని మహావంశం అంటున్నది.

ఇలాటి రాజకీయ విషయమే మరొకటి ఒక గాథలో సూచితమైంది. వసంత ఋతువు వచ్చింది. మామిడి కొమ్మ మోసులెత్తి చిగిర్చింది. పాంథులు భయపడిపోయి, ఈ విషయం ఏదో రాజద్రోహ వార్త చెప్పినట్లు గుసగుసగా ఒకరి చెవి మరొకడు కొరుకుతూ చెప్పుకున్నారట.

రాఅ విరుద్ధం వ కహం పహిఅ పహిఅస్స సాహఇ ససంకమ్,
జత్తో అంబాణ దళం తత్తో దర ణిగ్గఅం కింవి. (4-96)
(రాజవిరుద్ధామపి కథాం పథిక: పథికస్య కథయతి సశంకమ్,
యత్ర ఆమ్రాణాం దళం తత ఈష ర్నిర్గతం కిమపి.)

నందుల మూలపురుషుని గాథ లాగే, ఇది కూడ అజాతశత్రువు తన తండ్రికి చేసిన ద్రోహానికి, జనం ఏదో గుసగుసగా చెప్పుకున్నదానికి సూచనమయి వుంటుందని నా అభిప్రాయం. అజాతశత్రువు తన తండ్రిని కారాగారంలో తిండిలేక మాడ్చినా బుద్ధుడు కూడ నోరు విప్పలేదు. తండ్రినే బందీ చేసిన దుర్మార్గుడు మరి దేనికైనా పాల్పడవచ్చునని తక్కినవారు కూడ గుసగుసగా చెవులు కొరుక్కున్నారేగాని, పెదవి కదిపినవారుగారు. అంతటివారే మూగ నోము పట్టినప్పుడు ప్రజాసామాన్యం ధైర్యంగా మాట్లాడగలదా?

[7] History of Indian People and Culture ; Bharatiya Vidyabhavan. Vol. 2, pp 30-31

గాథాసప్తశతి కొంతకు కొంతైనా తెలుగుగడ్డపై వెలసివుంటుందని విశ్వసించడంవల్ల దీనిలోని సామాన్య జనజీవితవిషయాలు కొంత విపులంగా చెప్పవలసివచ్చింది. దీనిలోని తెలుగు పదాలను గురించి 80 సంవత్సరాల క్రితం భారతిలో వ్రాశాను.[8]

## వజ్జాలగ్గం :

వజ్జాలగ్గం కూడ గాథాసప్తశతిలాగ ముక్తకాల సంకలనమే. దీని సంకలన కర్త జయవల్లభుడనే శ్వేతాంబర జైనముని. ఇతడు క్రీస్తు శకం 8వ శతాబ్దం ప్రారంభంలో వున్నవాడు. తాను ధర్మార్థకామాలనే త్రివర్గం గురించిన సుభాషితాలను సంకలనం చేశానని చెప్పుకొన్నాడు. సర్వజ్ఞుడైన జినుని ముఖకమలంలో అధివసించే శ్రుతదేవిని–సరస్వతీదేవిని ప్రణమిల్లి ధర్మంతో మొదలయిన త్రివర్గయుతమైన సుభాషితాలను చెబుతాను–అని తొలిగాథలోనే చెప్పుకొన్నాడు.

సువ్వణ్ణు వయణ పంకయ ణివాసిణిం పణమిఊణ సుయదేవిం,
ధమ్మాఇ తివగ్గజుయం సుయణాణ సుహాసియం వోచ్ఛం. (వ–1)
(సర్వజ్ఞ వదన పంకజనివాసినీ ప్రణమ్య శ్రుతదేవీమ్,
ధర్మాది త్రివర్గ యుతం సుజనానాం సుభాషితం వక్ష్యామి.)

వివిధ కవుల గాథలలో మేలిమిని గ్రహించి జయవల్లభమనే వజ్జాలగ్గం విధిపూర్వకంగా రచించాను-కూర్చాను, అన్నాడు.[9]

వజ్జా అంటే పద్ధతి, వాటి లగ్గం–సంకలనం–గుచ్ఛం. ఒక ప్రస్తావంలో చెప్పే గాథలను వజ్జా అంటారు. వ్రజ్యానే వజ్జా అన్నానని తెలుపుకొన్నాడు.[10] ఇతడు ప్రాకృతం గురించి గొప్పగా చెప్పుకొన్నాడు. లలిత మధురాక్షరమయినది ప్రాకృత కావ్యం. ఇది స్త్రీలకు ఇష్టమైంది. శృంగార రసయుతం. అలాటిది వుండగా సంస్కృతం ఎవరు చదువుతారు?-అని ఇతని ప్రశ్న.

లలిఏ మహురక్ఖరఏ జువఈజణ వల్లహే ససింగారే,
సంతే పాఇఅకవ్వే కో సక్కఇ సక్కఅం పఢిఉం. (వ–29)
(లలితే మధురాక్షరే యువతిజన వల్లభే సశృంగారే,
సతి ప్రాకృత కావ్యే కః శక్నోతి సంస్కృతం పఠితుమ్.)

గాథల రసం తెలియని మోటువాళ్లు దానిని ఈకకుఈక తోకకుతోక లాగి పాడు చేస్తారు, పాలు పితకడం సరిగా తెలియనివారు ఆవులను బాధ పెట్టినట్టు-అంటాడు. "ఓ గాథా, నిన్ను మోటు మనుష్యులు అడ్డదిడ్డంగా చదువుతారు. కర్ణకఠోరంగా ఎక్కడపడితే అక్కడ విరుస్తారు; చెరకు తినడం తెలియని మోటువాళ్లు చెరకు నమిలినట్టు" అని వాపోతాడు."

---

8. భారతి 1948 ఏప్రిల్. ఈ వ్యాసం ఈ సంకలనంలో తొలివ్యాసం.
9. వజ్జాలగ్గం : గాథ-3
10. " : గాథ-3
11. " : గాథ-15,16,

వజ్జాలగ్గం భర్తృహరి సుభాషితం పద్ధతిలో సంకలితమైనట్టిది. దీనిలో 96 వజ్జాలలో—పద్ధతులలో దాదాపు వేయి గాథలున్నవి. సామాన్య జనులే ఈ కవి లక్ష్యమూను. కనుక ఇతడు దరిద్రుణ్ని, ఇతరులను స్వేచ్ఛగా వర్ణించాడు. దరిద్రుడు ఇతని దృష్టిలో సిద్ధులందరిలోను మహాసిద్ధుడు.

దీసంతి జోయసిద్ధా అంజన సిద్ధా వి కేవి దీసంతి,
దారిద్ద జోయసిద్ధం మం తే లోయా న పేచ్ఛంతి. (వ. 141)
(దృశ్యంతే యోగసిద్ధాః అంజన సిద్ధా అపి కేచన దృశ్యంతే,
దారిద్ర్య యోగసిద్ధం మాం తే లోకాః న ప్రేక్షంతే.)

దరిద్రుణ్ని ఎవ్వరూ లెక్కచేయరు అనటాన్ని కవి ప్రకారాంతరంగా చెప్పాడు. ఒక దరిద్రుడు ఇలా అనుకుంటాడు. "యోగసిద్ధులు కనబడతారు; అంజన సిద్ధులు కనబడతారు. నాలోటి దారిద్ర్య యోగసిద్ధులు ఎప్పుడూ, ఎవ్వరికీ కనబడరు" అని. యోగంవల్ల, అంజనాదులవల్ల మానవులు అదృశ్యకరణి సిద్ధిని—ఎవరికీ కనబడక అదృశ్యంగావుండే సిద్ధిని సంపాదించగలరని ప్రజల నమ్మకం.

వజ్జాలగ్గకారుడు హాలునివలె పట్టణాల ఛాయలకే పోరాదనే ప్రతిజ్ఞ ఏమీ చేయలేదు; రాజ సేవకులను, ధర్మదాంభికులను, దంభధార్మికులను, వస్త్ర వ్యాపారులను, పల్లెటూళ్ళలో తెలివితేటలతో మోసాలు చేసేవారిని-ఛేకులను, నడ్డివాళ్ళను, వైద్యులను, జ్యోతిష్కులను, సంఘంలోని మరి పలువుర మనస్తత్వాన్ని చక్కగా చిత్రించాడు. రాజసేవకునికి ఏదైనా సౌఖ్యం కాకతాళీయంగా సంభవిస్తే, అది క్షపణకుని స్వర్గారోహణంవలె, ఎన్నో కష్టాల తర్వాత మరణానంతరం సంభవించవచ్చునన్నాడు.

జఇ నామ కహ వి సోక్ఖం హోఇ తులగ్గే సేవయజణస్స
తం ఖవణయ సగ్గారోహణం వ విగ్గోవయ వహిం. (వ-158)
(యదినామ కథమపి సౌఖ్యం భవతి తులాగ్రేణ సేవ జనస్య,
తత్ క్షపణక స్వర్గారోహణమివ విగోపకకైః (వ్యాకులభావకైః)

క్షపణకునికి-సన్యాసికి సుఖం కలిగే దెప్పుడు? మరణించిన తర్వాత, అతని గొప్పదనం గ్రహించిన జనం అతనికి విమానంకట్టి మోసుకుపోతారు; వాద్యాలు మోగుతుండగా, దానాలు ఇస్తారు, అతని పేర. ఇలా అంత్య సంస్కారం కోసం కనుకువెళ్ళతారు ఇలాగే రాజసేవకునికి కాకతాళీయంగా ఏదైనా సుఖం కలిగితే, అది మరణానంతరమే. జీవిత కాలంలో సుఖం కలుగదు.

## జీవిత భావన :

ప్రతి జాతికీ ఒక జీవిత భావన వుంటుంది. వ్యాయంగాను, ఇతర సహాయ నిరపేక్షంగాను జీవితం గడపాలని కొందరు భావిస్తే, భగవన్ని వేదనతో యథాలాభ సంతృప్తులయి ఉండామని కొందరు భావిస్తారు.

‘‘సాఈ ఇతనా దీజిఏ జిస్ మేఁ కుటుంబ సమాయ్,
మైఁభీ భూఖా నా రహూఁ ఓర్ న భూఖా జాయ్’’

ఓస్వామీ, నా కుటుంబం గడిచేట్టు, నేను ఆకలితో బాధపడకుండ, ఇంటికి వచ్చిన అతిథి ఆకలితో వెళ్ళకుండా ఉండేట్టు ఇవ్వు-అంటాడు కబీర్ దాస్. అది ఆయన జీవితభావన. ఒక ఒంటె, ఒక ఖర్జూరపు చెట్టు చాలు, జీవితం సుఖంగా గడుపుతాము-అంటారట అరబ్బులు.

ఒక గ్రామీణుడు ఇలా భావిస్తాడు. బహుశా ఇతడు ఎవరి సేవలోనన్నా వున్నాడేమో! “మంచి పొదుగులు గల మూడు ఆవులు, నాలుగు మంచి యెడ్లు, చేతినిండా వరికంకులూ ఉంటే చాలు. ఓ సేవా ధర్మమా, నీవు ఎక్కడన్నా సుఖంగా వుండు- అంతే, నీవు మాకు వద్దు. మరెక్కడన్నా సుఖంగా వుండు.’’ అంటాడు. ఇది అతడు భావించిన జీవితవిధానం.

తంబాఉ తిగ్ని సువఓహరాఉ చత్తారి పక్కలబఇల్లా,
నిప్పన్నసాలియ మంజరీఉ సేవా సుహం కుణఉ. (వ-160)
(గావస్తిస్రః సుపయోధరాః చత్వారః సమర్థ బలీవర్దాః,
నిష్పన్నా శాలిక మంజర్యః సేవా సుఖం కరోతు.)

## ఛేకులు:

గ్రామాలలో చతురులు చాలమంది వుంటారు. వారిని గురించి వారి ఎత్తులను గురించి ఇతడు చా . వివేచన చేశాడు.

ఒకతె ఒక అమాయకురాలిని ఇలా హెచ్చరిస్తుంది: అమ్మాయి గ్రామాలలోని ఛేకులు-చతురులు బహుకూటకపటనిపుణులు. వారి చేతుల్లోబడిన వారికి స్వప్నంలోను సుఖంలేదు. వారికి ఆకవజ్ఞానం వుంది. ఆ ఆకవచూపులో పడినవారికి సుఖం వుండదు.[12] నగరమంటే మేడలతో, మిద్దెలతో, ప్రాకారాలతో, శిఖరాలతో వుండేదికాదు. చతురులున్న గ్రామమూ నగరమవుతుంది.[13]

## లావణ్య భావన :

లావణ్యాన్ని గురించి ప్రాకృతకవి ఊహలు గొప్పవి. లావణ్యం శరీర సౌష్ఠవానికి, అంగాంగ సౌందర్యానికి మించినది; వాటినిండా, వాటిపైనా పారాడే నైసర్గ్యం. అలాటి లావణ్యాన్ని ఒక సుందరిలో తొణికిసలాడడం చూచాడు ఒక ప్రాకృతకవి. అతనికి నిరంతరం తన ఎదుట గంపలలో ధాన్యమో, పత్తో కూరికూరి సర్దుతున్న పరిస్థితి జ్ఞాపకం వచ్చింది కాబోలు! గొప్పగా గాథలో నింపాడు - కూరికూరి నింపాడు.

విధి ఒక తన్వంగిని లావణ్యంతో కూరికూరి నింపాడట. అయితే తలమీది నొక్కుల జుట్టు ఏమిటి? కూరికూరి నింపేటప్పుడు కలిగిన విధిచేతి గుర్తులే వంకుల జుట్టు సుమా!

---

12. వ-280-81
13. వ-270

తహా చంపిఊణ భరిఅ విహిణా లావణ్ణయేణ తణుయంగీ,
జహా సే చిహురతరంగా అంగుళీ మగ్గవ్వ దీసంతి. (వ. 314)

(తథా నిపీడ్య భృతా విధినా లావణ్యేన తన్వంగీ,
యథా అస్యాః చికురతరంగా అంగుళీ మార్గా ఇవ దృశ్యంతే.)

## ప్రేమసిద్ధాంతం :

ప్రాకృతకవి ప్రేమ సిద్ధాంతం అపూర్వమైంది. దాని ఉత్పత్తి పరిణామాలను అతడూహించినట్టు రాజరంజకపు కవులు ఎన్నిజన్మలెత్తినా ఊహించలేరని నా విశ్వాసం.

"ప్రేమ అనేది అనాది. పరమార్థ ప్రకటనం. మోహానురాగ జనకం. మధుమథనునివలె బహురూపముఖుంది." అని అతని సిద్ధాంతం. ఈ ప్రేమ ఆలాపం ఉల్లాపం (సంభాషణ), సహవాసం, కుతూహలం, ప్రియగుణగణనం అనే మెట్లగుండా పైకి ఎక్కుతుంది.[14] ఇంతగా వటవృక్షంవలె వ్యాపించిన ప్రేమ, కూలిపోతే కూలినమర్రి చెట్టు వేళ్ళుకూడ కనిపించనట్టు కొంచెమైనా సద్దులేకుండా కూలిపోతుంది.[15] ఈ ప్రేమ ప్రాకృత కవి దానిమ్మకాయ పండేపద్ధతితో పోల్చి తన వ్యవసాయ విజ్ఞానాన్ని ప్రదర్శించాడు.

దాడిమ ఫలం వ పెమ్మం ఏక్కే వక్ఖేయవహోఇసక సాయం,
జావ న బీఓ రజ్జఇ తా కిం మహురత్తణం కుణఇ? (వ.334)

(దాడిమ ఫలమివ ప్రేమ ఏకస్మిన్ పక్షే భవతి సకషాయం,
యావన్న ద్వితీయో రజ్యతే తావత్ కిం మధురత్వం కరోతి?)

దానిమ్మ పండు తక్కిన పండ్లవంటిది కాదు. తక్కిన పండ్లు ఒకే సమయంలో అంతటా పండి తియ్యనవుతాయి. కాని దానిమ్మ క్రమంగా భాగాలు భాగాలుగా పండుతూ వస్తుంది. గింజ ఎర్రబడే వరకూ పూర్తిగా పండదు. ఒక పక్కన ఒగరుగా వుంటుంది. ప్రేమ కూడ ఏక పక్షమయితే-ఒకే ప్రక్కన ప్రేమవుండి మరొక పక్కన బింకం వుంటే – ఒగరుగా వుంటుంది. రెండవ పక్షమూ రాగరంజితమయ్యేవరకు—అంటే, ఇద్దరూ ప్రేమమయులయ్యే వరకు మాధుర్యం ఏర్పడదు. బీఓ అనే మాటను శ్లేషలో వాడి కవి ఈ మాధుర్యం తెచ్చాడు. బీఓ అనే మాటకు బీజమని, రెండవ అని శ్లేషార్థం. గింజ ఎర్రబడే వరకు, రెండవ పక్షం రాగరంజితమయ్యే వరకు అని అర్థం. ప్రేమ అనేది ఏక పక్షం కాగూడదు; ఉభయ పక్షంగా వుండాలి.

మానం వున్నచోట-బింకం వున్నచోట-ప్రేమ వుండదు. ప్రేమ వున్నచోట బింకం, మానం వుండరాదు. ఇవి రెండూ పరస్పర విరుద్ధమైనవి. ఒక కట్టుగంబానికి రెండు ఏనుగులను ఎవరైనా కట్టివేస్తారా ? – అని ప్రశ్నించాడు ఈ కవి. రెండూ ఒకేచోట వుండలేవు.

14, 329--330
15. గాథాసప్తశతి 5-32

జఇ మాణో కిఁహ పిఓ అహవ పిఅ కిస కిరఏ మాణో,
మాణిణి దోణ్ణి గయిందా ఏక్కక్ఖంభే న వజ్ఝంతి. (వ-355)

(యది మానః కస్మాత్ ప్రియః? అథవా ప్రియః కస్మాత్ క్రియతేమానః?
మానిని ద్వావపి గజేంద్రా ఏకస్తంభే న బధ్యేతే.)

దీనినే కబీర్ భంగ్యంతరంగా అన్నాడు:
పియా చాహై ప్రేమరస రాఖా చాహై మాన్,
ఏక మ్యానమేఁ దో ఖడగ దేఖా సునా న కాన్.

"అహం, ఖుహా రెండూ కుదరవంటాడు కబీర్. ప్రేమిద్దా మనుకోడం-ప్రేమరసం తాగుదామనుకోడం, బింకం పోనడం-ఈ రెండూ కుదరవు. ప్రేమించదలచావా, మానం-బింకం-వదలుకో. బింకంగానే వుండదలచావా, ప్రేమ మానుకో. ఒక ఒరలో రెండు కత్తులు ఇముడడం ఎక్కడైనా చూచావా? విన్నావా?" అంటాడు కబీర్.

నిజానికి ప్రేమకు దూరంగా వుండాలంటాడుకవి. ప్రేమించడ మనేది పెట్టుకోకు, ఎవ్వరినీ ప్రేమించకు. నిన్ను ఎవరికీ సమర్పించుకోకు. ప్రేమించనంతవరకు సుఖంగా వుంటావు. ఎప్పుడైతే నీవు ప్రియవ్యక్తి కోసం బంధం పెట్టుకున్నావో నిన్ను నీవు దుఃఖంలో పడవేసుకొన్నట్లే సుమా? - అని ఒక అనుభవజ్ఞురాలు ఒక నవయువతికి ఉపదేశిస్తుంది.[16]

నేడు పల్లెటూరి వారికి బూతులన్నా సెక్సు విషయాలన్నా ఎలాటి సంకోచమూ లేనట్లే నాడూ ప్రాకృత కవులకూ లేదు. అందువల్లనే గాథా సప్తశతీ కారుడు, వజ్జాలగ్గ కారుడు ఒక నవదంపతులు వివిధ కరణాలతో రాత్రంతా గడపడం చూచిన దీపం మూనై అయిపోయింది లెక్కపెట్టక అలానే చూస్తూ నిలబడి పోయిందన్నారు. వాళ్ళిద్దరూ అలా గడపగా లేని సిగ్గు దీపానికెందుకు?

దట్ఠూణ తరుణసురఅం వివిహవలోట్టంత కరణసోహిల్లం,
దీఓ వి తగ్గఅమణో గఅం వి తెల్లం న లక్ఖేఇ.
(గాథా సప్తశతి 6-47; వ.ల. 319)

(దృష్ట్వా తరుణసురతం వివిధ ప్రలుఠత్ కరణ సహితం,
దీపోపి తద్గతమనాః గతమపి తైలం న లక్షయతి.)

బూతు ధ్వని ఇచ్చే నర్మోక్తులను నేడూ మనం కార్మికులు పనిచేసే ప్రాంతాలలో వినవచ్చు. ఇలాటి గాథలు వజ్జాలగ్గంలో వడ్డెవాళ్ళు, జ్యోతిష్కులు, లేఖకులను గురించి చాల వున్నవి. వైద్యులను గురించీ వున్నాయి.

"చూచావా, ఉప్పరయ్య నిర్దయగా గట్టిగా గుద్దలితో పొడిచాడు. నీరు బుస్సున పైకి చిమ్మింది. బావి నిండింది. గుద్దలి అడుగు తాకింది. అయినా ఉప్పరయ్య వదలడం లేదు; ఇంకా తవ్వుతూనే వున్నాడు." అని ఒక జాణ ఛలోక్తి.

---

16. వ. 339

నిద్దయ కుద్దాలయ మజ్ఝ బహు లుచ్ఛలంత జలసోత్తమ్,
ఉడ్డోలద్ధ స్ఫరిసో ధరిఅం వి న మేల్లఏ వావీమ్. (వ.686)
(నిర్దయ కుద్దాలక మధ్య బహు లోచ్ఛలజ్జలస్రోతసమ్,
ఖనకోలబ్ధ స్పర్శో ధృతామపి న త్యజతి వాపీమ్.)

రాజరంజక కవులకు ముక్తారత్నాభరణ నిపుణులు, చీనాంబరాల ఆపణాలు కనిపిస్తాయి గాని సాధారణమైన బట్టలంగళ్ళు, వస్త్ర విక్రేతలు (దౌషికులు) కనిపించలేదు. ప్రాకృత కవి వారినీ-శృంగారపు బరువు కొంచెం ఎక్కువయినా, తన కవితలో దించాడు. వారిని దోసిఅ—దౌషిక—అన్నాడు.

"ఓయ్! బట్టలంగడి మనిషీ, మంచి గుడ్డ ఇవ్వు. కొలతలు సరిగా వుండాలి. ఉదికితే రంగు వెలిసిపోకుండా వుండాలి, కట్టుకుంటే సుఖంగా వుండాలి. అలాటి గుడ్డ లేకుంటే—నేను కోరిన గుణాలు లేకపోతే, దానివి—నర్మదా తీరంలో విసిరేయి." అని ఒక యువతి బట్టలంగడి వానితో సరసాలాడుతుంది. "కొలతలు సరిగా వుండాలట, సుఖంగా వుండాలట. కొలతలు సరిగా లేనిది, వెడల్పు పొడువు లేనిది, బండపైన వేసి ఉదికితే రంగు వెలిసిపోయేది, కట్టుకుంటే హాయిగా లేనిది నర్మద గట్టు పైకి విసిరివేయి—" అంటుంది. బండమీద వేసి ఉతికితే చాయ పోగూడదట.

మాణ విహూణం రుందీఅ చోడయం సిలాధోయగియఛాయం,
జం వసణం ణ సుహావఇ ముయ దూరం ణమ్మయాతీరే.
(వ-789)

(మానవిహీనం విస్తారేణ త్యక్తం శిలా ధౌత గతచ్ఛాయమ్,
యద్ వసనం న సుఖయతి ముంచ దూరం నర్మదాతీరే.)

వజ్జాలగ్గ కారుడు తాటిచెట్టును గురించి చెప్పింది చూచి కబీరు ఖర్జూరం చెట్టును గురించి చెప్పాడా అనిపిస్తుంది. "ఓ తాటిచెట్టూ! ఎందుకు నీ ఎత్తు? సగం ఆకాశాన్ని అడ్డగించావు. ఆకలి, దప్పి తీర్చుకొందామని పాంథులు దగ్గర చేరుతారా ఏమన్నానా?" [17] అని వజ్జాలగ్గ కారుడంటే, కబీరు "ఔనయ్యా గొప్ప సాధువే! ఖర్జూరం చెట్టులాగ వున్నాడు. పిట్టవాలడానికి వీలులేదు. పండ్లు కోసుకుందామంటే, దూరంగా వున్నాయి. అందవు. సాధువు కూడ ఎవరినీ దరిచేరనివ్వడు. ఏమైనా వేదాంత విషయాలు తెలుసుకొందామంటే వీలేలేదు. అలాటి గొప్ప సాధువయితే ఏమిటి ప్రయోజనం?"

సాధు భయా తో క్యా భయా జైసే పేడ ఖజూర్,
పంఛీకో సాయా నహీం ఫల లాగే అతిదూర్.

"వేశ్య బలహట్టుల సరసా—సెనగపిండి రొట్టెవంటిదట! సెనగ పిండి రొట్టె తినడానికి రుచిగా వుంటుంది. అంగిట్లో అంటుకొంటుంది, మింగుడు పడదు. మింగుడు పడి ఆమాశయంలోకి చేరిన పిదప గడబిడ చేస్తుంది."[18] మంచి పోలిక.

---

17 వ-736

18 వ-561

మనకు "వంటఇంటి కుందేలు" అనే పదబంధముంది. వంట ఇంటిలోని కుందేటికి మరణం తప్ప మరొకటి లేదని దీనికి అర్థం చెప్పారు. "ఇది వంట ఇల్లు కాదు. వెంటయిల్లు. వేటగాండ్రు అడవులలో వన్యమృగాలు పడడంకోసం కోనుల వంటి ఇల్లును కట్టేవారు. దానిలో పడిన మృగానికి ఇక నిష్కృతి లేదు. కుందేలు అసలే పిరికిది గనుక మరణం తథ్యం." అని మిత్రులు శ్రీ ఆరుద్ర అన్నారు. ఈ వాదం సకారణమనడానికి వజ్జాలగ్గం శశకవజ్జలో ఒక గాథ దొరికింది.

ఒక మహిళ ఒక చిన్నదానిని "ఓ వెర్రిదానా వీధులలో తిరుగుతున్నాడు నీ ప్రియుడు. చతురలైన అందగత్తెల చేతుల్లో పడుతాడు. స్కంధావారంలో దూరిన కుందేటివలె ఇక తప్పించుకోలేడు." అని మందలిస్తుంది. వెంట ఇంటి కుందేలు అనే నానుడి "స్కంధావారవారి శశక" అనే దానినుంచి వచ్చిందను కుంటాను.

ధురు ధుల్లంతో రచ్ఛాముహేసు వరమహిలియాణ హత్థేసు,
ఖంధార వారి శశఓ వ్వ పుత్తి దఇఓ న ఛుట్టిహిఇ. (వ. 628)

(పరిభ్రమన్ రథ్యాముఖేషు వరమహిలానాం హస్తేషు,
స్కంధావారవారి శశక ఇవ పుత్రి దయితో న మోక్ష్యతే.)

స్కంధావారమంటే సైనికుల శిబిరం. సైనికుల శిబిరంలో ఇదేదో రక్షణ స్థానమనుకొని కుందేలు దూరిందనుకోండి. బ్రతుకుతుందా? కుందేలు మాంసం చాలరుచ్యమంటారు. సైనికులు యుద్ధసమయంలో స్కంధావారాలుగా విడియడమే కాక, రాజులు వేటకు పోయినప్పుడు కూడ శిబిరాలుగా పర్చుంచుకొనేవారు; అంటే పెద్ద వలయాకారంగా ఏర్పడేవారు. దానికి ఒక చోట దారి వుండేది. ఆ దారిలో దూరి మృగాలు లోపలికి రాగానే, క్రమంగా వలయం దగ్గర అయి, ఆ మృగాన్ని చంపేవారు. దీనిని మనవారు వెంట ఇల్లు, వేట ఇల్లు అనేవారు. వెంట ఇల్లు క్రమంగా వంట యిల్లు అయివుంటుంది, ఉచ్చారణ వేగంలో. తాళపత్రాల వ్రాతలలో వెంట, వేట ఒకేవిధంగా వ్రాస్తారు. అరసున్నను నిండుసున్నగా వ్రాస్తారు. ఎ ఏ ఒ ఓల హ్రస్వదీర్ఘాల భేదం వుండదు. వెంట ఇల్లు అని వుంటే ఎవరో ప్రబుద్ధుడు వంట ఇల్లు అని భ్రమపడడంవల్ల ఈ పొరపాటు జరిగివుంటుంది.

## పొడుపు కథలు:

పల్లెటూరి వారి విశిష్టత పొడుపు కథలలో తమ ప్రజ్ఞ చూపడం. ఈ పొడుపులు చాల వినోదకరంగాను, విజ్ఞానదాయకంగాను వుంటాయి. వీటిని ఒక విధంగా ప్రహేళికలు అనవచ్చు. ఈ ప్రహేళికలు వజ్జాలగ్గంలో "హియాలీ (హృదయవతీ) వజ్జా" అనే శీర్షికలో వున్నాయి. ఇవి పూర్తిగా గ్రామీణ మేధా విలసితాలు. వీటిలో విపరీతంగా శృంగారం వున్నవి వదలి సరసంగా వున్నవాటిలో కొన్నింటిని ఉదాహరిస్తాను.

"నీ ముఖం చంద్రునివలె వుంది అని నెచ్చెలులు ఒక యువతిని ప్రశంసించారు. ఆ యువతి వెంటనే తన చెక్కిలిని చేతితో సవరించుకుంది. ఎందుచేత?" ఇది ప్రహేళిక-పొడుపు. దీనికి సమాధానం ఏమిటంటే? "వీళ్ళ

నాముఖం చంద్రబింబ సదృశమంటున్నారే. నేనేమో నా ముఖాన్ని కర్పూర కేతకీ ధూళితో అలంకరించుకొన్నాను. నా ప్రియుడు నన్ను కాటుక కళ్ళ మీద ముద్దుపెట్టుకున్నాడు. పిదప చెక్కిళ్ళు ముద్దుపెట్టుకున్నాడు. అతని పెదవులకు అంగిలిన కాటుక నా చెంపలకు అంటలేదు గదా ?'' అని ఆమె చెంపలను సవరించుకుందట.

"నీకు తిలకం దిద్దుతాను. రా—అని భర్త పిలువగా, ముద్దరాలు నవ్వి ముఖం తిప్పుకుంది. ఎందుకు ?'' తిలకందిద్దుతాననే వ్యాజంతో ముద్దుపెట్టుకుంటాడని నవ్వు.

"పరిజనం మధ్య ఉన్న యువకుణ్ని చూచింది యువతి. చేతిలోవున్న వికసిత పద్మాన్ని మరొక చేత్తో మూసింది. ఎందుకు ?'' ఆ సూర్యాస్తమయం తనను కలుసుకోమని సంకేతం.

"ఒక వ్యాధుడు ఒక పెద్ద మద గజేంద్రాన్ని ఒక్క బాణంతో చంపి, వెంటనే మడుగు దగ్గరికి వెళ్లి, బాణం కడిగి ఆ నీళ్ళు తాగాడు. ఎందుచేత ?'' విషం పూసిన బాణంతో ఏనుగును చంపాననే అనుమానం కలుగకుండా, బాణం కడిగి ఆ నీరు తాగాడని సమాధానం.19

వజ్జాలగ్గ కారుడు ఈవిధంగా అసంఖ్యాకంగా కల్పనారత్నాలను, ప్రజా జీవిత విశేషాలను కుమ్మరించాడు.

## సేతు బంధం :

సేతుబంధ కావ్యం వాకాటి ప్రభువయిన ప్రవరసేనుడు రచించినది. ప్రవరసేనుడు కాళిదాస సమకాలికుడు, క్రీస్తుశకం 5 వ శతాబ్దివాడు. ఈ సేతు బంధాన్ని దండి మహారాష్ట్రి ప్రాకృతంలో రచించిన మహాకావ్యంగా వర్ణించాడు

"మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః,
సాగర సూక్తి రత్నానాం సేతు బంధాది యన్మయం"20

ఈ సేతుబంధానికి రావణవహో అని, దసముహవహో అని నామాంతరాలున్నాయి. ఇది 15 ఆశ్వాసాల మహాకావ్యం. ఈ రాజకవి ప్రాకృతాన్ని విశేషంగా ఆదరించి ఆర్యాగీతి ఛందస్సులో దీనిని రచించాడు. దీనిలో హనుమంతుడు సీతనుంచి చూడామణిని రామునికి తెచ్చియిచ్చినప్పటినుంచి రావణవధానంతరం రాముడు అయోధ్యకు పోయేవరకు గల కథ ఇతివృత్తం. వానరసేన ప్రస్థానం, వానరులు సేతువును కట్టడం, యుద్ధ వ్యూహాలు అపూర్వంగా వర్ణింపబడినవి. వంతెన కట్టేటప్పుడు వానరులు కొండలను గుండ్లను అందుకోడం, గండ్లు పూడ్చడం వంటి కార్మికుల పనులను వివరించడంలో ప్రవరసేనుడు ప్రవరుడనిపించుకొన్నాడు.

సాధారణంగా బరువులు మోసేవారు భుజాలమీద బరువు మోసుకొని మరొక చేత్తో ఆ బరువు వస్తువును పైనుంచి పట్టుకొని వెళ్ళుతారు. వంతెన కడుతున్నారు. వానరులు కొండలను ఎడమ భుజంమీద పెట్టుకొన్నారు. కుడిచేతిని ఎత్తి కొండ శిఖరం గట్టిగా పట్టుకున్నారు. ఎడమ చేతిని వంచి ఎడమ నడుంమీద పెట్టుకొని కొండలు మోసుకొని వస్తున్నారు.

---

19. వ. 613,615,617,618.
20. దండికావ్యాదర్శం.

అంసత్థావిఅ మహిఅరా ఉచ్ఛిఅ దాహిణ కరావలంబిఅ సిహరా,
ఉత్తాణ వామ కరఅల ధృతనితంబ ప్రవరా నివ ర్తంతే కఇయః,

(అంస స్థాపిత మహీధరా ఉచ్ఛ్రిత దక్షిణ కరావలంబిత శిఖరాః,
ఉత్తాన వామ కరతల ధృత నితంబ ప్రవరా నివర్తంతే కపయః.)

బరువులు మూసే వారిని ప్రవరసేనుడు ఎంత సూక్ష్మంగా చూచి సహజంగా వర్ణించాడో ఈ గీతి స్పష్టం చేస్తున్నది.

నేడు గోడలు కడుతున్న తాపీ మేస్త్రీలకు కింది పనివారు రాళ్ళు, సున్నం అందించినట్టే, సేతువు కడుతున్న నలనీలులకు కొండలను ముక్కలు ముక్కలుగా అందించారట.[21] వానరులు మోసుకొని వచ్చిన కొండలను సముద్రంలోకి విసిరి వేస్తున్నారు. దానివల్ల నీరు పైకి ఎగజిమ్మి కడుతూ వున్న సేతువుకు విసురుగా తగిలి కట్టడం సడలి సందులు పడుతున్నాయి. ఆ గన్నలకు గుండు కొట్టి మరల పూడుస్తున్నారు.[22] ఒక చోట స్ఫటికపు కొండలతో వంతెన పడింది. దాని మధ్య నల్లటి కొండల అతుకుంది. అది స్థిమితమైన సముద్రపు రంగులోనే వుండడంవల్ల గండిలాగానే కనిపిస్తున్నది.[23] వీటినిబట్టి ఈ కవి కార్మికుల చర్యలను ఎంత శ్రద్ధతో పరిశీలించాడో స్పష్టమవుతున్నది.

యుద్ధాలలో భూదగ్ధ విధానం ఉభయపక్షాలవారూ అనుసరించడం అవాదిగా వుంది. ఈ విధానం (scarched earth policy) ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో రష్యావారి విజయానికి కారణమయింది. వారు తమ శత్రువులకు ఏమీ దొరకకుండా కాల్చి బుగ్గిచేసి గ్రామాలు ఖాళీ చేసేవారు. ఈ విధానాన్ని ప్రవరసేనుడు వర్ణించాడు. సముద్రం "ప్రళయదగ్ధ విధ్యాతతలోర్వీ శ్యామలం"—ప్రళయకాలంలో కాల్చి ఆర్పిన భూమివలె నల్లగా వుందట.[24]

ఆశాబంధమనే పదబంధాన్ని గాథాసప్తశతీకారుడు మొదట వాడాడు. కాళిదాసు దానిని మేఘదూతలోను, అభిజ్ఞాన శాకుంతల, విక్రమోర్వశీయ రూపకాలలోను వాడాడు. ప్రవరసేనుడూ ఈ ఆశాబంధాన్ని సముచితంగా వాడాడు.

సీతాన్వేషణ కోసం హనుమ బయలుదేరాడు. తిరిగిరావడం తడవయింది. ఆ రాముని అదృశ్యమానమయిన ఆశాబంధంవంటి హనుమంతుడు వెళ్ళి తిరిగి రావడం తడవుకాగా. మొదలే చిక్కిపోయిన రాముని శరీరం మరింత క్షీణించింది. కన్నీరు నిండిన ముఖం మరింతగా రోదించినట్టు కనిపించింది - అంటాడు కవి

ఖిజ్జఇ ఖిణ్ణావి తణూ అత్థిఅవాహం పుణో పరుణ్ణం వ ముహం,
రామస్స అఈసంతే ఆసాబంధే వ్వ చిరగఏ హణుమంతే. (2-35)
(క్షీయతే క్షీణాపి తనుః అస్థితబాష్పం పునః ప్రఘుదిత మివ ముఖం,
రామస్య అదృశ్యమానే ఆశాబంధ ఇవ చిరనిర్గతే హనుమతి )

21. సేతు:8-37.
22. సేతు:8-74.
23. సేతు:8-91.
24. సేతు:2-30.

రాముని ఆశంతా హనుమంతునిమీదే ఆధారపడి వుంది కనుక ఆశాబంధ మనడం ఎంతో ఉచితం.

కుంభ కర్ణాదులు మరణించినప్పుడు రావణుడు దుఃఖించాడు. అతని కనులనుంచి కన్నీటి చుక్కలు మండుతూ పడ్డాయట. దీపంనుంచి మంటతో పాటు పడే నూనె చుక్కల్లాగ.[25]

ప్రవరసేనుడు రాజయినా రాజరంజకకవులు చెప్పని అపూర్వ భావనలను, సామాన్య విషయాలకు సంబంధించిన అంశాలను ఎన్నో చెప్పాడు. వాటిలో అతని అపూర్వ లోకజ్ఞత సుస్పష్టం.

## గఉడ వహో:

గఉడ వహో అంటే గౌడవధను గురించిన కావ్యం. ఈ కావ్యకర్త వాక్పతి రాజు, ఇతడు మాళవ రాజయిన యశోవర్మ ఆస్థానకవి. క్రీస్తు శకం 750 ప్రాంతంవాడు యశోవర్మ మగధ గౌడ రాజును వధించడం దీని ఇతివృత్తం. కాని కావ్యమంతా యశోవర్మ రణ ప్రస్థానంతోనే పూర్తయి చివరి కొన్ని గాథలతో గౌడవధను తెలుపుతుంది. ఇది సర్గవిభాగంతో కాక కులకమనే పద్ధతిలో రచితమైంది. కావ్యమంతా రణాభియాన ప్రధానం కావడంవల్ల వాక్పతి రాజు తలచిన మహా కావ్యానికిది పూర్వరంగమేమోనని విమర్శకులు భావిస్తున్నారు. వాక్పతి రాజు ఈ కావ్యంలో గ్రామసీమల రామణీయకాన్ని, ప్రజల సహజ స్వభావాన్ని, పాడయిపోయిన గ్రామాల శోచనీయస్థితిని, గ్రామీణుల నిత్యజీవితంలోని చర్యల సహజ సౌందర్యాన్ని మనకు అద్దం పట్టి చూపాడు; తన భావనా వ్యాఖ్యను కూడ జోడించాడు.

ఒక నగరం పెరుగుతూ పోయింది, నేటి నగరాల వలెనే. కనుక కుమ్మరి వారికి కుండలు చేయడానికి బంకమట్టి కరువయింది, నగరపరిసరాలలో. కనుక రాజులు కుంభకారుల కోసం భూములను ప్రత్యేకించారట.[26] నేడు ఆహార పదార్థాల రేషనింగులాగ బంకమన్ను రేషనింగు వాక్పతిరాజు కాలంలో వుండడం ఆశ్చర్యంగా లేదూ ?

వాక్పతి రాజు పత్తిగింజలు విడిపించే యంత్రాన్ని లోహలోటకం అన్నాడు. నిశ అనే స్త్రీ అంధకారమనే లోహలోటకం–ప్రత్తి గింజలు తీసే యంత్రాన్ని–తిప్పిందట. ప్రభాతమనే పత్తి ముందుకు వచ్చి గ్రహనక్షత్రాలనే పత్తిగింజలు వెనుకకు మిగిలిపోతే నిశాదేవి వాటిని ఏరి వెనుకకు తోసిందట. పగలు కాగానే గ్రహగణం కాంతిని కోల్పోతుందనే విషయాన్ని కవి నిత్య జీవితంలో, గ్రామాలలో ఉన్న పత్తిగింజలు తీసే రాట్నంతో పోల్చాడు.

తమలోహలోఠ యాణుఁ అ
ముక్క గో పృవహో తలిణ మూలో,
గహ ఫలిహ బీయ నివహం
పచ్ఛా పుంజిజ్జఇ ణిసాఏ. (గౌ. 1198)

---

25. సేతు:15-38.
26. గౌడ:508.

(తమో లోహాగోత్రకాముత్త
ముక్తప్రభాత ప్రభః విరలమూలః,
గ్రహాకార్పాస బీజ నివహాః
పశ్చాత్పుంజీక్రియతే నిశాంతః.)

చింత చిగురు, చింత పూవు చాలా రుచికరమైన వస్తువులు. చింత పూవు చిరు పులుపు, చిరు తీపులతో మనోహరంగా ఉంటుంది. ఒక బాటసారి పూచిన చింత చెట్టును చూచాడు. నోట్లో నీళ్ళూరాయి, పూత కోసుకున్నాడు. అరచేతిలో వేసుకొని నలిపి ముద్దచేసి నోట్లో వేసుకొని చప్పరించాడు. ఆ పూత ముసలిగువ్వ రెక్కలవలె కర్బుర వర్ణంతో వుందట

ఇహ చించిణీఅ ఘేత్తూణ
కరయలలోలంపి పిండిఅం పహిఏ,
కవలేఇ జరఠ కలవింక
పక్ఖ పరి కబ్బురం కుసుమమ్. (గాథ.687)
(ఇహ చించాయాం గృహీత్వా
కరతలావలుంపన పిండితం పథికః,
కవలయతి జరఠ కలవింక
పక్షవత్కర్బురం కుసుమమ్.)

వాక్పతి రాజు దృష్టి, గ్రామాలలో చింతచెట్టు పూలను గానే పిల్లలు, పెద్దలు తినడంపై పడడం ఆయన పరిశీలన ప్రవణతకు నిదర్శనం.

గ్రామాలలో బావులలోపలి గోడలు ఉప్పు ఉరలి పడిపోయి, పాడుకుపోయి బావులు పైకి లేచి వచ్చినట్టుందట. బావులను బాగుపరచకపోవడం ఆనాడూ వుందేమో!

ఇహ లవణుగ్గమ పడిహీణ భిత్తివలయుత్తణేణ దీసంతి,
అహిఅ వియడాఅ పూరణసమున్ణఅ కూవసోత్తిఆ. (గాథ 679)
(ఇహ లవణోద్గమ పరిహీన
భిత్తి వలయత్వేన దృశ్యంతే,
అధిక వికటాః పూరణ
సమున్నతాః కూపశోత్రాః.)

ఉప్పు ఉరలి గోడలు లోపలపడిపోయి బావులు అకటావికటంగా కనిపిస్తున్నవట. పూడిపోవి భిత్తి వలయాలు అంటే గుండ్రని బావులు; పడగపు బావులు కావు. కూపశోత్రాలు గొట్టాలవలె కనిపించే బావులు. గోడల పాడిపోడి నీరు పై రావడంవల్ల బావులే పైకి లేచి వచ్చినట్టున్నాయి.

గుడ్లు పగిలి సొనకారడాన్ని కూడ వాక్పతిరాజు వర్ణించక వదలలేదు. గాలికి ఊగిపోతున్న చెట్ల మీంచి పక్షులగుడ్లు జారి పగిలి కిందపడుతున్నాయి. పగిలిన గుడ్ల కలలం-సొన గాలిలో ఎగిరిపోతున్నది తుంపరలై, గాలికి లేచిన ధూళితో కలిసి,

ఇహ వేల్లంత దుమొజ్ఝిఅ
భిన్నవయో అండ కలల సీఅరిణో,
వాఅంతి మేహ సీఅల
ధూలి లవత్థంఘిణో పవణా:. (గౌడ: 860)

(ఇహ వేల్లద్ద్రుమోజ్ఝిత
భిన్న వయోండ కలల శీకరిణః,
వాంతి మేఘశీతల ధూలిలవో
త్క్షేపణశీలాః పవనాః,)

వాక్పతిరాజు గ్రామోత్సవాలను విశేషంగా వర్ణించాడు. దారిలో కనిపించిన మామిడి చెట్ల నుంచి వ్రేలాడుతున్న మామిడికాయలు పసుపు పూసుకున్న ద్రవిడసుందరుల గండమండలంవలె మనోహరంగా ఉన్నాయట.

ఇహ హి హరిద్దా హారిణం
ద్రవిడ సామలీ గండమండలానీలం,
ఫల వవల పరిణామా
వలంబి అహిహారఇ చూయణం. (గౌడ. 598)

గౌడవహో నుంచి ఇలా ఎన్నయినా రమ్యోదాహరణలు చూపవచ్చు.

ప్రాకృత కవులు సహజసుందరంగా వర్ణించిన గ్రామ దృశ్యాలను రాజరంజక సంస్కృత కవులు స్పృశించినా, పారమ్యం పొందలేకపోయారు. కాళిదాస, భారవి, మాఘులు అడపాదడపా గ్రామ పరిసరాలను వర్ణించినా, కాలిమ క్షేత్రాలను ప్రస్తావించినా, ప్రాకృత కవులను మీంచలేక పోయారు, వారిని అనుకరించారన్నా తప్పు కాదు. సుభాషితాలు, లోకోక్తులు, పొడుపులు మొదలయిన వాటిలో ప్రాకృత ప్రజారంజక కవులదే పైచేయి.

ఇలా సామాన్య మానవుడు, అతని సామాన్య గ్రామీణ జీవితం-ఇవి రెండూ గాథాసప్తశతినుంచి—ఎలాంటి ఇతర ప్రసక్తి లేని కవిత్వపు ముద్దయిన గాథాశప్తశతి నుంచి సుంపరేటి వృత్తాలయి ప్రాకృత సాహిత్యమంతా ఆక్రమించి, వేదూ-మేధావుల దృష్టిని విశేషంగా ఆకర్షిస్తున్నది.[27]

ఇక రాజకీయ నాయకుల, పక్షాల సంగతి వేరుగా చెప్పనక్కరలేదు. పేదలే వారి పథకాలు, వారి రాజ్య సంపాదన వ్యూహాలు. వారికి సహాయం చేయనీ, చేయకపోనీ వారి ఎన్నికల ప్రణాళికలలో మాత్రం పేదలను గురించే ఎక్కువ ఉంటుంది.

---

27. 1974 మార్చి 23, 24 తేదీలలో ఉస్మానియా విశ్వవిద్యాలయం వరంగల్ స్నాతకోత్తర కేంద్రంలో (నేటి కాకతీయ విశ్వవిద్యాలయంలో) ఇచ్చిన ఎక్స్‌టెన్షన్ ఉపన్యాసాలలో మొదటిది.

# ప్రవరసేనుని సేతుబంధ కావ్యం

సేతుబంధ మనగానే మనస్సులో రామాయణ గాథ మెరపులాగ మెరుస్తుంది. అవును! ఇది రామాయణగాథే. ఇది రామాయణంలోని యుద్ధకాండ ఇతివృత్తంగా రచితమైన కావ్యం. సామాన్య వ్యవహారంలోవున్న ప్రాకృత భాషలో జానపద కవులు చెప్పిన ముక్తకముక్తా ఫలాల గుచ్ఛమైన గాథా సప్తశతిలో సీతారామ చరిత ఘట్టాలను వర్ణించిన గాథలు కొన్ని ఉన్నవి. కాని, వాల్మీకి రామకథ వస్తువయిన తొలిప్రాకృత భాషాకావ్యం సేతుబంధమే, జైన సంప్రదాయ రామ చరిత కావ్యం పఉమ చరిఉ (పద్మ చరితం) భారత దేశ భాషలలో తొలి రామకథా కావ్యం కాగా, సేతుబంధం దేశ భాషలలో మలి రామాయణ మయినా, కావ్య దృష్టితో తొలి తొలి దనే అనాలి.

ఈ సేతుబంధ కావ్యాన్ని రావణవహో, దహముహవహో అని కూడ వ్యవహరిస్తారు. సంస్కృత వాఙ్మయంలో తొలి గద్యకావ్య రచయిత, లాక్షణికాగ్రేసరుడు అయిన దండి

"మహారాష్ట్రాశ్రియాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః,
సాగర స్సూక్తి రత్నానాం సేతుబంధాది యన్మయమ్."

మహారాష్ట్రంలో వున్న భాషను ఉత్తమ ప్రాకృత మని గుర్తించినారు. దానిలో సూక్తి రత్నాలకు సాగరమైన సేతుబంధం మున్నగు కావ్యాలున్నవి అనినాడు బాణభట్టు హర్ష చరితంలో

"కీర్తిః ప్రవర సేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా,
సాగరస్య పరం పారం కపిసేనేవ సేతునా."

కలువల వలె తెల్లని ప్రవర సేనుని కీర్తి రాముని కపిసేనలాగ సేతువుతో సముద్రం దాటింది-అని ప్రశంసించాడు.

సేతుబంధ కావ్య రచయిత ప్రవరసేనుడు వాకాటవంశరాజని, క్రీస్తుశకం 410-440ప్రాంతంలో ఉన్నవాడని, కాళిదాసుకు ఆశ్రయుడైన గుప్తసార్వభౌముడు ద్వితీయ చంద్రగుప్త విక్రమార్కుని కుమార్తె ప్రభావతీదేవి కుమారుడని డాక్టర్ ఎ. ఎస్. ఆల్టేకర్, డాక్టర్ ఆర్. సి. మజుందార్ మొదలయిన విద్వాంసులు నిర్ణయించారు. ఇతడు స్కందగుప్త కుమారగుప్తులతో పాటు కాళిదాసుకు శిష్యుడై ఉంటాడనీ, కొన్ని సేతుబంధ లిఖిత ప్రతుల ఆశ్వాసాంత గద్యాలలోని "సిరిపవర సేన విరఇఏ కాళిదాసకఏ దహముహవహే మహాకవ్వే" అని ఉన్న వాక్యాన్ని బట్టి కాళిదాసు ఈ కావ్యాన్ని సంస్కరించి వుండవచ్చునని కొందరు విద్వాంసులు భావిస్తున్నారు.

---

1. కావ్యాదర్శం ఉపక్రమణిక.
2. హర్ష చరిత పీఠిక.

సేతుబంధం పదిహేను ఆశ్వాసాల కావ్యం. కవి ప్రతి ఆశ్వాసానికి విడివిడిగా పేర్లు పెట్టాడు: సాగరతటప్రస్థానం, వానర ప్రత్యుత్సాహః, సాగరవర్ణనం, విభీషణాభిషేకః సాగర ప్రవచనం, శైలోద్ధరణం, శైలపతనం, రత్నాకరలంఘనం, సుపేల వర్ణనం, ప్రదోష వర్ణనం, సీతావిలపనం, సేనా సన్నహనం, తుముల రణవర్ణనం, ద్వంద్వ రణవర్ణనం, దశముఖవధః అని. ప్రవరసేనుడు ఆర్యాగీతి ఛ్ఛందస్సును ప్రధానంగా వాడినాడు దీనికి ప్రథమ తృతీయ పాదాలలో పన్నెండు మాత్రలూ, ద్వితీయ చతుర్థ పాదాలలో ఇరవై మాత్రలూ వుంటాయి. యుద్ధాది వర్ణనలలో ఇతడు ఇతర మాత్రాఛ్ఛందసులను వాడకపోలేదు. ఈ సేతుబంధమే గౌడవహో మొదలయిన ప్రాకృత కావ్యాలకు ఒరవడి అయింది.

ప్రవరసేనుడు మహాకవుల కోవలోనివాడనడానికి దండిబాణ మహాకవుల ప్రశంసే తార్కాణం. ప్రాకృతభాషాయోషను తన ఇచ్చవచ్చిన రీతిని, తన కనుసన్నల్లో తిప్పుకొన్నాడీ కవి. రాజు కావడం వల్లనే కాబోలు యుద్ధ కాండనే తన కావ్య ప్రధాన వస్తువుగా గ్రహించినాడు. విషయ విభజన చాతురి, సముద్రాద్రి వర్ణన విదగ్ధత ఇతని పరిశీలన పాటవానికి దృష్టాంతాలు. సుగ్రీవుడు, సీత, త్రిజట వంటి పాత్రల పోషణలో ఇతడు చూపిన సమర్థతను చూడగా, రాజుగా వివిధ ప్రకృతుల పరిచయ పరిశీలనలతో సంపాదించిన పరిజ్ఞానాన్ని ఈ కావ్యంలో కుమ్మరించాడా అనిపిస్తుంది. ఇక అన్యోన్య తుముల యుద్ధ వర్ణనలను గురించి చెప్పనక్కరలేదు. మాతామహుని ఖండితదేశ విజయ యాత్రను చూచి వుంటాడు; స్వయంగా యుద్ధాలు నడిపించినవాడు అయి వుంటాడు. కనుకనే నిపుణమైన రాజకవి అనిపిస్తాడు. ఈ కావ్యంలో విషయ రస వర్ణనానుగుణంగా కథనరీతి మారుతుండడం చూడగా, ఒక నాయకుడు, ఒక రాజు, ఒక దూత, ఒక ప్రత్యక్షసాక్షి, జనపద భాషను పుక్కిట బట్టినవాడు ఉపన్యసిస్తున్నాడా అన్నట్టు వుంటుంది ఈ కావ్యం ఆమూలాగ్రం.

వాకాటులు వైష్ణవులు కనుక ఈ కావ్యం మధుమథనుని స్తుతితో ప్రారంభమవుతుంది:

ణమహ అవడ్ఢిఅ తుంగం
అవసారిఅ విత్థఅం అణోణఅగహిరమ్,
అప్పలహుఅ పరిసణ్హం
అణా అ పరమత్థ పాఉడం మహుమహణమ్. (1-1)
(నమత అవర్ధిత తుంగం
అప్రసారిత విస్తృత మ నవనత గభీరమ్)
అప్రలఘుక పరిశ్లక్ష్ణం
అజ్ఞాత పరమార్థ ప్రకటం మధుమథనమ్.)

మధుమథనుడు పంచభూతాత్మకుడు, అతనికంటే ఎత్తయినది లేదు. అతని కన్న పరమైనది లేదు. అతని కన్న గంభీరమైనది లేదు; లోతైనది లేదు అతని కన్న ప్రకాశకరమైనది లేదు — అని కవి ఉతిసవాలంగా తెలుపుతూ, మధుమథనుడు

పంచభూతాత్మకుడు, సదాశివుడు అని వర్ణిస్తూ, పశుతలను ఆవర్జించుకొంటాడు, తన వైపు. తను తొలిసారిగా దేశభాష అయిన ప్రాకృతంలో కావ్యం చెబుతున్నాడు గనుక కావ్యకథను నిర్వహించడం కష్టం అంటాడు:

అహిణఅ రాఅరద్ధా
చక్క ఖలిఏసు విహడిఅ పరిట్ఠవిఆ,
మేత్తీవ పముహ రసిఆ
ణివ్వోఢుం హోఇ దుక్కరం కవ్వకహా. (1-9)

(అభినవ రాగారబ్ధా
చ్యుత స్ఖలితేషు విఘటిత పరిస్థాపితా,
మైత్రీవ ప్రముఖ రసికా
నిర్వోఢుం భవతి దుష్కరం కావ్యకథా.)

కావ్య కథను నిర్వహించడం మైత్రిని నిలుపుకోవడం వంటిది చాల కష్టసాధ్యం అభినవ రాగంతో రెండూ ప్రారంభమవుతాయి తప్పులు, స్ఖలితాలు కలుగకుండా చూచుకోవాలి: అలాటివి కలిగితే తొలగించుకొని రాగాన్ని - అనురాగాన్ని రోచకతను మరల స్థాపించుకొనవలసివస్తుంది ఈ రెండింటినీ తుది వరకు నిర్వహించడానికి రసికత - సరసత అవసరం - అంటాడు కవి. ఇలాటి కావ్యాలవల్ల —

పరివడ్ఢఇ విణ్ణాణం
సంభావిజ్జఇ జసో విఢప్పంతి గుణా,
సువ్వఇ సుఉరిస చరిఅం
కిం తం జేణ ణ హరంతి కవ్వాలావా. (1-10)

(పరివర్ధతే విజ్ఞానం
సంభావ్యతే యశః అర్జ్యంతే గుణాః,
శ్రూయతే సుపురుష చరితం
కిం తత్ యేన న హరంతి కావ్యాలాపాః.)

విజ్ఞానం పెరుగుతుంది కీర్తి కలుగుతుంది, గుణాలు సంపన్నమవుతాయి. సత్పురుషుల చరితాలు తెలుసుకోవచ్చు. ఇలాటి కావ్యాలాపాలలో ఎవరి మనసును హరించే గుణాలు లేవు? - అని ప్రశ్నిస్తాడు. ఇది కావ్యాలాపాలను త్యజించాలి (కావ్యాలాపాంశ్చ వర్జయేత్) అనే స్మృతికి అంతకు సమాధానమయినట్లు తోస్తుంది. పరివడ్ఢఇ విణ్ణాణం అనే ఈ ప్రవరసేనుని సూక్తిని సర్వాలి అలంకారికులు కావ్య ప్రశస్తిని వివరించడానికి ప్రమాణంగా ఉదాహరించారు. "అభినవ వార్ధ గతితో ప్రతి ఆశ్వాసం చివర అనురాగ మనే పదం చిహ్నంగా అంకితం చేసిన దశముఖవధ మహాకావ్యాన్ని వినండి ఇది త్రిదశ బందీలను విడిపించిన గాథ. సీతా దుఃఖక్షయకరమైన గాథ. వినండి" అంటాడు.

తం తిఅస బంది మోక్ఖం
సమత్త తేల్లోక్క హిఅఅ సల్లుద్ధరణమ్.
సుణహ అణురాఅ ఇంధం
సీఆ దుక్ఖక్ఖఅం దసముహస్స వహమ్. (1-12)

(తం త్రిదశ బంది మోక్షం
సమస్త త్రైలోక్య హృదయ శల్యోద్ధరణమ్,
శృణుత అనురాగ చిహ్నం
సీతా దుఃఖక్షయం దశముఖస్య వధం.)

ఈ కావ్యం సుగ్రీవాభిషేకానంతరం రాముడు కిష్కింధలో ఉన్నప్పుడు వర్షర్తువు గడచి శరదృతువు ప్రవేశించడంతో ప్రారంభమవుతుంది. శరదృతువులో రాజులు జైత్ర యాత్రకు బయలు దేరడం పరిపాటి గనుక, ప్రవర సేనుడు రాజు గనుక రాజసంతో కావ్యాన్ని శరదృతు వర్ణనంతోనే మొదలుపెట్టా డనిపిస్తుంది.

శరదృతువు వర్ణన కూడ సమకాలాంశాలకు సంబంధం కలిగి రంజకంగా వుంటుంది.

సో హరివఇ జసబంధో
రాహవ జీఅస్స పఢమ హత్థావలంబో,
సీఆ బాహ విహాఓ
దసముహ వజ్ఝ దిఅహో ఉవగఓ సరఓ. (1-16)

(సా హరిపతి యశోబంధః
రాఘవ జీవస్య ప్రథమ హస్తావలంబః,
సీతాబాష్ప విఘాతః
దశముఖ వధ్య దివసః ఉపగతా శరత్.)

శరదృతువు వానరరాజయిన సుగ్రీవుని కీర్తి ముద్దవలె వుంది ; రాముని జీవితానికి మొదటి చేపట్టుగావుంది. సీతబాష్పాలను తుడిచేదిగాను, దశముఖుని వధ్య సమయంగాను వుందట. ఇలాటి శరత్సమయంలో అందరూ సీతా దర్శన వార్త కోసం వేచివున్నారు. రాముని ఆశాబంధమైన హనుమంతుడు సీతా దర్శన వార్తతో తిరిగి వస్తాడు. అతని అందరూ తమమనోరథమే తమ వద్దకు సుఖంగా చేరిందా అన్నంత సంతోషంతో చూస్తారు.

పఢమం చిఅ మారుఇణా
హరిస భరిజ్జంత లోఅణేణ ముహేణ,
జణఅ తణఅ పఉత్తి
పచ్ఛా వాఆఇ నిరవసేసం సిట్ఠా. (1-37)

(ప్రథమ మేవ మారుతినా
హర్షక్రియమాణ లోచనేన ముఖేన,
జనక తనయా ప్రవృత్తిః
పశ్చాద్వాచా నిరవశేషం శిష్టా.)

హనుమంతుడు మొదట సంతోషం తొణికిసలాడే కళ్లతోను, ముఖంతోను జనక తనయ కుశల వార్తను-ప్రవృత్తిని తెలిపాడు ; తర్వాత వాక్కులతో విరవ శేషంగా చెప్పాడు.

హనుమంతుడు 'సీతాదేవిని చూచినాను' అనినాడు. రాముడు వినీ విననట్టు ఉన్నాడు. 'సీతమ్మ క్షీణించిపోయింది.' అనినాడు. రాముడు డగ్గుత్తికతో నిట్టూర్చినాడు, 'మిమ్ములను గురించే శోకించుతూంది' అన్నాడు హనుమ. 'నాకోసమా ? తనకోసం కాదా?' అని రాముడు విలపించినాడు. 'జీవించి వుంది; ప్రాణాలతో వుంది' అన్నాడు మారుతి. 'మనం చేరేవరకు వుంటుందా ?' అని ప్రశ్నిస్తున్నట్లు రాముడు లేచి హనుమను కౌగలించుకొన్నాడు.

దిట్ఠంతి ణ సద్దహిఅం
ఝిణత్తి సబాహ మంథరం నిస్ససిఅమ్,
సోఅఇ తుమం తి రుణ్ణం
పహుణా జిఅఇత్తి మారుఈ అవఊఢో. (1-87)
(దృష్టేతి న శ్రద్ధితం
క్షీణేతి సబాష్ప మంథరం నిశ్శ్వసితమ్,
శోచతి త్వా మితి రుదితం
ప్రభుణా జీవతీతి మారుతి రవగూఢః.)

ఇక లంకకు బయలుదేరాలనే నిర్ణయం జరుగుతుంది, రాముని అభిప్రాయం ప్రకారం. అతడు అందరివైపు చూపు ప్రసారిస్తాడు. ఆ చూపు ఒకొరొకరికి ఒక్కొక్క విధంగా భాసించిందట.

సోహావ్వ లచ్ఛణ ముహం
వణ మాలవ్వ విఅడం హరివఇస్స ఉరమ్,
కిత్తివ్వ పవణ తణఅం
ఆణవ్వ బలాఇ సే విలగ్గఇ దిట్ఠీ. (1-48)

(శోభేవ లక్ష్మణ ముఖం
వనమాలేవ వికటం హరిపతేః ఉరః,
కీర్తి రివ పవన తనయం
ఆజ్ఞేవ బలాని తస్య విలగతే దృష్టిః.)

ఆ చూపు లక్ష్మణుని ముఖానికి శోభకలిగించిందట కపిరాజయిన సుగ్రీవుని వెగుడు దిగుడయిన రొమ్ము మీద వనమాల వేసినట్టయిందట. పవన తనయునికి ఒళ్ళంతా కీర్తి వ్యాపించి రంగరించినట్టయింది. కపిసైన్యానికి రావణ విజయ యాత్రకు అనతి ఇచ్చినట్టయింది.

కపి సేన సముద్రంవైపు బయలు దేరింది. చీకటి చెట్లలో నల్లగా తరంగ హస్తాలతో చల్లగా, పండిన ఏలకి తోటలలో సురభిళంగా, సముద్రమనే గజ రాజు మదరేఖవలెను ఉన్న సముద్రతటం చేరింది. ఇక సముద్రమా ?

ఎంత చూచినా తనివి తీరనిది. ఎంత విన్నా వినాలనిపించేది. సుకృత పరిపాకంవలె ఎంత అనుభవించినా ఎందరు ఎంతగా వాడుకున్నా శాశ్వత సుఖమిచ్చేది. మనోహరంగా ప్రకాశిస్తున్నది. సముద్రాన్ని కవి సుకృత పరిణామంతో పోల్చాడు. విశేషణాలన్నీ రెండింటికీ సమానమైనవి.

దీసంతం అహిరామం
సువ్వంతం అవిహావ్వాణ సోఅవ్వగుణం,
సుకఅస్స అ పరిణామం
పరిభుజ్జంతం పి సాసఅ సుహప్ఫలఅమ్. (2-10)

(దృశ్యమాన మభిరామం
శ్రూయమాణ మవ్యవిత్యప్నశ్రోతవ్య గుణమ్,
సుకృతస్య చ పరిణామం
పరిభుజ్యమాన మపి శాశ్వతసుఖప్రదమ్.)

గగనానికి ప్రతిబింబమా అన్నట్టు, ధరణికి నిర్గమన స్థానంలాగ, దిక్కులకు ఆశ్రయంలాగ, భువనానికి మణుల అరుగువలె, ప్రళయకాలపు అశేష జలపూరం వలెను కనిపించింది సముద్రం.

గగణస్స వ పడిబింబం
ధరణీఅ వ ణిగ్గమం దిసాణం వ ణిలఅమ్,
భువనస్స వ మణిసిలినం
పలఅస్స వ సావసేస జలవిచ్ఛడ్డం. (2-2)

(గగనస్యేవ ప్రతిబింబం
ధరణ్యా ఇవ నిర్గమం దిశా మివ నిలయం,
భువనస్యేవ మణికుట్టిమం
ప్రళయస్యేవ సావశేష జలవిస్తారం.)

ఇలాటి సముద్రం చూచి వానరులు భయపడ్డారు. దేహం వణకసాగింది. వెనక్కు తగ్గారు. సహజ చాపల్యమూ పోయింది. మరల సిగ్గుతో కుంచించుకు పోయారు. రెప్పపాటు కూడ లేక కళ్లు పెద్దవి చేసి, బొమ్మలవలె, చిత్రఫలకంలోని బొమ్మలవలె ఉండిపోయారు. చిత్రాలలోని దీపాలలాగ వెలవెల బోయారు.

సాఅర దంసణ హిత్థా
అక్కిత్తోసరిఅ వేవమాన సరీరా,
సహసా లిహిఅ వ్వ ఠిఅ
ణిప్పంద ణిరాఅలోఅణా కఇ ణివహా. (2-42)

(సాగర దర్శన త్రస్తాః
అతిప్రస్తృత వేపమాన శరీరాః
సహసాలిఖితా ఇవ స్థితాః
నిష్పంద నిరాయతలోచనాః కపినివహాః.)

ఇంత విశాలమయిన సముద్రం ఎలా దాటాడయ్యా! - అని వానరులందరికీ హనుమంతునిపై, అతని పరాక్రమంపై గౌరవం ఇనుమడించింది. సుగ్రీవుడు వారి దుస్థితి చూచాడు. రాజుగా, రామమిత్రుడుగా, యోద్ధగా, సేనానాయకుడుగా వారికి ప్రోత్సాహం కలిగించవలసిన ధర్మం తనదని గ్రహించాడు. రామునికి పని కల్పించవద్దన్నాడు. పిరికితనం మానుకొని ధీరులు కండని చెప్పాడు. అయినా వారు కదలలేదు, మెదలలేదు. సుగ్రీవుడు మరొకసారి ఉసిగొల్పాడు. సముద్రాన్ని ఊది పారేస్తాను. లంకను లాగి తెస్తాను అన్నాడు. వింధ్య పర్వతాన్ని తెగగొట్టి అడ్డంగా వేసి లంకకు నడచి వెళ్ళుతానన్నాడు.

తరిఉం ణహు ణవర ఇమం
వేలా వణ వఉల కుసుమ వాసిఅ సురహిమ్,
హత్థ ఉదేహి సమత్థా
తుమ్హే పాఉం పి ఫలరసం వ సముద్దమ్. (8-8)

(తరితుం న ఖలు కేవల మిమం
వేలావనవకుల కుసుమవాసిత సురభిమ్,
హస్త పుటేన సమర్థాః
యూయం పాతు మపి ఫలరస మివ సముద్రమ్.)

వకుల కుసుమ వాసితమైన తీరం ఉన్న ఈ సముద్రం దాటడం మీకు తెల్సా? దీనిని దోసిలిలోని పళ్ళరసం పీల్చివేసినట్టు పీల్చివేయగల సమర్థులు మీరు.- అని వారిని మరొకమారు ప్రోత్సహించాడు. సాహసం చేయకుండా దయనీయంగా జీవితం గడిపితే ప్రయోజనం ఏమిటి? అంతేకాక రాముడు మనకు ఉపకారం చేసినవాడు. ఆ ఋణం తీర్చుకోక పోతే మనం బ్రతికి చచ్చినట్టే- అని గట్టిగా చెప్పాడు.

సుగ్రీవుడు ప్రోత్సహించిన మూడవ ఆశ్వాసమంతా చూడగా, రాజు కవి తప్ప మరొకడు ఈ వీరకవిత చెప్పలేడని అనిపిస్తుంది.

జం సాహసం ణ కీరఇ
తం దయమాణేణ జీఇఅం కిం ధరిఅమ్,
జో అప్పడిముక్క సుకఓ
సోవి గణిజ్జఇ జఅమ్మి జీఅంత ముఓ. (8-18)
(యత్సాహసం న క్రియతే
తద్దయమానేన జీవితం కిం ధృతమ్,
యోఽ ప్రతిముక్త సుకృతః
సోపి గణ్యతే జగతి జీవన్మృతః.)

పదవ ఆశ్వాసంలో లంకాపురంలో రాత్రి, అంతఃపురవర్ణనం రాజాంతఃపుర వాసానుభవ భావితాంతఃకరణుడు తప్ప మరొకరు వర్ణించగలడా! - అనిపిస్తుంది. ఇది వాల్మీకి వర్ణనలకు చాలవరకు భిన్నంగా వుంటుంది. రాక్షస రమణులు శయ్యలపై బడి పొర్లుతున్నారు; అలసి సొలసి ఉన్నారు; పరవశంగా పడి

పడివున్నారు; నిట్టూరుస్తున్నారు. ఇది మదన పారవశ్యమా, మధు మథనుని అవతారమైన రాముని వల్ల కలిగిన భయమా? అని ఉత్ప్రేక్షిస్తాడు కవి.

> వేవఇ ససఇ కిలిమ్మఇ
> వఅణే అముఅఇ ణీసహంగాఇ,
> ణ విఆణఇ కి భీఓ
> ఓ మఅణ పరవ్వసో విలాసినీ సత్థో. (10-69)
> (వేపతే శ్వసితి క్లామ్యతి
> శయనే అముంచతి నిస్సహాంగాని,
> న విజ్ఞాయతే కిం భీతః
> ఉత మదన పరవశో విలాసినీసార్థః.)

ప్రవర సేనుని అపూర్వ సృష్టి సేతుబంధం. దీనిని నలుడు నిర్మించిన తీరు, కపివరులు తెస్తున్న కొండలను అందుకోవడం, అమర్చడం, ప్రక్కనుంచి అందిస్తున్న కొండలను నడుము తిప్పి పట్టుకోవడం, కపివరులు ఎడమభుజంపై కొండలను మోసుకొని, వాటి శిఖరాన్ని కుడిచేత్తో పట్టుకొవడం, ఎడమ చేతిని నడుము మీద పెట్టుకొని వంచి కొండకు ఆసరా చేసుకోవడం, కొండను ఇద్దరు చేతులు కలిసి పెట్టుకొని మోసుకొని రావడం, సందును చూచి గుండ్లను విసరడం, అడుగు నుంచి నీరు ఉబికి రాకుండా పెద్దగుండును, బండను విసరడం, అలలు కొట్టి సందులు విడిచిన కట్టడాన్ని చిన్న కంకరతో మూయడం, కట్టిన సేతువును బరువు మోస్తుందో లేదో అని చూచి ముందుకు పోవడం, సముద్రం అడుగుదాక పునాది (స్థాణం) వేయడం, ఎగుడు దిగుడు లేకుండ ఊపినద్దడం – మొదలయిన విధానాన్ని సూక్ష్మాతిసూక్ష్మంగా, విపులంగా వర్ణించాడు. సేతువును నలపథమని అన్నాడు. నలుడు కట్టినాడు గనుక. నిజానికి ఈ కావ్యాన్ని సేతుబంధం అనకుండ నలపథం అని ఉంటే మరీ బాగుండేదేమో! ప్రవరసేనుడు ఇలాంటి వంతెనలు, కట్టడాలు కట్టించి, వాటిని బాగా పర్యవేక్షించి పరిశీలించివుంటాడు.

ప్రవరసేనుని మరొక అపూర్వ సృష్టి రావణకల్పిత కృత్రిమ రామ శిరస్సును చూచిన సీత విలాపం. ఈ కరుణమే భవభూతికి మాతృక అయిందా?–అనిపిస్తుంది. మనసాహిత్యంలో గాంధారీవిలాపం, మహాశ్వేతా విలాపంవంటి విలాపాలు ఎన్నో ఉన్నాయి. కాని, ఇవన్నీ ప్రవర సేనుని సీతావిలాపంతో పాటిరావనిపిస్తుంది. ఇదొక కరుణరసకమనీయ కావ్య ఖండిక.

అశోకవనంలో రెండు చెంపలకూ చేతులు చేర్చి నిట్టూరుస్తూ, నేలపై దృష్టి నిలిపి కూర్చున్న సీతమ్మముందు రాక్షసులు జయపడుతూ, భయపడుతూ అప్పుడే నరకగా పచ్చిమాంసమూ, రక్తమూ ముసిరిన తలను – రాముని తలను పోలిన దానిని, ధనుస్సు పట్టుకొన్న తెగిన ఎడమ చేతిని పడవేస్తారు. అకస్మాత్తుగా పడిన వాటిని చూచి ఆమె తెలివి తప్పి ఎడమవైపు ఒరిగింది. అప్పుడామె కుడి పార్శ్వం ఎత్తుగా కనిపించింది. కళ్లు నీటితో నిండిపోయాయి. కనుక రాముని తలను బాహువును చూడ లేకపోయింది. అదురుతున్న పెదవుల వల్ల మాత్రమే నిట్టూరుస్తున్నట్టు తెలియ వచ్చింది. కన్నీళ్లతోనే కళ్లు విప్పి చూచింది. ఏమీ తోచలేదు. భూమి మీదవాలి పోయింది. చేతులు చాచింది.

వేణీబంధం చెదరిపోయింది. దుమ్ము రేగిన భూమి మీద పడి పోవటం వల్ల, భూమికి అంటుకొని పోవడం వల్ల పయోధరాలు అణగి చక్రాల లాగ అయ్యాయి.

ణవరి అ పసారిఅంగీ
రఅభరి ఉప్పుహ పఇణ్ణ . ణీ బంధా,
పడిఆ ఉరసందాణిఅ
మహిఅల చక్కలిఇఅ ణీ జనఅసుఆ. (11-67)
(అనంతరం చ ప్రసారితాంగీ
రజో ధృతో త్పథ ప్రకీర్ణ వేణీబంధా,
పతితోరస్పందానిత
మహీతల చక్రీకృత స్తనీ జనకసుతా.)

"నాథా, ఏమిటో మాంసం ముద్ద దగ్గరికి తెస్తున్నారని పలవించిచాను. కళ్లు తెరిచి చూచాను. నీముఖం స్పష్టంగా కనిపించింది. సిగ్గులేకుండా ఏడ్చాను. నాకిక కన్నీళ్లు మిగుల లేదు. ఆశాబంధం కూడ నా హృదయానికిక లేదు. మరి ఇంకా ఈ ప్రాణాలున్నాయే? ఎందువల్లనో నాకు తెలియడం లేదే!" అని విలపించింది జనక తనయ.

పాహం న ధరేఇ ముహం
ఆసాబందో వి మే ణ రుంధఇ హిఅఅమ్,
ణవరం చింతిజ్జంతే
ణ విణిజ్జఇ కేణ జీవిఅం సంరుద్ధమ్! (11-81)

(బాష్పం న ధారయతి ముఖం
ఆశాబంధో హి మే న రుణద్ధి హృదయమ్,
అనంతరం చ చింత్యమానే,
న విజ్ఞాయతే కేన జీవితం సంరుద్ధం?)

ఈ విధంగా విలపిస్తున్న సీతను త్రిజట ఇదంతా మాయ అని ఊరడిస్తుంది. సీతా విలాపం చదువుతుంటే, కుమార సంభవంలోని రతివిలాపం చప్పున జ్ఞాపకం వస్తుంది.

అథ సా పునరేవ విహ్వలా
వసుధాలింగన ధూసర స్తనీ,
విలలాప వికీర్ణ మూర్ధజా
సమదుఃఖా మివ కుర్వతీ స్థలీమ్॥ (కుమార. ౪వ సర్గ.)

శోకమూర్తి అయిన రతీదేవి చిత్రం కాళిదాస ప్రవరసేనుల భావుకతా సామ్యం తెలుపు తున్నది.

యుద్ధ వర్ణనలోను ప్రవరసేనుడు తన రాజరికాన్ని విశిష్టంగా తెలుపుకొన్నాడు. వివిధ సంగ్రామాలను, రామ రావణ ద్వంద్వయుద్ధాన్ని యుద్ధ తంత్ర కౌశలంతో వర్ణించాడు. రాజకవులకు, రాజరంజక కవులకు గల భేదం ఇలాటి పట్టులలోనే స్పష్ట మవుతుంది.

రావణుడు కూలిపోయాడు. రఘుపతి అగ్నిపునీత అయిన సీతను, నిప్పులో కాగిన బంగారు కడ్డీని గ్రహించినట్టుగా గ్రహించి భరతుని అనురాగం సఫలం చేయడానికి అయోధ్యాపురి చేరుతాడు.

ఘేత్తూణ జణఅ తణఅం
కంచణ లట్ఠిం వ హుఅవహమ్మి విసుద్ధమ్,
పత్తో పురిం రఘువఈ
కాఉం భరతస్స సప్ఫలం అణురాఅమ్. (15-98)

గృహీత్వా జనక తనయాం
కాంచన యష్టి మివ హుతవహే విశుద్ధామ్,
ప్రాప్తః పురీం రఘుపతిః
కర్తుం భరతస్య సఫల మనురాగమ్.)

ప్రవర సేనుని యుద్ధ వీథి, సేతుబంధన ప్రక్రియ, సేనా వ్యూహ చమత్కృతి అనుభవ సిద్ధాలని కావ్యపరిశీలనతో స్పష్ట మవుతుంది.

బౌద్ధ జైన సంప్రదాయలలో రామాయణ గాథ వివిధ విధాలుగా ప్రచలితమై ప్రజలను పెడదారి పట్టిస్తున్న దన్న ఆవేదన కలిగింది కాబోలు ప్రవర సేనునికి. విష్ణు భక్త శిఖామణి కనుకనే వాల్మీకిని అనుసరించి ధర్మ స్థాపనకోసమై సేతు బంధ కావ్యం ప్రాకృతంలో-ప్రజల భాష అయిన ప్రాకృతంలో-రచించాడని నా విశ్వాసం. కాళిదాసు కూడ ఈ దృష్టితోనే రామ కథను రఘు వంశ కావ్యంగా చెప్పాడనుకుంటాను[3]. సర్గ అధ్యాయాది విభాగం సంస్కృత సాహిత్యంలో ప్రచురంగా వుండగా, ఆశ్వాసమనే విభాగం కన్నడ తెలుగు కావ్యాలలో గ్రహించడానికి కారణం ఈ సేతు బంధంలోని ఆశ్వాస పరిగణనమే నని నా ఊహ. కన్నడ తెలుగు కవులు, లాక్షణికులు ప్రాకృత భాషా సాహిత్య ప్రక్రియలతో ప్రభావితులై వాటిని అనుసరించారు.

ప్రవరసేనుడు ప్రస్తావాంతరంలో అన్నట్టు బంధచ్ఛాయతో అభినవార్థ గతి సంభావితమైన ఈ ప్రాకృత కావ్యాన్ని తెలుగు వారు అధ్యయనం చేయడం చాలఅవసరం.

---

3. చూడండి నా వ్యాసం — ప్రాకృతంలో రామకథ (భారతి 1976)

149

# "A Bride leaves her parental Home"

( A PERIOD PIECE set in the times and literary style of "Gatha Saptasati" of Hala. )

" Nayanika"

" .........."

" Nayanika-a!!"

" .........."

" Lachinika, have you seen Nayanika ? Her Highness Madam Balasiri wants her to be fetched immediately. I have looked for her everywhere."

" Dakshamitra ! How do I know where she is?. But wait. May be she is at the lotus pond outside the town. Shall we look for her there ? "

2

" Look ! there she is. Isn't that sweet fragranse of Patala blossoms coming from the lake side ? Isn't that the pallav of her rainbow saree which is fluttering in the ever so gentle breeze ?"

" Take another look, Dakshamitra See our friend lost in thoughts, sitting like a statue?"

" Nayanika..Nayanika-a ! "

" My gosh, what a rampus you kick up, Lachinika...... Dakshamitra, should you not at least be a little more considerate. Should my sweet reverie be.. "

" But may I know what caused this..your little reverie, as you call it ? What were you looking at in the lotus pond, with eyes widened and mouth open ?..Lachinika, doesn't the blue sky reflected on the calm lake create the impression of the sky having been pushed over into the lake by a naughty boy ? And yet..even though the big sky has fallen into it.. the water has not been disturbed. Not a single lotus has been crushed. Nor has a swan flown off... Is that what you are thinking, so deeply engrossed, Nayanika ?"

" You are completely mistaken, Dakhamitra ! Don't you see a crane there lying still and hunddle up on the lotus leaf ? Doesn't it remind you of a conch on an emerald plate ? Our little friend is wondering how it would be if the emerald plate gave up her sweet urn in offering to the gods. "

" Enough, enough. You have both lost your heads. All right..."

" You and your rights and lefts. Your mother has sent us to fetch you there immediately. And, here you are . . ."

" Wait a minute, please ! When is mother not in a hurry ? Now, listen . . . . . Do you remember that day ? We were in Velagiri for the spring festival. The very air was gay. The full moon tickled you little more with her cool rays. The horn, the trumpet and the pipe . . . each tried to out-blow the other. Every one threw the saffron powder and squirted colour water on everyone else. Young maids in sarees of every shade of coloured flowers were flitting hither and thither. It looked as if Nature had blessed every girl with tender leaves, buds and flowers. They were dancing wearing in the ears or in the coiffure black Tulips, Jambu leaf-buds, Patala flower bunches, balls of Madhuka blossoms, Jasmin, Maruva, Ankola leaf-buds or just grass . .Then, an youngman approched us.. Western costume, dialect . . . He snatched the saffron powder from our fists ... What a style . . . I forgot myself . . . "

"Oh..oh! Just as I imagined, Lachlnika I thought that much when I saw her sitting still and stationary by the lakeside. The Love-God has hit our young friend with his flower-arrow and thrown the lotus dust in her eyes and on her heart."

"Tut, tut! What a rot you are talking! You are always like this. That is why I don't confide in you."

"Oh Nayanika, my Nayanika!"

3

"Hey, Ushabhanaka! What is all this haste about? Where are you coming from..and, where are you going?"

"Oh ! Pottisayya. Namaste. May lord Arhant bless you: It is indeed a faraway place that I have come from. I returned only this morning from Dhambika in Govardhana province."

"You don't really say so, do you, Ushabanaka? Where is our Veeripuram in Kudura province and where, I ask you, is Dhambika in Govardhana? Did you really go all the way from the Krishna coast to the very source of River Godavari?"

" I really had no choice, Pottisayya. The mission was of that nature. It brooked no delay. Further, I was set on it by ...."

" Why, you are blusing?"

"Nothing at all. You know Dakshamitra. It was an ordinance that provided for no appeal."

"I know..I know what Dakshmitra means to you. Can we, mere men, do anything but bow to their order? Well, one cannot but bow to a sweetheart's orders? But, you have not told me what the mission was about? You need't tell me, though, if it is hush-hush"

"I never keep any secret from you, do I? You are such a well wisher. And, I have come to you now in connection with that very mission. So, why keep things back from you".

"Then, why all this hesitation? Do you mean to say there is a mission which you cannot accomplish? You are a man who will return with those very stars gathered in your upper cloth, if asked to. Is it for nothing that you have such influence with Jebubhuti, head of our Traders' Guild?"

"Come, come. Let my influence be with the poor head of a Traders' Guild. But listen. You know our Gramani Vinnayya. Have you seen his daughter?"

"That is a nice question to ask. Me, not know the Gramani? His daughter is the brightest star of our town. Her long eyes, her just ripening breasts, her....Well one cannot take one's eyes off her. Her beauty, is something of a legend. I believe her name is Na-ya".

"That is right, Nayanika. She saw an youngman at the last Vasantotsava. Eyes met eyes. Hearts did not lag behind. Daksha-mitra was taken into confidence. She set me the task of tracing this charming lad immediately, finding out his family background, his own desires, and if the coast was clear of setting an early wedding date. Hence a ten months' wandering."

"Sure, sure. That was a long journey that you made."

"The distance did not really matter. Are we not in the empire of Hala Satavahana? Wide roads, frequent road side resting places, guest houses and godowns. And, our peoples' goodness and hospitality leave nothing to be desired. If I got tired, I could always rest underneath the Banyan tree at the entrance of a village. I say a good Banyan tree at a village's entrance is as good as whole villags full of good people At one village, I saw white spots all over the Banyan tree, and I was hesitant to sleep underneath, having mistaken

them for crow dropping.They howevrr turned out to be a devise to discou rage depredation of foliage. Some one had sprinkled chalk on the trunk and the branches. I could not help admire the clever people. All villagers are beautiful. As you enter a village, you see temples and small tanks. Within the village, every house has a fence and Castor and flower plants are grown within. At nightfall, I could always sleep on the varandah of any house. The good housewife gives you a bundle of hay. All I have to do is spread it even, put my angavastra over it, and sleep off. Summer months are a bit hard. The sky literally rains fire then. The tank and water-holes get dry. One day I saw a pot dangling in a well. I went near to see if there was any water. . ."

"Just a minute, Ushabhanaka. The pulley in a well reminds me of blackguards. The pot goes into the well over the pulley with its top bent, but it comes up erect filled with water. Likewise a rogue is in all humility while seeking a favour. You must see his face once he obtains the favour. I suppose you did not fall into the clutches of any rogues of that sort. . . ."

"No, not at all. In all my wanderings, none tried to play any tricks on me. Now, this well I was speaking of had completely gone dry. I dragged my feet to the nearby hamlet. I quenched myself at the travellers' shelter where water is distributed. If ever there was a water shelter this was the one. The head man of the village had posted a damsel to serve water. More than the thirsty, those thirsting for a look at her gather there. As I stood watching human weakness, people suddenly began rushing away with pots full of water. What else but our usual summer festival ? A fire outbreak it was. I secured a water pot myself and took position on the line formed to pass the pots hand to hand straight to the place of fire. I wonder where it was hiding, it suddenly bit me. . . .a scorpion. My god, how it burnt and what a pain! Some one chanted a few mantrams. A doctor came hurrying. The potion was bitter, but I gulped it in, eyeing the beautiful girl who handed it over.

"I moved on. The rains came. Roads became quagmires. I shall always remember the housewife who gave me shelter one night. The house leaked all over. That lady, may God bless her, showed me to the only dry corner and herself kept vigil all night. An interesting incident occured in that village. A farmer's buffalo was swept away in the floods. Superstitious that he was, he thought he would not get the like of it again, and presented its bell-strap to the village temple. Altogether, I could not make much progress during the rains. I had to break journey frequently.

"The rains stopped. The road was still sodden. It was like the heart of a goodman : outwardly tough bult soft inside. Beautiful scenary on both sides of the road. At one place the farmer had just

about completed sowing seeds. I saw a farmer behind a plough forget himself, watching his coquetish wife walking up with the food basket balanced on her head. A cotton pod burst just then as if unable to contain its laughter after seeing the former couple.

"I moved on. The pigs in some villages were feasting on barely sown in the open. The cattle had broken into a cotton field at one place and were calmly grazing. I walked on and on, enjoying the scenery: tall sesamum fields on one side, and hemp fields like dancing girls smeared with yellow paint on the other. And, sugarcane fields. The journey became really enjoyable when I could walk listening to the villagers at the top of their voice singing folk songs while the moonlight was spread over the earth like rice flour.

"Soon it was winter. I had to stay one day in a village which had all but gone to seeks. I could not believe there could be such a village in the Satavahana Empire. A dilapidated temple was where I tried to keep myself warm with a fire made of twigs and dry grass. Every time the fire died down and you disturbed the remains with your staff, you felt as if you were cutting a bear open. At another place, we were guests of a poor family. I could not bear the sight of them trying to keep warm near a cow-dung fire from which a bad-smelling smoke emanated and covering themselves with clothes which had come off at their seams. There was a simple yokel in that village. He had sold his rug to buy a bull. To my inquiry whether he did not feel the chill, he replied: "Don't worry. I have an young woman with two hot..."

"By then I had reached Govardhana province and Dhambika village was not very far. I made enquiries about the Gramani's son. He is quite a guy. His bride-to-be may not be able to sleep on his broad, battle-scarred chest, bnt the entire village sleeps at nights with hands on their chest and not a concern in the world. His name is Nagabhuti. Gramani Annayyadeva is well known for his valour. Formerly the village folk would flee their homes whenever, and that was too very frequent, the highwaymen raided the village. Not so under the present Gramani. His father had, on the deathbed, told him to so conduct himself that he would not be ashamed of his name. I am happy our Nayanika has chosen such a fine House.

"Immediately after the ablutions the next morning, I went to the Gramani's house. It is well built. The mango tree in the court yard had just blossomed. The Patali tree was growing in the backyard; there was also an Ankola tree which in those parts is supposed to protect you against evil planetary influence. Do you know? The fragrance of Ankola flowers revives those fallen into a coma.

"Well, here I am with the mission accomplished".

"Congratulations! You are the man to get things done. I will get ready with a slate and pencil. Vinnayya might want me to set the wedding date early".

"Right then, we shall meet at the Nuptials".

4

"Lachinika, Dakshamitra, what are you doing ? How will things get done unless each of you takes charge of a task?"

"Yes, Madam, in a second. Come on, Dakshamitra. Can't you hear Madam Balasiri's summons The wedding hour is fast approaching. Let me fetch the other friends.

"Aparenuka, tie that emerald necklace around the bride's neck. Juvarinika, part her hair and run the comb through and set up the coiffure. Bhattapalika, paint the Tilaka on her forehead. Madhavi, annoint her feet with red resin. Ooleerasathi, have you drawn the collyrium along the eyelashes? Reva it is time to set the flowers in the coiffure. Roha, help her draw up the blue blouse to set her beauty off like the moon amidst black clouds. Anulaehi, put the string of pearls in place ... it will give her the charm of the foam on wavecrests of River Yamuna. Asuladdi, tie that gold girdle around the blue blouse. This girdle is truly blessed. Hasn't it gone through the Syamasabala vrata-gone through fire and dipped in water ? These jewellery blind your eyes. This is eighteen carat gold; not an alloy by any means. Vinnayya Gramani personally tested it on the touch-stone, and had the gems examined by experts. Paha, will you check whether the flower girl has brought the garlands. Remove that jaded garland across the welcome arch and hang a fresh one. Lilavayi, have the sacred vessels placed near the doorstep and make sure the lotus flowers are placed in them. Musicians, it is time you began your auspicious songs.

"Hark, the bridal music is in praise of the groom. Look at the bride. How excited she is. Wonder what sweet desires our Nayanika is writing on the slate of her heart with the pencil of wishes Let the instrumentalists now begin.

"This really is wonderful. From other provinces, kingsmen like Aryakas, Bhandarikas, Heranikas and Bhojakas have come for the wedding in the Gramani's house. The Commander of the Emperor himself has sent a caparisoned elephant complete with the kettle drum.

"Madam Balasiri herself is supervising the preparations for the wedding feast. Special dishes and pastries are fast piling up. Look at that woman pounding rice flour for the sweet cake. With the flour all over her, she looks like Goddess Lakshmi rising from the ocean of milk. There, laddus and modakas are being made. See this woman,

she is out to challenge the moon with her face all smeared by the kitchen black. Just turn your eyes that way and see that women who is trying to kindle the fire in the oven. More she blows, more the fire God seemes to desire her sweet breath, so He refuses to flare up. Dakshamitra, doesn't this woman's flour-covered breasts look like two swans near the lotus of her face. That woman is busy turning over the rice in the pot with a wooden laddle.

"The kids are kicking up quite a shindy in the marriage pandal. One little boy is feeding the cat with gravy. Another has pushed mustard leaves down the mokey's throat. The monkey is now beating her tummy and hiccuping. The other monkey doesn't want anything to do with that blue berry. She thinks the fruit is a moth just because the moth has already bitten into it."

5

"Tut, tut. You shouldn't weep. Should you wet your eyes when you are going away with a lover of your own choice, after performing the Chathurthi Mangala and the Nagavalli?"

"Lachinikia Dakhamitra! I cannot bear this pain of seperation. How can I tear myself away from you and this lotus lake? I want to stay away here at the village boundary. Let him go alone."

"What a fool you are? can you avoid it? Women are like mango cutting. Cut here and grafted there, they stick on.....to bear sweet fruits. That is the world."

(Translated into English by Sri Prasanna Kumar Gupta from the Telugu original "Ampakalu" by me.)

---

